# పట్టు చీరల నిలయం

హోల్ సేల్ రేట్లకే

రిటైల్ గా అమ్మే ఏకైక షోరూమ్.

పెండ్లిళ్ల కై...



వస్త్ర జగత్తులో విస్తృత శ్రేణి.

## చందన బ్రదర్స్ (A.C)

లేడీస్ & జంట్స్ క్లాత్ షోరూమ్

జగదాంబ సెంటర్

విశాఖపట్నం



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయటం మంచిది.

1. **"సమీక్ష"** అరఠావుకి మించకుండా, కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల **20**వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింద కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **'చతుర' సమీక్షకు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-**500 482** అనే చిరునామాకు పోస్టు చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపిక చేసి, ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

### మే 'చతుర' నవల అంతర్మథనం

సమీక్షకుని పేరు: ..........................................

చిరునామా: ..........................................

..........................................

..........................................

..........................................

# కొత్త సెరిలాక్ ఆరంజ్




## మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం

మీ పాపాయికి మరొక లాభాన్ని అందజేసేందుకు యిదిగో కొత్త సెరిలాక్ ఆరంజ్. మీ పాపాయి కొత్త రుచులను అలవరుచుకున్నప్పుడు, అతని ఆహారంలో మరింత వైవిధ్యం తెచ్చే లాభం. దీనితోబాటు నారింజ మంచితనం కూడా లభిస్తుంది.

మీరు మీ పాపాయికి సెరిలాక్ ఆరంజ్ యిస్తున్నారంటే, అతనికి సెరిలాక్ లాభాలన్నింటినీ యిస్తూనే ఉన్నారన్న మాట-ప్రతి సారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి, చక్కటి రుచి, క్షణాలలో తయారు కావడం.

కాబట్టి, పాలు త్రాగించడంతోబాటు, 4 నెలల నుంచి అతనికి సెరిలాక్ వీట్, 6 నెలల నుంచి సెరిలాక్ ఆపిల్/క్రొత్త సెరిలాక్ ఆరంజ్ యివ్వండి-మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందజేసేందుకు రుచి కరమైన మూడు మార్గాలు.

పరిశుభ్రంగా తయారు చేయడానికి, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకూగాను, దయచేసి డబ్బా మీద ఉన్న సూచనలు జాగ్రత్తగా అనుసరించండి.






Nestlé

R K SWAMY/FSL/4974-TEL




# 'అరాజకీయం'పై సమీక్షలు

'చతుర' నవలల పోటీలో ప్రత్యేక నవలగా ఎన్నికై 'మార్చి' సంచికలో ప్రచురితమైన పాలకోడేటి సత్యనారాయణరావు గారి 'అరాజకీయం'పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈసంచికలో ప్రచురిస్తున్నాము.

## సమకాలీన రాజకీయ వైకుంఠపాళి

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

ప్రస్తుత రాజకీయ పరిస్థితులను ప్రతిబింబించేవిధంగా రచయిత చేసిన ప్రయత్నం కొంతవరకు సఫలం అయిందనే చెప్పవచ్చు. ఈ వ్యవస్థలో ఏ మాత్రం చదువు, విచక్షణాజ్ఞానం లేకపోయినా మంత్రిపదవి చేపట్టవచ్చని వరహాలరావు పాత్రద్వారా రచయిత చెప్పినతీరు బాగుంది. కనీస అక్షరజ్ఞానం కూడా లేకుండా కేవలం అర్థబలంతోనో, అంగబలంతోనో రాజకీయనాయకులుగా చెలామణి అవుతున్నవారు దేశంకోసం అహర్నిశలూ పాటుబడుతున్న మేధావి వర్గాన్ని మూర్ఖత్వంతో శాసించటం ఒకవిధంగా మనదేశానికి పట్టిన దౌర్భాగ్యం అనవచ్చు.

రాజకీయనాయకుల అకృత్యాలను, అవినీతిని పూర్తి వివరాలతో పాఠకులకు అందిస్తూ, ఎటువంటి ఒత్తిడులకు, బెదిరింపులకు లొంగక, మొక్కవోని ధైర్యంతో పత్రికను నడిపిస్తూ, హఠాత్తుగా రాజకీయనాయకుల గూండాలచేతిలో పట్టవగలు, ఆంధ్రదేశంలోని ఒక పెద్ద పట్టణంలో హత్యచేయబడ్డ యువ సంపాదకుడిని ఈ నవలలోని వాచస్పతి పాత్ర గుర్తుకుతెస్తుంది.

పత్రికలలో వచ్చిన వార్తల ఆధారంగా అవినీతి మంత్రులకు ఉద్వాసన పలకటం అభిలషణీయమే. అయినప్పటికీ, అప్పటిదాకా ముఖ్యమంత్రి గోవిందరావు ఏమీ తెలియనట్లు ఉండటం, గూఢాచారయంత్రాంగం యొక్క ఉదాసీనత, ముఖ్యమంత్రి తన మంత్రివర్గంలోనే ఉన్న అంతర్గత తిరుగుబాటుదారులను అనుమానించలేకపోవటం కొంత అసహజంగానే ఉంది.

ముఖ్యమంత్రి గోవిందరావు భార్య మైథిలికి మంత్రిపదవి చేపట్టాలనే కాంక్ష ఎంతవున్నా ప్రతిసారీ తనను మంత్రివర్గంలోకి తీసుకోమంటూ భర్తను అభ్యర్థించటం, కథనంలో కొంత విసుగు అన్పించకమానదు. పోలీసులు నేరస్తులను హత్యచేసి ఏవిధంగా నేర్పుగా దాన్ని ఆత్మహత్యగా నిరూపించగలరో రాజమల్లు విషయంలో చక్కగా వర్ణించారు రచయిత.




మంత్రుల గురించి తనకు సమాచారాన్ని అందిస్తున్న వ్యక్తి 'తననుండి ఏమి ఆశించి ఆ సమాచారాన్ని అందిస్తున్నాడో, తనను ఏవిధంగా బలిపశువుచేయదల్చుకున్నాడో, ఆ వ్యక్తి ఆశయం ఏమిటి? అనే కనీస ఆలోచన జర్నలిస్ట్ వాచస్పతికి ఎందుకురాలేదో అర్థంకాదు.

ముత్తయ్య వంటి కుహనారాజకీయనాయకుల వలన సామాన్యప్రజానీకం ఎలా మోసపోతున్నారో విదితమవుతుంది. 'రాజకీయాలు అవినీతిపరుల ఆఖరి మజిలీ' అనే విషయం ఈ నవల చక్కగా నిరూపించింది.

—చందు వెంకటేశ్వరరావు రాయచూరు.

## ఓస్... అంతేకదా!

**(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

'అరాజకీయం' నవలలోని రాజకీయం మాకు ఘాటుగా అనిపించలేదు. నాటుసారా రుచిమరిగిన వారికి బీరు కిక్కియ్యనట్లుగానే హత్యారాజకీయాలను ప్రత్యక్షంగా చూస్తున్న మాకు అరాజకీయం ప్చ్ అనిపించింది. భారతంనుండి నేటిదాకా జరిగిన భారత చరిత్రవలన మనకు తెలిసిందొక్కటే- రాజ్యకాంక్షగలవారు తమకు అడ్డునిలిచిన వారెవరైనా చివరకు జన్మనిచ్చిన పితరులన్నా లెక్కచేయక - అవసరమయితే హత్యలుచేసయినా సరే సింహాసనం ఎక్కాలని చూస్తారు. "ముఖ్యమంత్రి గోవిందరావును అతని భార్య మైథిలి వాచస్పతి ద్వారా, అతిలౌక్యంగా పదవినుండి తోసివేసి ముఖ్యమంత్రి అవడం" నవలా సారాంశం. మరో మంత్రి కొడుకు సురేష్‌కు మార్ రాసక్రీడల ఫొటోలు, ఇన్ఫర్మేషన్ వాచస్పతికి అందించడంతో ఆమె ఆరంభించిన ఎత్తుగడలను వాచస్పతి అంతంతో ముగించి ముఖ్యమంత్రి అయింది. నీతి-న్యాయం, దేశోద్ధరణ, ప్రజాక్షేమం, దేశభక్తి అంటూ ప్రేలాపనలు చేసేవారికి వాచస్పతి హత్య కొత్తగా కనువిప్పు కలిగించేదేమీ లేదు- ఎందుకంటే ఎందరో వాచస్పతులు పట్టపగలు నట్టనడివీధుల్లో అన్యాయంగా అసువులు కోల్పోయిన రాజకీయచరిత్రగల దేశమిది - వరహాల్రావ్ లాంటి మూర్ఖమంత్రిసత్తములు జిల్లాకొకడున్న భారతం మనది- ముత్తయ్యలాంటి వీధి రౌడీలను మంత్రిగా ఏంఖర్మ అవసరమైతే ముఖ్యమంత్రిగా లేదా ప్రధానమంత్రిగా ఎదగనిచ్చేంత సౌలభ్యంగల రాజ్యాంగం, ఔదార్యం మనకున్నది. రోజుకెందరు అమాయక బడుగుజీవులైన రాజమల్లులను అధికారపు పెంపుడు తోడేళ్లయిన రత్నానందులు పొట్టన బెట్టుకొనడంలేదు. ఇవన్నీ ప్రతినిత్యం పత్రికల మొదటిపేజీల్లో ప్రత్యక్షమేకదా! కనుకనే ఇంత సున్నితంగా అల్లబడిన 'అరాజకీయం' మాకేమాత్రం కిక్కివ్వలేదు.

ధనాకాంక్షాపరులైన రాజకీయవ్యాపారుల హస్తగతమైన అధికార లక్ష్మికి ప్రతిసారీ మానభంగం జరుగక తప్పదు- అల్పసంఖ్యాకులైన అజ్ఞులు, విజ్ఞులు నిర్లిప్తంగా కళ్లుతేలవేసి చూస్తూంటే అధికసంఖ్యాకులైన అల్పజ్ఞానులు పదవీరాజకీయ వ్యాపార నిమగ్నులై దేశచరిత్రకు తలవంపులు తెస్తున్నారు... ఇంకా తెస్తారు- దీనికి అంతాన్ని కాలం, ప్రజలే నిర్ణయించాలి. అంతవరకూ మనం ముఖ్యమంత్రి పదవినధిరోహించిన మైథిలీరావులకు ఎలుగెత్తి జేజేలు కొడుతూ, రాజమల్లు, వాచస్పతుల వంటివారి దారుణహత్యలకు ఒక్క కన్నీటిబొట్టు వదిలి మన పాపాల్ని మనమే ప్రక్షాళణ గావించుకుందాం.

— సి. హెచ్. కిషన్. రుద్రపాక

## వార్తలతో అల్లిన నవల

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

అరాజకీయం నేటి రాజకీయాల కుళ్లుకన్నా ఈ ప్రజాస్వామ్యంలో పత్రికాస్వాతంత్ర్యం, జర్నలిస్టుల అగచాట్లను చక్కగా చూపించింది. వాచస్పతిలో ఒరిస్సా సీనియర్ జర్నలిస్టు శ్రీ ప్రశాంత్ పట్నాయక్‌ను దశాబ్దం క్రితం ఒరిస్సాలో రాజకీయ గూండాలచే దారుణంగా చెరచబడి హత్య గావించబడిన శ్రీమతి చబిరాణి భర్త నబకిషోర్ మహాపాత్రను చూడగలిగాం. పత్రికా స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం అని గొంతు చించుకునే రాజకీయనాయకులు వాస్తవాలను వెలికితీసే జర్నలిస్టులపట్ల ఎంత

కర్కశంగా ప్రవర్తిస్తున్నారో మనకు తెలిసిందే ఒరిస్సాలో సీనియర్ జర్నలిస్టు అయిన ప్రశాంత్‌పట్నాయక్ ఇంట్లో లేని సమయంలో ఆయన భార్యాబిడ్డలను ప్రభుత్వ క్వార్టర్స్‌నుంచి బయటకు గెంటించడంలాంటి సంఘటనలు, హైదరాబాద్ నడిబొడ్డున అశోకా హోటల్‌లో జరిగిన సంఘటనను, మంత్రిగారి ప్రియమైన పెంపుడు జంతువుకు పిల్లల హాస్పిటల్‌లో ట్రీట్‌మెంట్ అడగడంలాంటి వార్తలను నవలరూపంలో అందించిన రచయితకు అభినందనలు. నవలలో రాజకీయాలు కథావస్తువైనా, జర్నలిస్టునే ముఖ్యపాత్రధారునిగా చేసి రాయడం జరిగింది. ఇంకా ఇతర రాష్ట్రాలలో జర్నలిస్టులకు జరుగుతున్న అన్యాయాలను కూడా తీసుకుని వుంటే మరీ వాస్తవంగా వుండేది. శారద కిడ్నాప్ చేయబడిన తర్వాత ఏమైందో రాయలేదు. ఈ గుండారాజ్యంలో ఆమెకు ఏమి జరిగిందో, జరుగుతుందో ఊహించుకోవచ్చు. ఫిబ్రవరి 15, 88 'ఆన్‌లుకర్'లో క్లాడే ఆల్వెర్స్‌గారు జర్నలిస్టుల వృత్తిపై రాసిన వ్యాసంలోని వాక్యాలను ఇక్కడ ఉదాహరించాలనిపించింది. "ఇలాంటి సంఘటనలు జరిగినప్పుడు మనం వుంటున్నది మనుమల రాజ్యంలోనా? లేక జంతువుల పాలనలోనా? అన్న అనుమానం వస్తుంది."

— జీయల్, కామారెడ్డి.

## వాస్తవానికి దూరం

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

అరాజకీయం రచయిత పాలకోడేటి సత్యనారాయణరావు విలేకరుల, పాలకుల దృక్పథాలను నవలలో అంతర్వాహికగా ప్రవహింపజేశారు. నేటి ప్రభుత్వ యంత్రాంగాన్నీ, మంత్రుల జీవనసరళిని గురించి స్పష్టమైన ఉదాహరణలిచ్చారు. సమాజంలో దుష్టశక్తుల కుళ్లును, దుర్మార్గాన్ని ఎత్తి చూపించారు. ప్రభుత్వనేతలు స్వప్రయోజనాలకోసం ప్రజలను ఎట్లా వినియోగించుకున్నారో ఇందులో చూపారు.

సంఘసంక్షేమానికి, అభ్యుదయానికి వాచస్పతి విలేకరిగా చేసిన సేవ అతనికే ప్రమాదకరంగా పరిణమించింది. భార్య శారద అతని ఆత్మరక్షణను గురించి ఎన్నిమార్లు హెచ్చరికలు చేసినా, ఖాతరుచేయక ధైర్యంగా తన విధిని నిర్వహించడం ఈ నవలకు ప్రత్యేక విలువను సమకూర్చింది.

విలేకరిమీద అఘాయిత్యం జరిగి ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న సమయంలో కూడా పత్రిక యాజమాన్యం ఏమీ పట్టించుకొనకపోవటం, జర్నలిస్టుల సంఘాలు కూడా పలుకరించి సానుభూతి కూడా చూపకపోవటం ఆశ్చర్యం. నేడు జర్నలిస్టు సంఘాలలో కొంత కదలిక ఉన్నా దీనిని గురించి ఎందుకోగానీ రచయిత రాయలేదు.

ఆర్థిక అవినీతికి పాల్పడ్డారని కోర్టులు తీర్పు ఇచ్చినా రాజీనామాలు సమర్పించని మంత్రులు ఈ రోజుల్లో వుండగా పత్రికా ప్రకటనలకే రాజీనామా ఇవ్వమని కోరే ముఖ్యమంత్రులు వున్నారనటం సామాజిక వాస్తవం మాత్రం కాదు.

విలేకరి ఎవరిమీద ఆరోపిస్తూ వార్త రాసినా వాడి కోపానికి గురికావలసి వస్తుందని రాయటంలో నిజముంది. కానీ వాచస్పతి భార్యను ఎత్తుకుపోవటమేగాక అతన్ని కూడా హత్య చేయటంతో సమాజంలో ఇంత దుర్మార్గముందా అని సందేహించక తప్పదు.

— డి. లక్ష్మీకరరాజు, రైల్వే కోడూరు.

## అరాచక రాజకీయం

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

నేటి అస్తవ్యస్తరాజకీయ వాతావరణాన్ని, పదవుల అస్థిరతను, రాజకీయనాయకుల దిగజారుడుతనాన్ని దృష్టిలో వుంచుకుని, కొన్ని సంఘటనల్ని సృష్టించి రాసిన నవల పాలకోడేటి సత్యనారాయణరావుగారి అరాజకీయం.

నవలలో వాస్తవ రాజకీయాల్ని నవలానుగుణంగా మార్చి రాయడంలో రచయిత కృతకృత్యుడయ్యాడు. వాచస్పతి చుట్టూ రాజకీయాన్ని ప్లాన్‌గా అల్లి, జర్నలిస్ట్ అంటే రాజకీయనాయకులందరూ భయపడేలా చేసి, చివరకు అతని మరణంతో రాష్ట్రంలో సంచలనం సృష్టించి, గోవిందరావు భార్య మైథిలిని ముఖ్యమంత్రిగా చెయ్యడంతో నవల ముగుస్తుంది. కాని ఇక్కడోవిషయం గమనించాలి. మైథిలి తన రాజకీయ ఎత్తుగడకు వాచస్పతిని ఓ పావులా ఉపయోగించుకుంటుంది. కాస్త విష




పరోక్షంగా ఉపయోగపడుతున్నది మైథిలి అన్న విషయం గ్రహించలేకపోడు. ఎందుకంటే-కథాప్రారంభంలోనే మంత్రివర్గంలో తన కెలాంటి స్థానం కల్పించలేదని, గోవిందరావు ముఖ్యమంత్రిత్వంపై విముఖత చూపించింది అతని భార్య మైథిలి. ఇక మంత్రివర్గంపై ఎవరికీ వ్యక్తిగతమైన కక్షలులేవు. మంత్రివర్గంలో తనకు స్థానం లేకపోవడంతో అది అవమానంగా భావించిన మైథిలి-మంత్రుల చాటుమాటు భాగోతాలని వాచస్పతికి అందించి పరోక్షంగా అతన్ని కథకు హీరోని చేసింది. విడదీయలేని సస్పెన్స్ కాదిది. వాచస్పతి, జర్నలిజానికి సరైన నిర్వచనం ఇచ్చి, తన చావుని కొని తెచ్చుకుని అటు నవల్లోనూ, ఇటు పాఠకుల్లోనూ అంతులేని సానుభూతి సంపాదించుకున్న మంచిపాత్ర. కాని ఆ పాత్ర వల్ల-పరోక్షంగా జర్నలిజం చదువుకునే విద్యార్థులు జర్నలిజం అంటే విముఖత చూపే అవకాశం వుంది. కోరికోరి చావుని కొనితెచ్చుకునే ఉద్యోగం ఎవరూ కోరుకోరు. జర్నలిజం అన్నది పవిత్రమైన బాధ్యతే కాని, రాజకీయనాయకుల వలలో చిక్కిన జర్నలిస్ట్ ఎదురు తిరిగితే వాచస్పతిలా జీవితం అంతమవుతుందా అన్న అనుమానాన్ని కలిగిస్తుందీ పాత్ర.

నవల్లో మరోపాత్ర ముఖ్యమంత్రి గోవిందరావు. ఇతనికి కూడా భయపడతగ్గ ఫ్లాష్‌బ్యాక్ వున్నా అది వాచస్పతి పత్రికకు వెల్లడించే అవసరం అవకాశం నవల్లో కల్పించలేదు. అయినపుడు అతని సొంతకథని నవల్లో చేర్చడం కథ నిడివి పెంచడానికిమాత్రమేకాని, మరేంకాదు. అంతకన్నా గోవిందరావుని నిజమైన రాజకీయవేత్తగా, స్వచ్ఛత మూర్తీభవించిన ముఖ్యమంత్రిగా రూపొందించి వుంటే-పాఠకుల్లో-ఓ మంచి ముఖ్యమంత్రి రాజకీయచదరంగంలో పావులా ఉపయోగపడ్డాడు కదా అన్న సానుభూతి అయినా మిగిలి వుండేది. అలాకాకుండా ఆయనకూ ఓ గత చరిత్ర రాసి, రాజకీయనాయకులందరూ గొర్రె తోకలో వెంట్రుకల్లాంటివారని తెలియజెప్పారు. అంటే రాజకీయనాయకులు అందరూ

యిత ఉద్దేశ్యమా?

ఏదియేమైనా ఈనాటి అరాచక రాజకీయ వ్యవస్థపై ఓ మంచి సెటైర్‌రాసి మెప్పించిన రచయిత అభినందనీయుడు.

—ధనరాజ జ్ఞానేశ్వర్, వనపర్తి.

## అరాజకీయారణ్యం

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

సమకాలీన రాజకీయారణ్యపు దర్పణమే "అరాజకీయం". ప్రస్తుత రాజకీయాలలో పదవి కోసం పాకులాటలు, పదవి వస్తే నిలుపుకోవడానికి పడే తంటాలు, పదవిలోవున్నవాణ్ణి క్రిందకు లాగేయడానికి చేసే కుట్రలూ, అసమ్మతివర్గాలూ, అధికార దుర్వినియోగాలు మామూలైపోయింది. సామాన్యప్రజలను పట్టించుకునే నాధులే కరువయ్యారు. నవలలో ముఖ్యమంత్రి గోవిందరావు సతీమణి మైథిలి "వార్త" పత్రికావిలేకరి వాచస్పతికి సంచలన వార్తలకు కావలసిన "ఉప్పు" అందిస్తూ ప్రభుత్వాన్ని మెట్లుమెట్లుగా పడగొడ్తూ చివరికి తానే ముఖ్యమంత్రి అవుతుంది. పాలకోడేటిగారు నవలలో వివిధ సంఘటనలను చక్కగా అతికించారు. సాంస్కృతిక వ్యవహారాలమంత్రి రామనాథం కుమారుడు రమేష్‌కుమార్ రాసలీలలు, ఆరోగ్యమంత్రి వరహాలరావు వ్యవహారజ్ఞానశూన్యత, పరిపాలనాశాఖామంత్రి నీలాంబరరావు పి.హెచ్.డి.పట్టా ప్రహసనం, గృహనిర్మాణ సంస్థలో అవినీతి, ముత్తయ్య, సూర్యారావువర్గం అసమ్మతిసమావేశాలు, పోలీసుస్టేషనులో నిందితుని చావగొట్టడం, జర్నలిస్టు వాచస్పతి హత్య మొదలైనవి నేటిసమాజంలో జరుగుతున్న సంఘటనల ప్రతిబింబాలు. అయితే యదార్థ రాజకీయ చిత్రణ మినహా సత్యనారాయణరావుగారు రచయితగా ఇందులో అదనంగా సాధించింది ఏమీ లేదనిపిస్తూంది. నవల చివర్లో వాచస్పతి హత్య ఇప్పటి బాధ్యత గల జర్నలిస్టులకు హెచ్చరికా? ఒకనిజాన్ని చెప్పాలో, చెప్పకూడదో, చెపితే ఎంతవరకూ ఎలా చెప్పాలో నిర్ణయించడంలో రచయిత చాలా బాధ్యతగా వ్యవహరించాలి.

—సి.పి.డి. రాజన్, మారుటేరు.

కవరు పేజీ ఫొటోగ్రాఫర్: యస్. ప్రసాద్

# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం—
బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది.

నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు.

అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం.

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై వాడ్యాక సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది.

పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.



# చిన్న కథలు

## విడాకులు

బట్టతల నవరించుకొంటూ ఎదుట ఉన్న ఇద్దరికేసి చూశారు జడ్జిగారు.

ఆమెకు పాతిక, అతనికి ముప్పై నంవత్స రాలుంటాయి.

"మిలార్డ్ ... నాక్లయింటైన ఈ నూర్యనారాయణ తన భార్య అయిన విమల నుండి విడాకులు కోరుతున్నాడు. విడాకులు కోరేందుకు అవనరమైన కారణాలు కోర్టు వారికి నమర్పించడమైనది" ఒక్క ముక్కలో చెప్పాడు భర్త తరవు లాయర్.

"నా క్లయింటగు విమల కూడా తన భర్తఅయిన నూర్యనారాయణ నుండి విడాకులు కోరుతోంది" అన్నాడు అమె తరవు లాయర్.

ఒక్క క్షణం నూర్యనారాయణ- విమలల వంక చూశాడు జడ్జి. భార్యా భర్తల్లాకాకుండా ఒకర్నొకరు చంవుకొనేందుకు నిద్ధంగా ఉన్నట్లు చూనుకొంటున్నారు వారిద్దరూ.

"మీ వివాహమై ఎంత కాలమైంది?" అడిగాడు.

"మూడు నంవత్సరాలు దాటింది" చెప్పాడు నూర్యనారాయణ.

"కేవలం మూడు నంవత్సరాలలోనే విడాకులు తీనుకోవాలని ఎందుకు నిర్ణయించుకున్నారు. మీ పెళ్ళి మీ ఇష్టప్రకారం కాకుండా పెద్దల బలవంతంపై జరిగిందా?" ప్రశ్నించాడు జడ్జి.

"కాదు ... మాది ప్రేమవివాహం"

"మరి?" ఆశ్చర్యంగా అడిగారు జడ్జిగారు.

"నేను ఈ దయ్యాన్ని భరించలేను నర్" వినుగ్గా చెప్పాడు నూర్యనారాయణ.

"నేనూ భరించలేను ఇలాంటి రాక్షనులను" అంటూనే చేతిలో ఉన్న వీక్లీని నూర్యనారాయణమీదకు విసిరికొట్టింది విమల.

"చూడండి నర్ ... ఇలా తనకు కోవం వచ్చినవ్పుడల్లా నా మీదకు వస్తువుల్ని విసిరేస్తుంటుంది. పెళ్ళైనవ్పటి నుండీ ఇదే వరున" వాపోయాడు నూర్యనారాయణ.

"అబద్ధం ... నంవత్సరం వరకూ బాగానే



వున్నాంగా" అంటూనే మరో చేతిలో వున్న హ్యాండ్‌బ్యాగ్‌ను గురిచూసి విసిరికొట్టింది విమల.

అదిరిపడ్డాడు జడ్జి. అదేదో తెలుగు సినిమాలో కోపం వచ్చినప్పుడు తండ్రీకొడుకులిద్దరూ ఇంట్లోవున్న సామానంతా బద్దలుకొడుతుంటారు. ఆ సినిమా చూసి "ఇలాంటి వారుంటారా" అని ఆశ్చర్యపోయాడు తను. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాడు.

'కోర్టులో తన ఎదురుగానే ఇలా దురుసుగా ప్రవర్తిస్తోందే! ఇక ఇంట్లో ఎలా వుంటుందో!' అనుకుని తప్పకుండా విడాకులు మంజూరు చేయాల్సిందేనని నిశ్చయించుకున్నాడు.

"దయచేసి విడాకులు గ్రాంట్‌చేయండి సార్! ఇంట్లో వున్న సామానంతా ఇలాగే ధ్వంసంచేసేసింది. టి.వి., ఫ్రిజ్, ఫ్లవర్‌వాజ్‌లన్నీ" వివరంగా చెప్పాడు సూర్యనారాయణ.

"అలాగే విడాకులు మంజూరు చేస్తున్నాను. సరేగానీ ... మిస్టర్ సూర్యనారాయణా! మూడు సంవత్సరాల్నించి అన్నీ ఇలా ధ్వంసం చేస్తూ వున్నా ఎలా సహించావ్? అప్పుడే విడాకులకు అప్లై చేసివుంటే బాగుండేదికదా! ఇంత కాలం ఎలా వున్నావ్?" అని ప్రశ్నించారు జడ్జిగారు.

"ఇంతకాలం తను పుట్టింటినుండి తెచ్చుకొన్న వస్తువులనే విసిరేదిసార్. ఇప్పుడు నా డబ్బుతో కొన్న వస్తువులను కూడా విసరడం మొదలెట్టింది. అందుకే విడాకులు" చిన్నగా చెప్పాడు సూర్యనారాయణ.

-ఎ.యస్.రాజశేఖర్

## పూనకం

హోంమంత్రిగారు వస్తున్నారని తెలిసేసరికి పోలీస్ ట్రైనింగ్‌కాలేజిలో హడావుడి పెరిగింది.

రంగురంగుల తోరణాలు కట్టారు. 'హోంమంత్రిగారికి స్వాగతం' అంటూ బేనరులు ఏర్పాటుచేసారు. చేయగలిగిన అలంకారాలన్నీ చేశారు.

మంత్రిగారు వచ్చారు. మొత్తం కాలేజీ అంతా మంత్రిగారికి చూపించాడు ప్రిన్సిపాల్.

ట్రెయినింగవుతున్న పోలీసులు కవాతు జరిపి తమ క్రమశిక్షణను ప్రదర్శించారు.

తరువాత ఓ ఇద్దరు పోలీసులు "కర్తవ్యపరాయణులం, దీక్షాకంకణబద్ధులం" అంటూ పాటలుపాడి మంత్రిగారిని ఆనందపరిచారు.

"ఇప్పుడు ఒక చిన్నప్రదర్శన సార్" మంత్రిగారితో చెప్పాడు ప్రిన్సిపాల్.

"ఏమిటి?" అన్నట్లు చూసిన మంత్రిగారికి వివరించాడు ప్రిన్సిపాల్!

"ఆందోళనకారులూ, అల్లరిమూకలూ



విజృంభిస్తే పోలీసులు వారిని ఎలా అదుపులోకి తెస్తారో మావాళ్ళు నటించి చూపుతారు"

"అయితే చూడాల్సిందే" అంటూ ఉత్సాహం ప్రకటించారు మంత్రిగారు.

గ్రౌండ్‌లో ప్రదర్శన ప్రారంభమైంది.

ఆందోళనకారులుగా నటిస్తున్న పోలీసులు రాళ్ళు విసురుతూ బీభత్సాన్ని సృష్టించడం మొదలెట్టారు.

వారిని అదుపుచేసేవారిగా నటించే పోలీసులు లాఠీలతో, తుపాకుల్తో రంగంలోకి దిగారు. వారు దిగీదిగడంతోనే లాఠీలతో ఆందోళనకారులను ఎడాపెడా ఉతకసాగారు.

ఆందోళనకారులకు నిజమైన దెబ్బలు పడేసరికి వారు అయోమయంలోపడి కుయ్యో మొర్రోమని అరుస్తూ అటు ఇటూ పరుగులు తీసారు.

ఆందోళనకారులు అలా పరుగులు తీస్తున్నప్పటికీ వదలకుండా వెంటపడి లాఠీలతో మోదసాగారు పోలీసులు. ఒకరిద్దరయితే తుపాకులు కూడా పేల్చారు. ఓ తూటా మంత్రిగార్నే దూసుకుపోయింది.

ఇదంతాచూసిన మంత్రిగారు కంగారుపడి "ఏమిటిది?" అని అరిచారు.

పోలీస్ అధికార్లు హడావుడిగా వీరవిహారం చేస్తున్న పోలీసుల వద్దకు పరిగెత్తారు.

ఎదురుగా నక్షత్రాలగుర్తులున్న భుజాలు కనబడేసరికి లాఠీలతో చిందులు తొక్కుతున్న పోలీసులు అటెన్షన్లో నిలబడి సెల్యూట్ చేసారు.

"ఏమిటిది... మీకేమైనా పిచ్చిపట్టిందా! మంత్రిగారి ఎదుట మన డిపార్ట్‌మెంట్ పరువు తీస్తున్నారు" అంటూ కోపంగా అరిచారు అధికార్లు.

"ఏంచేసేది సార్? లాఠీలు చేతిలోకి రాగానే మాకేదో పూనకం పట్టినట్లవుతుంది. ఎడాపెడా ఉతికిపారేయాలనిపిస్తుంది. మా ఎదురుగా వున్నది మన పోలీసులేనన్న విషయంమరిచిపోయాం. మామూలు జనమే అనుకున్నాం" చెప్పారు పోలీసులు రొప్పుతూ.

— జి. రామాంజనేయులు

చతుర
సంపుటి: 11 సంచిక: 4 మే: 1988

# అంతర్మథనం

డాక్టర్ అట్లూరి రాజకుమారి

## నవలా పరిచయం

"ఊరంతా దేవుళ్లా కొల్చుకుంటున్న స్వామీజీని హత్యచేయడానికి చేతులెలా వచ్చాయి. చీమకైనా అపకారం తలపెట్టని ధర్మాత్ముడాయన!"

"ఏమిటో... అంతా విధివిలాసం! ఎవరి జోలికీ పోని స్వామీజీని అంతమొందించవలసినంత అక్కను ఏమొచ్చిందో?"

"అబ్బో... ఎంత ఘరానా పెద్దమనిషిరా వీడు! చాప కింద నీరులాంటివాడన్నమాట"

–నలుగురూ నాలుగురకాలుగా వ్యాఖ్యానాలు చేస్తున్నా అందరి స్వరాల్లోనూ ఆ హత్య చేసిన నారాయణపట్ల ఈసడింపే ధ్వనిస్తోంది. నారాయణ మాత్రం నిశ్చలంగా నిల్చున్నాడు. ప్రాణాపాయ సమయంలో స్వామీజీ చేతి తుల సితీర్థం పుచ్చుకుని సునాయాసంగా మరణాన్ని జయించిన నారాయణ ప్రాణంపోసిన ఆ స్వామీజీనే కాటేసే పరిస్థితి ఎందుకు వచ్చింది? ఎలా జరిగిందది?

మానసిక ఆటుపోట్లకు మనిషి ఎంత తీవ్రంగా స్పందిస్తాడో, ఎన్ని సుడిగుండాల్నీ, కల్లోలాల్నీ అంతరంగంలో సృష్టించుకుంటాడో ప్రతిభావంతంగా చిత్రించారు 'అంతర్మథనం'లో డాక్టర్ రాజకుమారి.

మానవ మనస్తత్వపు ఔన్నత్యాలను, అగాధాలను కళ్లకు కట్టించే "అంతర్మథనం" ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

"నారాయణ స్వామీజీని పొడిచేసాడట"

తెల్లవారేసరికి ఊరంతా గుప్పుమంది వార్త.

కబురు తెలిసిన ప్రతివారూ ఆందోళనగా పరుగు పరుగున ఆశ్రమం చేరుకుంటున్నారు.

సదా ఎంతో ప్రశాంతంగా కనిపిస్తూ, అక్కడకు చేరినవారికి సేదతీరుస్తున్నట్లుండే ఆశ్రమ ప్రాంగణం జనంతో కిటకిటలాడుతోంది. ఎవరికి తోచినట్లు వారు మాట్లాడుతూ వుండటంతో ఆశ్రమ ప్రాంగణం అంతా రణగొణ ధ్వనులతో నిండి పోయింది.

పోలీసులు ఇంకా రంగ ప్రవేశం చేయలేదు. స్వామీజీ భౌతికకాయం అక్కడే రక్తపు మడుగులో నేలపై పడివుంది.

వందు ముదుసలి

ప్రశాంతమైన ముఖవర్చస్సు

పొడుగాటి తెల్లని గడ్డం

ముడుతలు పడిన శరీరం

దివ్యత్వాన్ని అపాదించుకున్న కళ్లు

మూర్తీభవించిన పవిత్రతలా వుండే స్వామీజీ, ఎవరే కష్టం చెప్పుకున్నా తన చల్లని చిరునవ్వుతో, మాటతో సేదతీర్చేవారు.

అలాంటి స్వామీజీ అనాథప్రేతంలా అలా పడివుండటం చూసి జనసమూహం విభ్రాంతులైపోయున్నారు.

స్వామీజీ శిష్యులు, భక్తుల విషయం చెప్పనే అక్కర్లేదు. తండ్రిని కోల్పోయిన బిడ్డల్లా, గూడు చెదరిన పక్షుల్లా అలమటిస్తున్నారు.

జనాన్ని స్వామీజీ శవానికి ఎడంగా నిలిపి వుంచడానికి నతమతమై పోతున్నారు- ఆవూరి కరణం, మునసబులు.

ఆశ్రమం క్రమంగా జనంతో నిండిపోయింది.

అందరూ పోలీసుల రాకకోసం ఎదురుచూస్తున్నారు.

★ ★ ★

"అమ్మా... అమ్మా!" కంగారుగా లోపలికి పరుగెత్తుకు వచ్చేశాడు పోలయ్య.

"అయ్యో... అయ్యో నీకేం పోయేకాలం వచ్చిందిరా? అంటూ సొంటూ లకుండా అలా లోపలి గదులలోకి దూరిపోతున్నావ్?"

వంటమనిషి రంగమ్మ మందలింపులు పోలయ్య చెవులకు వినిపించలేదు.

భారతి లోపల డైనింగ్-టేబులు దగ్గర ఉదయం టిఫిన్ ఏర్పాట్లు చూస్తోంది. ఏడేళ్ల బాబు, అయిదేళ్లపాప స్కూలుకు సిద్ధమవుతున్నారు.

"ఏమిటో? ఈయన ఎప్పుడూ ఇంతే... సరిగ్గా టిఫిన్ టైముకే వస్తాయి ఎక్కడలేని రాచకార్యాలూ! మళ్ళీ ఫలహారాలు చల్లారడానికి వీల్లేదు" లోలోపలే గొణుక్కుంటోంది భారతి.

పోలయ్య మీద కేకలు వినిపించేలోపే.

"అమ్మా..." అంటూ డైనింగు రూంలోకి వస్తూనే భారతిని చూసి కుప్పకూలి పోయాడు పోలయ్య.

"ఏమిట్రా పోలాయ్...? ఏం జరిగింది? చంద్రి ఎలా వుంది? నెప్పులు ప్రారంభమయ్యాయా? పట్నం తీసుకువెళ్ళాలేమో? అయ్యగారికి చెప్పి ఆ ఏర్పాట్లేవో చూడక అడదానిలా ఈ ఏడుపేమిటిరా?" నెలలు నిండిన పోలయ్య కూతురి పరిస్థితి విషమించిందేమోననే అనుమానంతో అడిగింది భారతి.

"కాదమ్మా" మరొక్కసారి ఘొల్లుమన్నాడు పోలయ్య.

"మరేమిట్రా నీ ఏడుపు... ఎవరో చచ్చిపోయినట్లు" కసిరింది రంగమ్మ.

"అవునమ్మా... మన స్వామీజీ చచ్చిపోయారు. కాదు కాదు... ఆయన్ని చంపేశారు" ఎలాగో నోరు పెగుల్చుకుని అన్నాడు పోలయ్య.

"ఆ..." నిర్ఘాంతపోయారు ఆడవాళ్ళిద్దరూ.

"ఆ మహానుభావుణ్ణి చంపడానికి ఏ దౌర్భాగ్యుడికి చేతులు వచ్చాయిరా? ఊరంతా దేముళ్లా కొలుచుకుంటున్నామే? ఆయన ఎవరికేం అపకారం చేశార్రా?"

భారతి కళ్లు నీటితో నిండిపోయాయి. గొంతు పూడుకుపోయింది

"ఏదిక్కుమాలిన వాడికి చేతులు వచ్చాయిరా అంతటి మహానుభావుణ్ణి పొట్టన పెట్టుకోవడానికి? ఆ... వాడు మాత్రం ఏం బాగుపడతాడులే! వాడూ, వాడి వంశమూ సర్వనాశనంకా

రూ'' మెటికలు విరిచింది రంగమ్మ.

"అమ్మా... చంపేసింది మన బాబుగా రే...!!''

మాట పూర్తి కాకుండానే మరొక్కసారి ఘొల్లు మన్నాడు పోలయ్య.

నిశ్చేష్టురాలైంది భారతి.

ఒక్కక్షణం కళ్ళు బయర్లు కమ్మినట్లయింది.

ఏమిటిది... నిజమా? తను విన్నది నిజ మేనా? తన భర్త స్వామీజీని హత్య చేయడమే మిటి?

వారానికొకసారి తమ ఇంటికి భిక్షకు వచ్చే స్వామీజీని తన భర్త హత్య చేయడమా?

అందులోనూ చావుబతుకుల మధ్య నలిగిన తన భర్త ఆ స్వామి ఆశీర్వచనంతోనే, వారి తులసి తీర్థంతోనే మరణాన్ని జయించాడు. క్షేమంగా ఇల్లు చేరి ఎంతో కాలంకాలేదే!

అటువంటిది తన భర్తే స్వామీజీని హత్యచే యడమా?

లేదు... లేదు... అలా జరగదు. జరిగి ఉండదు. ఎక్కడో పొరపాటు జరిగి వుంటుంది.

ఎవరినో చూసి తన భర్త అనుకుని వుంటా డు ఈ పోలయ్య. మనిషిని పోలిన మనిషి వుండటం అసంభవమేమీ కాదుగా!

తన భర్త- తన గ్రామాభివృద్ధికి అనుక్షణం ఆరాటపడే తన భర్త ఎప్పుడూ అటువంటి ఘోర కృత్యం చేయడు చెయ్యలేడు. ఆయన సంగతి ఈ మూర్ఖుల కెలాతెలుస్తుంది?

"తెల్లవారకుండానే కల్లు దుకాణానికి వెళ్ళి వస్తున్నావేమిట్రా? ఏమిటా వాగుడు?'' కసిరింది రంగమ్మ.

"లేదు రంగమ్మగారూ! కాని మాటలు నేనెందుకంటాను. ఊరంతా గగ్గోలుగా వుంది. మన అయ్యగార్ని ఆశ్రమంలోనే ఒకగదిలో పడేసి బైట తాళం కూడా వేశారమ్మా- నేను చూసేవచ్చాను''

ఒకవైపు కళ్ళంట నీళ్ళు కారిపోతున్నా తన మాటలు నమ్మమన్నట్టు నొక్కిచెప్పాడు పోల య్య.

"ఆ?'' అంటూనే అన్నీ మరచి, అన్నీ వదలి ఆశ్రమం దిక్కుగా వరుగుతీసింది భారతి.

అంతవరకూ పెద్దల మాటలు వింటూ ఏమీ అర్థంకాక తల్లి ఏడుపుతో బెదిరిపోయిన పిల్లలిద్దరూ రంగమ్మ దగ్గరకు వచ్చారు.

"అమ్మ ఎక్కడకు వెడుతోంది? మమ్మల్ని తీసుకువెళ్ళలేదేం?''

అమాయకంగా అడుగుతున్న రవిని తదే కంగా చూసి మరుక్షణంలో పిల్లలి ద్దర్నీ అక్కున చేర్చుకుని బావురుమంది రంగమ్మ.

పోలయ్య మరోసారి గొల్లుమన్నాడు

ఏమీ అర్థం చేసుకోలేని పసివాళ్ళిద్దరూ బిక్కచచ్చిపోయి రంగమ్మ గుండెల్లో తలదాచు కున్నారు.

* * *

ఒక్క వరుగున ఆశ్రమంలోకి వచ్చిన భారతి అక్కడి సన్నివేశాన్ని చూసి నిలువునా నీరైపోయింది.

స్వామీజీ శవం ఇంకా అక్కడే వుంది. చుట్టూ చేరిన జనసమూహం ఇంకా పెరిగింది- ఊరంతా పిల్లా పాపలతో సహా కదలి వచ్చిన ట్లు.

పోలీసులు, డాక్టరు, వేలిముద్రల నిపుణు లు, ఫొటోగ్రాఫర్లతో ఆశ్రమమంతా హడావుడిగా వుంది.

ఇద్దరు పోలీసుల నడుమ చేతులకు బేడీ లతో తలవంచుకుని జీపువైపు నడుస్తున్నాడు నారాయణ- జీవంలేని బొమ్మలా.

"దిక్కుమాలినోడు... స్వామీజీని అన్యా యంగా పొట్టన పెట్టుకున్నాడు''

"ఇంతకింత అనుభవించకపోతాడా''

-అంటూ ఆడవాళ్ళు మెటికలు విరుస్తున్నా రు.

"అబ్బో... ఎంత ఘరానా పెద్ద మనిషిరా! చావకింద నీరులాంటివాడన్నమాట''

యువకులు హేళన చేస్తున్నారు.

"ఏమిటో... అంతా విధివిలాసం, ఎవరి జోలికిపోని స్వామీజీని అంతమొందించ వల సినంత అక్కసు ఏమొచ్చిందో''

పెద్దలు విచారంగా తమలోతాము గుసగుస లాడుకుంటున్నారు. కాని, ఏమాటా నారాయణ

# స్వేచ్ఛ అనేది హిమాలయమంత మహోన్నత భావన. దానిని మీ అనుభవంలోకి తెచ్చుకోండి!



సంకెళ్ళు అవరోధాలు లేని స్వేచ్ఛ
ఆందోళన, ఆతృత లేని స్వేచ్ఛ
జాగ్రత్తవహించవలసిన దినాలలో గాని,
మిగతా దినాలలోగాని, ఏ రోజునైనా, ఎప్పుడైనా.
ఆ మహోన్నత స్వేచ్ఛా భావనను
ఆలోచనల్లోంచి అనుభవంలోకి తెచ్చి
మీ జీవితంలో ప్రతిష్ఠించుకోండి.
సూపర్ డీలక్స్ నిరోధ్ ఎల్లాని నాజూకైన తొడుగు.
సున్నితమైన, మేలైన లేటెక్స్‌తో తయారుచేయబడింది.
నూటికి నూరుశాతం ఎలక్ట్రానిక్ పరికరాలతో పరీక్షించబడినది.
సహజమైన మృదుత్వానికీ, జారుడుగుణానికీ పెట్టింది పేరు.
ఇప్పుడు మీ అభిరుచికి తగిన విధంగా చర్మం రంగులో
లభ్యం అవుతున్నది.



ఇప్పుడు మీకు కోరుకున్నంత స్వేచ్ఛ







ప్రపంచంలోని తొడుగుల తయారీలో
అతిపెద్ద సంస్థ అయిన హిందుస్థాన్ లేటెక్స్
లిమిటెడ్ వారి మేలైన ఉత్పత్తి.

## సూపర్ డీలక్స్ నిరోధ్

ASP/HLL/8808 TE

ఏదో అయోమయావస్థలో ఉన్నాడు. పరిస రాలను గుర్తిస్తున్నట్లుగా కూడాలేదు.

ప్రాణంలేని బొమ్మలా పోలీసులేంచెబితే అది చేస్తున్నాడు. దేనికీ జవాబు ఇవ్వడంలే దు.

"ఎక్కవయ్యా, పెద్దమనిషీ... ఎత్తుకుని కూర్చోబెట్టాలా"

వ్యంగ్యంగా అడిగాడొక పోలీసు.

"అంతేలే... ఏదైనా బైటపడేవరకే... అంత వరకూ అందరూ పెద్దమనుషులే"

వంతపాడుతున్నాడు మరొక పోలీసు.

"ఏమండీ"

ఆర్తనాదంలా వినిపించిన భారతి పిలు పుకు వెనుదిరిగి చూశాడు జీపు ఎక్కబోతున్న నారాయణ.

ఎదురుగా శోకదేవతలా నిలబడివుంది భారతి.

అంతవరకూ జడపదార్థంలావున్న నారా యణ మొహంలో మార్పు, కన్నుల్లో దైన్యం గోచరించింది.

"ఏమండీ! ఏమిటండీ ఇదంతా? ఏం జరి గిందండీ..."

రెండుచేతులతోను నారాయణను కుదిపే స్తోంది భారతి.

ఊరుకొమ్మన్నట్లు మౌనంగా తల పైకీ కిందకీ ఆడించాడు నారాయణ భారతివైపు చూస్తూ.

అతని కళ్లలో నీళ్లు చిప్పిల్లాయి; బుగ్గలు తడిశాయి.

"చెప్పండి, స్వామీజీని మీరేం చేయలేదుక దూ... మీకేం తెలియదని ఒక్కసారి చెప్పండి, ఎవరోచేసి ఆ నేరం మీమీద వేశారు కదూ" ఆశగా, ఆరాటంగా అడుగుతోంది భారతి.

నారాయణ అశాంతిగా చేత్తో మొహాన్ని కప్పుకున్నాడు. రెండోచేతికి వేసిన బేడీలు ఆ తత ఎండలో మెరుస్తున్నాయి.

"పదవయ్యా... ఇంకా ఎంతసేపు?" గద మాయించాడు కానిస్టేబుల్.

"వద్దు... ఆయన్ని వదిలేయండి, ఆయనీ దారుణం చేయలేదు; చేయలేరు" గొల్లు

"అమ్మా... భారతీ... ఏమిటి తల్లీయిది? ముందు ఇంటికిపద" అనునయంగా అన్నా డు గుంపులోనుండి ముందుకు వచ్చి భార తిని సమీపించిన నరసింహయ్య.

నారాయణకు వరుసకు సినతండ్రి ఆయన.

"ఏమండీ... ఒక్కసారి చెప్పండి, మీకేపాపం తెలియదని నిజం చెప్పండి" గగ్గోలెత్తిపోతోంది భారతి.

నారాయణ తన దగ్గరకు వచ్చిన నరసింహ య్య చేతిని పట్టుకుని భారతివైపు చూపాడు. ఏదో చెప్పాలనే తపన. నోటిలోమాట మాత్రంలే దు.

"ఏమండీ... మీకేపాపం తెలియదుకదూ... మీరేపావం చేయలేదుకదూ..." ఇంకా పలవరి స్తున్నట్లుగా అంటోంది భారతి.

ఇక ఆగకుండా గిరుక్కున వెనుదిరిగి జీపు ఎక్కాడు నారాయణ.

భారతి కుప్పకూలిపోయింది.

"అమ్మా... భారతమ్మా... ఇంటికి పదతల్లీ, ముందు పిల్లల్ని చూసుకో. మన దురదృష్టాని కిది ఆరంభమే తల్లీ..." భారతిని బల వంతంగా ఇంటిదారి పట్టించాడు నరసింహ య్య.

పోస్టుమార్టం నిమిత్తం స్వామీజీ కాయాన్ని తరలించే ఏర్పాట్లు జరుగుతున్నాయి.

"వీల్లేదు... మా స్వామీజీ శరీరాన్ని తునాతు నకలు కానీయం"

భక్తుల హాహా కారాలతో ఆశ్రమం ప్రతిధ్వ నించింది.

స్వామీజీ భౌతిక కాయాన్ని తీసుకువెళ్లే వాహనానికి అడ్డంగా పడుకున్నారు స్వామీజీ శిష్యులు.

"మా శరీరాలమీదుగా పోనివ్వండి మా స్వామీజీని" అందరూ ముక్తకంఠంతో అరిచా రు.

వచ్చిన అధికారులు నిస్సహాయంగా చూశా రు ఊరి పెద్దలవైపు. పెద్దలిక కల్పించుకోక



తప్పలేదు.

"ఏమిటయ్యా... ఈ రభస. స్వామీజీ బోధనలింతేనా మీరు అర్థం చేసుకున్నది? ఒకరి విధి నిర్వహణకడ్డుపడమనే చెప్పారా మీ స్వామి? మీ తెలివి తక్కువతనానికి స్వామి ఆత్మ ఎంతగా క్షోభిస్తుందో ఏమైనా ఆలోచించారా? స్వామీజీ ఆశ్రమం ఎప్పుడూ ప్రశాతంగా వుండవలసిందే. స్వామి మనల్ని వదలి ఎక్కడకు వెడతారు? ఆయన ఆత్మ ఈ ఆశ్రమంలోనే తిరుగుతూ వుంటుంది. పోలీసుల్ని వారి పని చేసుకోనివ్వండి. లేపండి... వారిపరీక్షలు పూర్తి చేసిన తరువాత స్వామి శరీరాన్ని పువ్వుల్లోపెట్టి మనకు అప్పచెబుతారు. అప్పుడు మనం..." కంఠం నిండుకుండ ఊరిపెద్ద ఎనభైఏళ్ల పరశురామయ్యకు.

వాహనం బలుదేరుతుండగా అక్కడి జనసమూహం మరొక్కమారు గొల్లుమంది.

ఆ వెంటనే పరశురామయ్యగారి మాటలు మనసులో మెదలగా, తమ స్వామీజీ ఆత్మ ఆ ఆశ్రమం చుట్టుప్రక్కలే తిరుగుతూ వుండి వుంటుందనీ, తమ రోదనధ్వనులకు ఆయన ఆత్మ క్షోభిస్తుందనీ మనసుకి తోచగానే ఎవరిమట్టుకు వారు దుఃఖం దిగమ్రింగుకున్నారు.

క్రమంగా ఆశ్రమం అంతా ఒకలాంటి ప్రశాంతత అలుముకుంది.

ఆశ్రమంలో పెరుగుతున్న పక్షులు, మొక్కలూ కూడా ఆ సంతాపంలో పాలుపంచుకుంటున్నట్లే ఉన్నాయి.

స్వామీజీ మరణానికి తాను కూడా సంతాపం చూపిస్తున్నట్లు ఆకాశంలో ఎక్కడో ఓ కారుమేఘం నాలుగు చినుకులు రాల్చింది.

★ ★ ★

స్వామీజీ ఎవరో, ఎక్కడ పుట్టారో, ఎటు నుండి ఇక్కడికొచ్చారో ఆ ఊరి వారికెవరికీ తెలియదు. తండ్రితాతలు చెప్పుకునే కథలే ప్రచారంలో ఉన్నాయి.

ఎప్పుడో అరవై, డెబ్భయ్ ఏళ్లక్రితం పదిహేనేళ్ల కుర్రాడు ఆ ఊరి దేవాలయంలో కనిపించాడు.

ఉదయమే కాలకృత్యాలు తీర్చుకుని, స్వామిని సేవిస్తూ, దేవాలయ పూజారికి సహాయంగా తిరుగుతున్న ఆ కుర్రాడిని చాలామంది వరూ మొదట్లో పట్టించుకోలేదు.

అప్పట్లో ఆ ఊరికి ప్రయాణ సౌకర్యాలేమీ ఉండేవికావు. మూడువైపులా గోదావరి. మరొక పక్కనున్న పదిమైళ్ల పుంతదారిన నడిచి వెడితే తప్ప ప్రపంచంతో సంబంధం ఉండేది కాదు ఆఊరివారికి.

స్వామిని సేవించే సమయంలో తప్ప మిగిలిన సమయాల్లో ధ్యానంలోనే నిమగ్నమై వుంటే ఆ బాలుడు క్రమంగా ఊరివారి దృష్టిలో పడ్డాడు.

ఆ వయసులో అతని భక్తికి ఊరి పెద్దలంతా విస్మయులయ్యారు.

దేవాలయంలోనే కాలక్షేపంచేస్తూ, స్వామి ప్రసాదమే తీసుకుంటూ, దేవాలయ ప్రాంగణంలో జరిగే తత్వగోష్ఠి వింటూనే ఆ కుర్రవాడు పెరిగి పెద్దవాడయ్యాడు.

అయిదారేళ్లకు అతని జీవితం అనుకోని మలుపుతిరిగింది.

అవి వేసవి రోజులు, రోహిణీకార్తె, పైన సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. ఆ యువకుడు దేవాలయ ప్రాంగణంలో చెట్టుకింద తన ధోరణిలో తాను ధ్యానంలో వున్నాడు.

అప్పుడే ఏదో పనిమీద అంత ఎండలో నడచి వచ్చిన ఒక నడివయస్కుడు ఎండదెబ్బ తగిలి శోషవచ్చి దేవాలయంలో ప్రవేశించి స్పృహతప్పి పడిపోయాడు.

ఆ యువకుడు స్పృహలేని స్థితిలో ఉన్న అతణ్ణి తన చెంబులోని నీరు మొహంమీద చల్లి సేదతీర్చి మంచినీరు తాగించాడు.

తన ప్రాణాలు కాపాడిన ఆ యువకుణ్ణి మనసారా ఆశీర్వదిస్తూ ఇంటికి వెళ్లిపోయాడా వ్యక్తి.

అతను ఆ ఊరి రైతే కావడంతో విషయం నలుగురికీ తెలిసింది.

అంతవరకూ తరచు విపరీతమైన కడుపునొప్పితో బాధపడే ఆ రైతుకి తర్వాత ఆ నొప్పి రాకుండాపోవడంతో ఆ యువకుని చెంబులోని తీర్థానికి మహిమ అంటగట్టారు.

దానితో ప్రజల్లో నమ్మకం హెచ్చింది.

చెంబు కమండలమైంది.

తనకే మహిమలూ లేవనీ అతను ఎంత

అంతవరకు బాలసాధువుగా పిలవబడిన అతను స్వామీజీ అయ్యాడు. ఆ వూరిలో ఎవరికే అనారోగ్యం వచ్చినా అతను తీర్థం ఇవ్వక తప్పేది కాదు.

క్రమంగా అతణ్ని మహిమాన్వితుడుగా చూడటం అలవాటయింది ఆ వూరి ప్రజలకు.

దేవాలయంలో నలుగురూ తన చుట్టూ చేరిన వేళల్లో అతను చేసే తత్వబోధ, రోగులకు అతను చెప్పే సాంత్వన వచనాలు ఆ వూరి ప్రజలకు అతణ్ని మరింత సన్నిహితుణ్ని చేశాయి.

ఆ రోజులలోనే క్రైస్తవ మతప్రచారకులు తమ మతప్రచారం కోసం ఆ వూరు రావడం ప్రారంభించారు. కొంతమందిని తమ మతంలోకి మార్చడమూ జరిగింది. చనిపోయేటప్పుడు తాను చేసిన పాపాలు ఫాదర్‌తో విప్పి చెప్పుకొని పశ్చాత్తాపం పొందితే స్వర్గలోకవాసం కలుగుతుందనే కేథలిక్కుల మతవిశ్వాసం చాలామందిని ఆకర్షించింది.

ఇది గమనించిన కొందరు మతం మార్పు ఇష్టంలేనివాళ్లు ఏ వ్యక్తి అయినా చనిపోయే ముందు స్వామీజీతో తాను చేసిన పాపాలు విన్నవించుకుంటే, ఆ వ్యక్తికి పాపవిముక్తి కలిగి సద్గతులను పొందుతాడని చెప్పసాగారు. దాన్నే వారు ప్రచారంలోకి తెచ్చారు.

పశ్చాత్తాపాన్ని మించిన ప్రాయశ్చిత్తంలేదు. ఏ వ్యక్తి అయినా తన పాపాలకు పశ్చాత్తాపపడితే, అంతకంటే సద్గతులేముంటాయి. ఆ రోగికి, అతని బంధువర్గానికి కలిగే సంతృప్తిని తాను దూరంచేయడమెందుకని ఎవరు, ఏమతంవారు పిలిచినా స్వామీజీ వెళ్లేవారు. చేసిన పొరపాట్లకు పశ్చాత్తాపపడేవారిని తన మృదుమధుర వాక్కులతో సేదతీర్చేవారు.

చేసిన పాపమేకాదు, ఏ విషయాన్నయినా స్వామీజీకి హృదయాన్ని విప్పి చెప్పుకోవడంలో ఏదో సంతృప్తిని అనుభవించటం, స్వామీజీ చేతి తులసితీర్థం తీసుకుని వారి సన్నిధిలో నిశ్చింతగా కూర్చోవడం, ఆయన్ని భిక్షకు పిలవడం కొందరు గృహస్థులకు పరిపాటి అయింది.

కాలక్రమంగా ఆ వూరిలో ఎన్నో మార్పులు వచ్చాయి. పుంతరోడ్డు తారు రోడ్డయింది.

ప్రజలకు పట్టణంతో సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి.

బస్సులతోపాటు సినిమా వాల్‌పోస్టర్లు ఆ వూరికి రావడం ప్రారంభించాయి.

ఎలిమెంటరీ స్కూలు హైస్కూలుగా మారింది.

పత్రికలు ప్రతి ఇంటికీ అందుతున్నాయి.

అయిదారుమైళ్ల దూరంలోని బస్తీలో సినిమాహాలు వెలిసింది. పండుగలకి, తీర్థాలకు ఆ గ్రామప్రజలు రెండెడ్ల బళ్లు కట్టుకుని వెళ్లే. సంపన్నులు బస్తీనుంచి టాక్సీలను తెప్పించుకుని సినిమాలకు వెళ్లిరావడం పరిపాటి అయింది.

మొత్తంమీద నాగరికత ఇంటింటా తొంగి చూస్తోంది.

పట్టణంలోని కాలేజీ చదువు మాత్రం సంపన్నులకే పరిమితమైవుండేది.

క్రమంగా విద్యుచ్ఛక్తి సౌకర్యం వచ్చిన తరువాత ఆ వూరి సంపన్నులంతా మోటారు పంపుసెట్లకూ, రిఫ్రిజిరేటరు సౌకర్యానికి అలవాటుపడిపోయారు.

ఊరు అభివృద్ధి చెందడంతోపాటు స్వామీజీకి ఒక ఆశ్రమం ఏర్పడింది.

తన ఏకైక కుమారుడు స్వామీజీ దయవల్లనే బతికి బట్టకట్టాడనే కృతజ్ఞతతో ఒక సంపన్నుడు పదెకరాల తోటను స్వామీజీ ఆశ్రమంకోసం విరాళంగా ఇచ్చివేశాడు. ఊరి పెద్దల సహకారంతో, యువకుల శ్రమదానంతో ఆశ్రమం రూపుదిద్దుకుంది. దానితో స్వామీజీ తన నివాసాన్ని దేవాలయ ప్రాంగణంనుండి ఆశ్రమానికి మార్చుకున్నారు.

కాలక్రమంలో నాగరికత ద్వారా ఎన్నో మార్పులు వచ్చాయి. కానీ మానవమనస్తత్వంలో మార్పులు రావడం సులువుకాదు. బతికినంతకాలం ఎంత నిర్లక్ష్యంగా బతికినా, నాస్తికత్వాన్ని ప్రబోధించినా మృత్యుదేవత తమ పరిసరాలకు వస్తోందన్న అనుమానం రాగానే స్వామీజీ దగ్గరకు తీసుకువెళ్లమన

డమో లేక ఆయన్ని రప్పించడమో- ఆ వూరిలో అందరికీ అలవాటుగా మిగిలిపో యింది.

అందరికీ సన్నిహితుడైన స్వామీజీ దానికె న్నడూ అభ్యంతరం చెప్పలేదు.

కొన్ని కొన్ని సందర్భాల్లో అంతిమక్షణాలలో స్వామీజీ వద్ద తులసితీర్థం పుచ్చుకొని, మృత్యు ముఖంనుండి బైటపడినవారు లేకపోలేదు. అప్పుడు వారు స్వామీజీ ఆశీర్వచనంవల్లనూ, వారి తీర్థం ప్రభావంవల్లనూ బతికి బట్టకట్టా మనే సంతృప్తిపడుతూ వుంటారు.

స్వామీజీ మహిమ ఎలాంటిదనే విష యంలో శాస్త్రీయమైన రుజువు లేనప్పటికీ, దానివల్ల ఆ వూరికి మంచే జరిగింది. పిల్లికి బిచ్చంపెట్టని ఎందరో సంపన్నులు ఆశ్రమాని కి విరివిగా విరాళాలు ఇచ్చేవారు.



నానాటికి స్వామీజీకి అనుయాయుల సంఖ్య పెరుగుతూ వచ్చింది.

ఆశ్రమానికి వున్న అర్ధబలంతోను, అంగబలంతోను గ్రామాభివృద్ధికి ఎన్నో కార్యక్రమాలను చేపట్టారు. దారిద్ర్యదేవతనుఆ వూరి పొలిమేరలకు అవతలనే వుంచినట్లుగా తోస్తుంది చూసే వారికి.



పోలీసు జీపు ఆ వూరు వచ్చిన సందర్భాలు బహుతక్కువ.

ఇలా ప్రశాంతంగా గడిచిపోతున్న ఆ వూరిలో ఆ ప్రశాంతతకు కారకుడయిన స్వామీజీ అకస్మాత్తుగా హత్య గావించబడటం, అందులోనూ అతనివల్ల ఆరోగ్యం లాభంపొందిన నారాయణే ఆ హత్యచేయడంతో ఆ హత్య అందరి మనసులను కలచివేసింది.

స్వామీజీ రక్షవల్లే తమ గ్రామం అన్నివిధాలా అభివృద్ధిచెందింది. అలాంటి స్వామీజీనే పొట్టనపెట్టుకున్న తమ గ్రామానికి అరిష్టం తప్పదని ప్రజలంతా భయభ్రాంతులవుతున్నారు. ఊరంతా అల్లకల్లోలమైంది.

'నారాయణ ఇలా ఎందుకు చేశాడు...?' అనేది ఎవరికీ అంతుబట్టలేదు.

★ ★ ★

అది ఆరునెలలక్రితం సంగతి...

అపస్మారక స్థితిలో వున్న నారాయణను నలుగురు మనుషులు చేతులమీదుగా ఇంటికి తీసుకొని వచ్చారు.

ఆ వూరిలో వుండే ఒక్కగానొక్క ఆయుర్వేద వైద్యుడు ఆచార్యులుగారు రెక్కలు కట్టుకుని వాలారు.

నాడి చూస్తూనే పెదవి విరిచారు.

నారాయణ భార్య భారతికి అతని ఆరోగ్యాన్ని చూస్తుంటే దిగులుగా వుంది.

రోజురోజుకి చిక్కిపోతున్నాడు.

తరచు కడుపులో మంట అని బాధపడుతూ వున్నాడు.

ఉండుండి వాంతులు అవుతున్నాయి.

రెండునెలల నుండి పట్టెడన్నం తిన్న పాపాన పోలేదు- ఏపూటా.

ఒక్కసారి పట్నం వెళ్లి అన్ని పరీక్షలు చేయించుకుని, మందులు వాడితే బాగుంటుందని తను ఎంతగా చెవినిల్లు కట్టుకుని పోరినా వినిపించుకున్నాడు కాదు. ఈ గండం గడపడమెలా?

"డాక్టరుగారి కోసం పట్నం కబురుచేయమంటారా?" ఆరాటంగా అడిగింది భారతి.

"డాక్టరుగారు రావడానికి టైమ్ పడుతుంది కదమ్మా! ఆయన వచ్చేలోగా ఎందుకైనా మంచిది ముందు స్వామీజీకి కబురుచేయండి. అదృష్టం ఎలా వుందో!" నారాయణ నోరు తెరిచి- ఏదో పొడిచేసి అరికాళ్లకు, అరిచేతులకూ ఏదో తైలం మర్దనా చేస్తూ అన్నారు ఆచార్యులుగారు.

ఆయన మాటలు పూర్తికాకముందే గొల్లుమంది భారతి.

"ధైర్యంగా నిలబడి జరగవలసిందేమిటో ఆలోచించవలసినవేళ ఇలా కంగారుపడితే ఎలా తల్లీ! ఎందుకైనా మంచిదని కబురుచేయమన్నానుఅంతే- అయినా స్వామీజీ ఆశీస్సులు వుంటే నీ భర్త లేచికూచోవడం ఎంతసేపు? నీ భర్తకు కొద్దిసేపటిలో తెలివి వస్తుంది. అతని ఎదురుగా నువ్విలా శోకదేవతలా కనిపిస్తే, తన పరిస్థితి ప్రమాదకరంగా వుందని భయంతో మరింత ప్రాణాలమీదకు తెచ్చుకుంటాడు. ఈ స్థితిలో మీరు గుండె ధైర్యమే తెచ్చుకోవాలి. డాక్టరుగారికీ, స్వామీజీకీ కబురుచేయండి" నారాయణ నాడిని పరీక్షిస్తూ అన్నాడు ఆచార్యులుగారు.

వంటమనిషి రంగమ్మ తేరుకుని స్వామీజీ కోసం పోలయ్యను పంపింది.

డాక్టరు కోసం గుమాస్తాను పట్నం పంపించింది.

వయస్సు తెచ్చిన పెద్దరికంతో భారతిని అనునయంగా లోపలకు తీసుకెళ్లింది.

సంగతి తెలిసి వచ్చిన బంధుమిత్రులతో ఇల్లంతా హడావుడిగా వుంది. ఆచార్యులగారి ఆదేశంమేరకు అతనిగదిలోకి మాత్రం ఎవరికీ ప్రవేశం లేకపోయింది.

మాటిమాటికి నాడి చూస్తూ, ఏవేవో చూర్ణాలు నారాయణ నోటిలో వేస్తూ, స్వామీజీ రాక కోసం ఎదురుచూస్తున్నారు ఆచార్యులుగారు.

నారాయణలో కదలిక వచ్చింది. బలహీనంగా కళ్లు విప్పిన నారాయణకు అంతా మసకమసకగా కనబడింది. కళ్లు గట్టిగా మూసుకున్నాడు.

"ఏం నాయనా... ఎలావుంది?"

కళ్లు విప్పిన నారాయణ ఎదురుగా స్వామీజీ కనిపించేసరికి ఏదో భూతాన్ని చూసిన




# సుఖదాయకమైన జీవనము గడపదలచారా!



## నెల్లూరు టౌన్ ఏరియాలో ఉన్న మా

సప్తగిరికాలనీ, తల్పగిరి కాలనీ, పవన్‌కాలనీ, వేదగిరికాలనీలను మీరు ఒకసారి సందర్శించి నిర్ణయం తీసుకోండి.

ప్రతికాలనీలో రోడ్డుకిరువైపులా నీడనిచ్చు చెట్లతో ప్రతిప్లాటుకు టెంకాయచెట్లు వేసి పెంచబడుతున్నవి. విద్యుచ్ఛక్తి, షాపింగ్, హాస్పిటల్, దేవాలయము, స్కూలు వసతులతో మా కాలనీ అభివృద్ధి చేయబడును. కొనుగోలు చేసిన స్థలమునకు 12 శాతము వడ్డీ గ్యారంటీ ఇవ్వబడును. మరియు ఇండ్లకు అద్దె ఇవ్వబడును.

ప్రతి ఆదివారము ఉ8-30 గం॥ల నుండి 12 గం. వరకు స్థల సందర్శనము కొరకు మా ఆఫీసు నుండి ఉచిత వాహన సౌకర్యము కలదు.



వివరములకు:

**Promoters** ఫోన్:6729

# జె.ఎల్.నారాయణ & న్యూ కంపెనీ.,

14/291, ఊర్వశి కాంప్లెక్స్, కాపువీధి,
నెల్లూరు-524 001.

ట్లుగా వణికిపోయాడు. స్వామీజీ తనవద్దకు వచ్చారంటే తనకు అంత్యకాలం సమీపించిన ట్లేనా?- ఆ ఆలోచన మనసుకు తోచగానే మనిషి గజగజలాడిపోయాడు.

అది గమనించి...

"ఆందోళనపడకు నాయనా! మనసు నిర్మలంగా వుంచుకో" నారాయణ నుదుటిమీద చెయ్యి వేస్తూ అన్నారు స్వామీజీ.

"నిమిత్తమాత్రులం- ఆ పరమాత్ముని సంకల్పం తెలుసుకునే శక్తి మనకెక్కడిది నాయనా!"

"స్వామీ!" ఆరాటంగా స్వామీజీ రెండు చేతులూ పట్టుకున్నాడు నారాయణ. మనసులో ఏదో తపనపడుతున్నాడు.

"ఏం నాయనా... ఏమైనా చెప్పాలనుకుంటున్నావా?" అనునయంగానే అయినా సూటిగా అడిగారు స్వామీజీ.

తను ఏమైనా చెప్పాలనుకుంటున్నాడా?

ఏం చెప్పాలి?

తన జీవిత రహస్యాలను బహిర్గతం చేయాలా?

ఒక్కనిమిషం నారాయణ మనసు ఎదురు



తిరిగింది.

కానీ... కానీ.....

స్వామీజీతో ఏదో చెప్పాలనీ, చెబితేకాని గుండెలో భారం తగ్గదని అనిపించింది నారాయణకు.

తను చేసినవి పాపాలే అయితే స్వామీజీకి చెప్పడంతో వాటిని వదిలించుకోవచ్చు.

చావు తప్పకపోయినా, నరకం తప్పి స్వర్గలో కవాసమైనా చేయవచ్చు.

స్వామీజీ తనను కాపాడటానికి వచ్చాడు.

ప్రజలందరూ ఆయన్ని నమ్మడంలేదూ?

ఏదో మహత్తులేనిదే ఇంతమంది నమ్ముతారా?

ఈ ముప్ఫయిఅయిదేళ్లు ఈ లోకంలో తాను అనుకున్నదేమీ సాధించలేకపోయాడు.

స్వర్గనరకాల మాటలు ఎలా వున్నా, తన గుండెలమీద బరువు తగ్గించుకుంటే...?

అబ్బ... ప్రాణానికి ఎంత సుఖంగా వుంటుందో!?

తన గురించి స్వామీజీకి తెలిసినంతలో నష్టం ఏమీలేదు. స్వామీజీ మంచివాడు, నమ్మకస్తుడు, తండ్రిలాంటివాడు.

కాదు... కాదు... సాక్షాత్తు దేముడే!

''మనస్సు నిర్మలం చేసుకో నాయనా!''

''స్వామీ... నా గురించి అంతా చెబితే నన్నసహ్యించుకుంటారా?'' బేలగా అన్నాడు నారాయణ.

''నా కళ్లముందు పుట్టిపెరిగినవాడివి. నిన్ను అసహ్యించుకోవడమేమిటి? నిస్సందేహంగా చెప్పు... నీ భారం తగ్గిపోతుంది'' అన్నారు స్వామీజి.

''స్వామీ...నేను మీరనుకొనేటంత ఉత్తముడిని కాదు''

కన్నీళ్లు జలజల రాలాయి నారాయణకు.

''అనవసరంగా దుఃఖపడకు నాయనా! నాకు ఏదైనా చెప్పుకోవడంతో నీ మనసుకు ప్రశాంతత చేకూరుతుందన్న నమ్మకం నీకుంటే అలాగే కానియ్''

''స్వామీ... నేను చేసినదానిలో పాపమేదో పుణ్యమేదో నాకే తెలియదు. నా జీవితాన్ని మీ ముందు పరుస్తున్నాను... మీరే నిర్ణయించండి''

ఆయాసపడుతూ బలహీనంగా అన్నాడు నారాయణ.

అంతవరకూ అక్కడే వుండి మౌనంగా తన పని తాను చేసుకుపోతున్న ఆచార్యులవారు- నారాయణ నోటిలో ఏదో చూర్ణం వేసి గ్లూకోజు నీళ్లుతాగించి గది బైటకు వెళ్ళిపోయారు.

వెళ్తూవెళ్తూ గది తలుపులు దగ్గరగా వేసి, వారికి ఏకాంతం కల్పించారు.

స్వామీజీ తన కమండలంలోని నీరు కొద్దిగా నారాయణకు స్ఫూనుతో పోశారు.

తన జీవితగాథ స్వామీజీ ముందుపరచాడు నారాయణ.




''రాము పెన్సిలు ఎవరు తీశారు చెప్పండి? ఊరుకుంటున్నకొద్దీ రోజురోజుకీ మితిమీరిపోతున్నారు. ఇదొక ఆటలా తయారయింది'' అంటూ కోపంతో మండిపడుతున్నారు క్లాసు టీచరు శంకరంగారు.

అయిదోక్లాసు చదువుతున్న ఆ పిల్లలంతా బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు–

మళ్ళీ ఎవరికో మూడిందని.

పెన్సిలు పోగొట్టుకున్న రాము గట్టిగా ఏడుస్తున్నాడు.

రోజూ సాయంత్రం ఇంటికి వెళ్ళగానే, వాళ్ళ అమ్మ ముందుగా వాడి పుస్తకాల సంచి చూస్తుంది– పుస్తకాలు, పెన్సిలు, రబ్బరూ అన్నీ వున్నాయోలేవోనని.

ఏవి లేకపోయినా వాడి ఒళ్ళు హూనం కావలసిందే. డిసిప్లిన్ పేరుతో అమానుషంగా

ప్రవర్తిస్తూ వుంటుందా తల్లి.

ఇప్పుడీ పెన్సిలు పోగొట్టుకుని ఇంటికి వెళ్లాలనే ఊహకే వణికిపోతున్నాడు పసివాడు.

"ఊ... సరే– ఎవరు తీసింది చెప్పరన్న మాట. నారాయణా! ఒక్కొక్కరి సంచీ వెతుకు" క్లాసు లీడరును ఆదేశించారాయన.

నారాయణ ఒక్కొక్క స్టూడెంటు దగ్గరికి వచ్చి సంచి వెతుకుతుంటే, ఆ పిల్లలు బిక్కు బిక్కుమని చూస్తున్నారు. తనని దాటి వెళ్ళగానే "అమ్మయ్య" అని తేలిగ్గా వూపిరి పీల్చుకుంటున్నారు.

పిల్లలందరి సంచులు వెతకడం అయింది. ఎవరి సంచిలోనూ రాము పెన్సిలు దొరకలేదు. పిల్లలందరి గుండెలు కుదుటపడ్డాయి.

"వెధవా... ఏగ్రౌండులోనో పారేసుకుని వుంటావు... వెళ్ళి వెదుక్కో" కోపంతో రామునే మందలించారు శంకరం మాష్టారు.

"లేదు మాష్టారూ! ఔటుబెల్లుకి ముందు సంచి సర్దుకునే బైటకు వెళ్ళాను. జేబులో పెట్టుకుంటే పడిపోతుందని సంచిలోనే పెట్టాను మాష్టారూ! అమ్మతోడు" తలమీద అరిచెయ్యి పెట్టుకొని మరీనొక్కి చెప్పాడు రాము.

"మరేమవుతుందిరా! నీ ఎదురుగానే అందరి సంచీలు వెతికాంకదా! ఎవరైనా తీస్తే కనిపించక ఏమౌతుంది?" రామునే ఎదురు ప్రశ్నించారు మాష్టారు.

"మాస్టారూ..." ఏదో ఆలోచించినట్లు బుర్ర గోక్కుంటూ అన్నాడు నారాయణ. "మనం సంచులు వెతుకుతున్నాం కదాని ఇంకెక్కడైనా దాచారేమో?"

అమాట నచ్చింది మాష్టారికి.

"ఏమర్రా? ఇప్పటికైనా నిజం చెప్పండి. ఒక్క పెన్సిలుముక్క పోయినందుకు కాదర్రా? దొంగతనం చేసినవారికి పుట్టగతులుండవు. ఈరోజు సరదాకి పెన్సిలు ముక్క దొంగిలించిన వాళ్ళు పెద్దయితే ఎన్నెన్ని అఘాయిత్యాలు చేస్తారో? చెప్పండి... ఎవరు తీశారు?"

"మాకేమీ తెలియదు మాష్టారూ?" పిల్లలంతా ముక్తకంఠంతో అరిచారు.

"ఊ... నారాయణా! అందరి జేబుల్లో వెతుకు" కోపంతో ఆజ్ఞాపించారు.

"బల్లలకింద కూడా వెతికితే!" నసుగుతూ సూచించాడు నారాయణ.

"సరే... ఏదోఒకటి చెయ్" విసుగ్గా అంటూ తన కుర్చీలో కూర్చున్నారు శంకరంగారు. కోపంతో మండిపడిపోతోంది ఆయన అంతరంగం.

తన విద్యార్థులు ఉన్నత స్థాయినందుకోవాలనీ, నైతిక విలువలు పెంపొందించుకోవాలనీ, సమాజానికి సేవచేయాలనీ, ఆ భావిభారత పౌరులపై కొండంత ఆశపెట్టుకున్న ఆదర్శ ఉపాధ్యాయుడాయన. తన విద్యార్థులు ఆ దారిలో ప్రభావితులయ్యారనే ఇన్నాళ్ళూ సంతోషిస్తూ వచ్చారుకూడా.

ఈమధ్య తన క్లాసులో తరచుగా దొంగతనాలు జరగడం ఆయనకు తలవంపులుగా వుంది. దొంగతనమంటే విలువైన వస్తువులని కాదు– పక్కవాడి పెన్సిలో, పుస్తకమో! అయితే మాత్రం? దొంగిలించాలనే బుద్ధే పుట్టకూడదు. దానివల్ల విద్యార్థుల నైతికప్రవర్తన దెబ్బతింటుందనే ఆయన బాధ.

క్లాసులో దొంగతనాలు జరగడం,పోయిన పెన్నో పెన్సిలో పక్కవాడి సంచిలో దొరకడం, ఆ కుర్రవాడు నాకు తెలియదు మొర్రో అనడం– జరుగుతుంది. దొంగతనం చేయడమే కాకుండా అబద్ధాలు ఆడుతున్నందుకు శంకరంగారు మరింత దండిస్తున్నారు. ఆయన దండనతోపాటు 'దొంగ' అనీ, 'అబద్ధాలకోరు' అని తోటిపిల్లలు హేళనచేయడం తరచుగా జరుగుతోంది.

ఒక్కొక్కసారి ఆ దొంగతనం చేసినవాడి మొహం చూస్తే శంకరంగారికే మనసంతా కలచివేసినట్లు అవుతోంది. ఆయన దండించకపోతే తరువాత జీవితంలో వాళ్ళేమైపోతారో?

ఎలాగైనా తన విద్యార్థులు ఉన్నతమైన జీవితం గడపాలి. అదే ఆయన ఆశయం.

"ఇదిగో... గోపాల్ బల్లకింద దొరికింది మాస్టారు" ఒక్కొక్కరి బల్లకింద వెతుకుతూ వస్తున్న నారాయణ కేకవేశాడు.

బిక్కమొహం వేసుకుని భయం భయంగా మాస్టారివైపు చూస్తూ నిలబడ్డాడు గోపాల్.

నిర్ఘాంతపోయి గోపాల్‌నే చూస్తున్నారు మాస్టారు.

గోపాల్ చిన్నతనంనుండి తన ప్రాపకంలో పెరిగిన కుర్రాడు.

వాడిని కూడా తాను ప్రభావితం చేయలేక పోయాడంటే, ఇక మిగిలిన పిల్లలగురించి అనుకోవడమెందుకు?

వీళ్ళనేం చేయాలి? ఏంచేస్తే వీళ్ళు సక్రమ మార్గంలోకి వస్తారు?





కోపమూ, ఆవేదనా కలిసి ఆయన విచక్షణా జ్ఞానాన్ని చంపేశాయి.

"మాస్టారూ! నాకేం తెలియదు. నేను రాము పెన్సిలు తీయలేదు. నన్ను నమ్మండి మాస్టారూ!"

ఆ పసివాడి రోదన అరణ్యరోదనే అయింది.

చుట్టూ కుర్రవాళ్ళంతా తెల్లబోయి చూస్తున్నారు.

శంకరం మాస్టారు ఉగ్రనరసింహమూర్తే అయ్యారు.

ఆ హడావుడికి మిగిలిన టీచర్లూ, హెడ్‌మాస్టారూ కూడా ఆ తరగతి గదిలోకి వచ్చేశారు.

దెబ్బ తగలరాని చోట తగలడంతో "మాస్టా

డు గోపాల్.

"మాస్టారూ... ఏమిటిది? వదలండి" మిగిలిన మాస్టార్లు బలవంతంగా శంకరంగారిని హెడ్‌మాస్టారు రూములోకి తీసుకువెళ్ళారు.

ఏం జరిగిందో ఎవరికీ అర్థంకావడంలేదు.

ఏమడిగినా శంకరంగారి నోటివెంట మాట రావడంలేదు. ఆవేశంతో మనిషి రొప్పుతున్నారు.

"గోపాల్ చచ్చిపోయాడు మాస్టారూ" లోపలికి వచ్చి హెడ్‌మాస్టారుతో చెప్పాడు రెండవతరగతి మాస్టారు.

అంతవరకు చలనం లేని శంకరంగారిలో కదలిక వచ్చింది.

ఒక్క పరుగున తన క్లాసురూములోకి వెళ్ళి కిందపడివున్న గోపాల్‌ని తన వడిలోకి తీసుకుని కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నారు.

"బాబూ..." ఆక్రోశంతో కూడిన పిలుపుకి చటుక్కున తలఎత్తి చూశారు శంకరం మాస్టారు.

ఎదురుగా గోపాల్ తల్లి లక్ష్మమ్మ.

తనకు రోజూ పాలుపోసే మనిషి.

చటుక్కున ముందుకు వచ్చి గోపాల్‌ను తన వడిలోకి తీసుకుని గొల్లుమంది, ఆ తల్లి.

"బాబూ... నాబిడ్డకేమైంది? మీకన్నబిడ్డలతో సమానంగా చూసుకొనేవారే? వాడేం నేరంచేశాడని ఈ శిక్ష వేశారు? 'గొడ్లను కాచుకునేవాళ్లం మాకెందుకు బాబూ ఈ చదువులంటే', చదువుకుని నీకొడుకు రాజ్యాలేలుతాడన్నారే'-- ఇపుడు శ్మశానాన్ని ఏలమని పంపించేశారా బాబూ! నాకొడుకుది రాజయోగమన్నారే, పూర్తిగా కళ్ళు తెరవని పసివాడు, ఇంతలోనే నూరేళ్ళు నిండిపోవడమేనా బాబూ-- వీడికి పట్టిన రాజయోగం? మిమ్మల్నే నమ్ముకున్నామే, ఎందుకుబాబూ... నా ఒక్కగానొక్క కొడుకుని పొట్టనపెట్టుకున్నారు? పసివాడు, ఏదైనా తెలియక పొరపాటుచేస్తే దండించవచ్చు లేకపోతే స్కూలునుంచి పంపించేయవచ్చుగా బాబూ!" లక్ష్మమ్మ ఘోష వింటున్నవారికి కళ్ళమ్మట నీళ్ళు తిరు

"ఈ పనికిమాలిన చదువుకు పంపి నిన్ను దూరంచేసుకున్నానురా! గొడ్లను కాచుకుంటూ హాయిగా, సుఖంగా నాకళ్ళెదుట బతకవలసినవాడివికదరా! మనకెందుకురా ఈ చదువులంటే విన్నావు కాదు"

మరొక్కసారి గొల్లుమంది లక్ష్మమ్మ.

★ ★ ★

"గోపీ...గోపాల్" పెద్దగా కేకపెట్టి లేచి కూర్చున్నాడు నారాయణ. తుళ్ళిపడి లేచారు అతని తల్లి పార్వతమ్మ, తండ్రి రంగారావు.

లైటువేసి చూసేసరికి మంచం మధ్యలో పిచ్చిచూపులు చూస్తున్న నారాయణ.

ఒళ్లంతా చెమటతో తడిసి ముద్దయింది, వణికిపోతున్నాడు.

"బాబూ" తండ్రి చటుక్కున దగ్గరకు తీసుకున్నాడు నారాయణను.

కెవ్వుమన్నాడు - నారాయణ - "వద్దు వద్దు ... నన్నేంచేయకు గోపీ" పిచ్చిగా కేకలు వేస్తున్నాడు నారాయణ. తండ్రి చేతులలో నుండి తప్పించుకోవాలని గింజుకుంటున్నాడు.

"పిల్లాడు బెదిరిపోయాడండీ! ఏం చేద్దాం?" కలవరపడుతోంది తల్లి.

"నువ్వు అనవసరంగా కంగారుపడి వాడిని కంగారుపెట్టకు. పొద్దున్న స్కూలులో జరిగిన ఘోరానికి పసివాడు బెదిరిపోయి వుంటాడు" భార్యను వారిస్తూ నారాయణను మరింత దగ్గరకు తీసుకున్నాడు రంగారావు.

ఉదయం స్కూలులో జరిగిన సంగతి వెంటనే ఊళ్ళో అందరికీ తెలిసిపోయింది. అంతకాలం శంకరం మాస్టారు దేముడు అన్న ఆ జనమే పిల్లల్ని పొట్టనపెట్టుకొనే నరరూప రాక్షసుడన్నారు.

స్త్రీలంతా మెటికలువిరిచారు. శాపనార్థాలు పెట్టారు.

"బాబూ ... నారాయణా! ఇలాచూడు... నేను ... మీనాన్ననురా! పూర్తిగా మెలకువతెచ్చుకో. ఏమైనా కలవచ్చిందా? మరేం భయంలేదు. మన ఇంట్లోనే ఉన్నావు - ఒక్కసారి కళ్ళుతెరచి చూడు"

అనునయంగా అంటూ నారాయణకు




[illegible] తండ్రి.

భయం భయంగా కళ్ళు విప్పిన నారాయణ, ఎదురుగానున్న తండ్రిని చూసి బావురుమంటూ అతన్ని హత్తుకుపోయాడు.

"నాన్నా ... రాము పెన్సిల్ గోపాల్ తీయలేదు నాన్నా! నేనే తీసి గోపాల్‌బల్ల కిందపెట్టాను. నిజంగా వాడు చచ్చిపోతాడని తెలియదు నాన్నా!"

బావురుమంటున్న నారాయణ మాటలు వింటూ కొయ్యబారిపోయారు తల్లీ తండ్రీ కూడా.

"ఏమిట్రా నువ్వనేది?" అపనమ్మకంతో అడిగింది తల్లి.

"అవునమ్మా ... గోపాల్‌ని ఏడిపించాలని నేనే రాము పెన్సిల్‌తీసి గోపాల్ బల్లకింద దాచాను - గోపాల్ దొంగతనం చేశాడంటే, మాస్టారికి కోపం వస్తుందో రాదోనని..."

చటుక్కున నారాయణ నోరుమూశాడు రంగారావు - గోడలకు చెవులుంటాయనే భయంతో.

"ఎంత పనిచేశావురా బాబూ! నీ ఆకతాయి తనంవల్ల ఒక నిండుజీవానికి నూరేళ్ళు నిండిపోయాయికదరా" గొల్లుమంది తల్లి.

"ఇదిగో! నువ్విలా గాభరాపడి వాడిని మరింత గాభరాపెట్టకు ముందు జరగవలసిందేమిటో ఆలోచించు. ఈ విషయం ఏ మాత్రం నీపెదవిదాటి బైటకు రాకూడదు. ఈ విషయం బైటకుపోతే మనవాడిగతి ఏమిటో ఆలోచించు. పోయినవాడు ఎలాగు బతికిరాడుగదా ... జాగ్రత్త"

కఠినంగా ఆజ్ఞాపిస్తున్నట్లే అన్నారు రంగారావు.

"భగవంతుడా!వీడు తెలిసీతెలియని చిలిపితనంతో ఒక తల్లి కడుపులో చిచ్చుపెట్టాడు. ఆ తల్లి ఉసురు నా బిడ్డకు తగలనివ్వకు, అదేదో నాకే తగిలేటట్టుచెయ్యి. నా బిడ్డను మాత్రం నూరేళ్ళు చల్లగా బతికేటట్టు ఆశీర్వదించు" మనసులోనే భగవంతుడికి చేతులు జోడించింది పార్వతమ్మ.

నారాయణ స్వతహాగా చిలిపివాడు. ఎప్పుడూ ఏవో ఆకతాయిపనులు చేస్తూనే వుంటాడు. [illegible] కూడా వస్తూవుంటుంది కూడా. అయినా ఊరిలో మోతుబరి కొడుకు కాబట్టి వాడి ఆటలు సాగుతున్నాయి.

ఒకరోజు సరదాకు ఒక కుర్రాడి పుస్తకం తీసి మరొకడి సంచిలో పడేసి తన దారిన తాను ఆటలకు వెళ్ళిపోయాడు నారాయణ.

ఇంటర్‌వల్ అయిన తరువాత క్లాసులో అలజడి రేగింది. పుస్తకం పోయిందని ఆ కుర్రాడు గోల. అందరి సంచులూ వెతకగా, పక్క కుర్రాడి సంచిలో దొరికింది. 'నాకేమీ తెలియదని వాడిగోల. చుట్టూ మిగిలిన పిల్లలంతా వాడిని దొంగ అని హేళనచేయడం గొప్పథ్రిల్లింగ్‌గా ఉంది నారాయణకు.

రెండో కంటివాడికి తెలియకుండా ఇన్నాళ్ళూ పిల్లల్ని అలా ఏడిపిస్తూవచ్చాడు. తమ సంచిలోకి ఎవరిదో వస్తువు ఎలా వచ్చిందో తెలియక పిల్లలు తికమకపడుతూ ఉంటే వాళ్ళనిచూసి నారాయణ తనలో తనే నవ్వుకుంటూ ఉండేవాడు.

వాడికిదంతా ఆటలావుండేదితప్ప అంతకంటే సీరియస్‌గా ఎప్పుడూ ఆలోచించలేదు.

నారాయణ ఊళ్ళోవుంటే ఈ గోపాల్ విషయం మరచిపోలేడనీ, పైపెచ్చు ఈ విషయం పొరపాటునైనా బైటకువస్తే, నారాయణ భవిష్యత్తు ఏమైపోతుందోననే భయంతో నారాయణను మేనమామ దగ్గరకు పంపించివేశారు తల్లిదండ్రులు.

తన మూర్ఖత్వం కారణంగా గోపాల్ ప్రాణాలు కోల్పోవడంతో మతిచెడి, భార్యాబిడ్డలను గాలికివదిలి దేశాలు పట్టుకుపోయారు శంకరంగారు.

నారాయణ చిలిపితనం అలా రెండు నిండు కుటుంబాల్ని సర్వనాశనం చేసింది.

మేనమామ ఇల్లు చేరిన నారాయణ మాత్రం క్రమంగా ఈ సంఘటనను మరిచేపోయాడు.

ఎటూ హైస్కూలు చదువు ఆ ఊరిలోలేదు కాబట్టి వేసవి సెలవుల అనంతరం మేనమామగారి ఊరిలోనే హైస్కూల్లో చేరాడు.



నారాయణ బి.ఎ.లో చేరాక ఆ కాలేజీ హాస్టలు లేనందువల్ల కొంతమంది స్టూడెంట్సు కలసి పెట్టుకున్న మెస్‌లో చేరాడు.

నారాయణ అల్లరి మనస్తత్వానికి, స్టూడెంట్స్ మెస్, పాలపొంగులాంటి వయసు తోడయ్యాయి. అల్లరి మరికాస్త ఎక్కువైంది.

అయినా స్వతహాగా తెలివైనవాడు కాబట్టి ఎప్పటికప్పుడు మంచి మార్కులతో పాసవుతూ ఉండటంతో రంగారావుగారికి అతని ప్రవర్తనను గురించి తెలుసుకునే అవసరమూ, అవకాశమూ లేకుండాపోయింది.

"మిస్టర్ నారాయణా ... ఏలోకంలో ఉన్నావ్?" క్లాసులో లెక్చరర్ గద్దించి అడుగుతున్నాడు. నారాయణ సావకాశంగా లేచి నిలబడ్డాడు.

అంతవరకు తనముందు వరసలో కూర్చున్న విద్యార్థిని జడ చివరినున్న రిబ్బను కాలి వ్రేళ్ళతో అందుకొనే ప్రయత్నం చేస్తున్నాడతను.

"స్వప్నలోకంలో సర్" ఎంతో వినయంగా మొహంపెట్టి చెప్పిన నారాయణ జవాబుకి క్లాసంతా గొల్లుమని నవ్వారు.

నారాయణ ముందు కూర్చున్న ఆ విద్యార్థిని "స్వప్న" చటుక్కున వెనుదిరిగి నారాయణను మింగేసేటట్లు చూసింది.

విలాసంగా నవ్వాడు నారాయణ.

"సైలెన్స్, సైలెన్స్" లెక్చరర్ రావుగారి గదమాయింపుతో క్లాసంతా నిశ్శబ్దమైంది.

"ఆడపిల్లను గౌరవించే సంస్కారాన్ని అలవరచుకోవాలయ్యా! మహాత్మాగాంధీ ఏం చెప్పాడు? ఎప్పుడైతే స్త్రీ అర్థరాత్రి నిర్భయంగా బైటకు రాగలదో, అప్పుడే దేశానికి నిజమైన స్వాతంత్ర్యం - అన్నాడు అందుకే..."

"మేం కూడా అలాంటి నిజమైన స్వాతంత్ర్యం ఎప్పుడు వస్తుందా - అనే చూస్తున్నాం సర్" ఎక్కడలేని సిన్సియారిటీని చూపిస్తూ అన్నాడు నారాయణ.

"మాటలు నేర్చావయ్యా..."

రావుగారు ఇంకేదో అంటుండగానే లాంగ్ బెల్ మోగింది.





స్టూడెంట్స్ [illegible] త్తారు.

★ ★ ★

"నా హృదయంలో నిదురించే చెలీ! స్వప్నాలలో వేధించే సఖీ" అమ్మాయిల గ్రూపువెనుకే తన గాంగ్‌తో వస్తున్న నారాయణ గొంతెత్తి పాడుతున్నాడు.

ముందు నడుస్తున్న స్వప్న కోపంగా వెనక్కి తిరిగింది.

"మిస్టర్ నారాయణా..."

"ఎస్‌మేడం..." వినయంగా తలవంచి అన్నాడు నారాయణ.

అతని కళ్లలో చిలిపితనం వుట్టిపడుతోంది.

"నీకేం పనిపాటలేదా?" కోపంగా అడిగింది స్వప్న.

"నేనేం చేశాను మేడం? పాట పాడుతూనే ఉన్నానుగదా" సిన్సియర్‌గా అడిగాడు నారాయణ.

ఆడపిల్లల్లో ఆ మాత్రం రెస్పాన్స్ రావడం అతనికి చాలా సంతోషంగా ఉంది.

"ఎందుకలా ఆడపిల్లల వెనుకనే తిరుగుతూ ఉంటావ్?" కోపంగా అడిగింది స్వప్న.

అల్లరిగా నవ్వాడు నారాయణ.

"బాగుంది. మేం ముందుకు వెళ్లడానికి వీల్లేకుండా రోడ్డంతా ఆక్రమించుకుని, మాదారికి అడ్డువస్తున్నది మీరు. సరే ... పదండిరా - మనమే ముందుకు వెడదాం, పాపం, మొగపిల్లల వెంటపడితిరగాలనే మన విద్యార్థినుల కోరికను తీరుద్దాం"

గబగబా మొగపిల్లలంతా ఆడపిల్లలను దాటుకుని రోడ్డంతా ఆక్రమించుకుని పెళ్లినడకలు నడవడం ప్రారంభించారు.

అమ్మాయిలకు కళ్లనీళ్ళ పర్యంతం అయింది.

ఊరుకుంటే తమదారినతాము గబగబ నడుచుకుంటూ వెళ్లే అవకాశం వుండేది. ఇప్పుడా అవకాశం లేకుండా ముందుకు దారి ఇవ్వకుండా అటకాయిస్తున్నారు.

"నీలి మేఘాలలో, మధుర స్వప్నాలలో" గొంతెత్తి పాడుతున్నాడు నారాయణ.

అతని స్నేహితులు పాటకు తాళం వేస్తు

# లైఫ్‌బాయ్ ఎక్కడో ఆరోగ్యం అక్కడ




## లైఫ్‌బాయ్

మురికిలోని క్రిములను వదలగొడుతుంది

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS L 98 1611 TL

న్నారు.

"వాటీస్ దిస్ నాన్సెన్స్"

వెనక్కి తిరిగి చూసిన ఆడపిల్లలకు ప్రాణా లు లేచివచ్చాయి తమ వెనుకనున్న ప్రిన్సిపాలుగారిని చూడగానే.

మొగపిల్లలంతా చటుక్కున బుద్ధిమంతులైపోయారు.

"సార్... వీళ్లంతా ఎప్పుడూ ఇంతేసార్- ఇలాగే మావెంటబడి అల్లరిచేస్తూ వుంటారు" వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోకుండా చెప్పింది స్వప్న.

"సరే... మీరు రిపోర్టు రాసి ఇవ్వండి" చరచరా ముందుకు నడిచారు ప్రిన్సిపాలుగారు.

అమ్మాయిలు ఆయన్ని అనుసరించారు.

స్వప్న ఆమె స్నేహితురాళ్లు ఇచ్చిన రిపోర్ట్ ఆధారంగా నారాయణనూ, అతని మిత్ర బృందాన్ని వారంరోజులు సస్పెండ్ చేశారు ప్రిన్సిపాలుగారు.

వీళ్లేం తక్కువతిన్నారా!

విద్యార్థుల సమ్మె ప్రారంభమయింది.

మరునాడు ఉదయం పదిగంటలవేళ మామూలుగా కాలేజీకి వచ్చిన ప్రిన్సిపాలుగారు కాలేజీ బైట జరుగుతున్న హడావుడిచూసి అదిరిపోయారు.

రాత్రికి రాత్రి కాలేజీగేటు ఎదురుగా ఎత్తయిన వేదికను నిర్మించారు.

"విద్యార్థి నాయకుడు నారాయణ ఆమరణ నిరాహారదీక్ష"

తాటికాయలంత అక్షరాలతో బోర్డు దూరానికే కనిపిస్తోంది వేదికపైన.

"సానుభూతిగా విద్యార్థి సోదరుల రిలే నిరాహారదీక్ష" అని ఇంకొక బోర్డు.

వేదికమీద మెడలో పూలమాలలు వేసుకుని నారాయణ కూర్చుని వున్నాడు.

వెనుక నలుగురు విద్యార్థులు కూడా దండలు వేసుకుని కూర్చుని వున్నారు.

చుట్టూ విద్యార్థి సమూహం. కావలసినంత హడావుడి.

అక్కడక్కడ నినాదాలు రాసిన బోర్డులు కనిపిస్తున్నాయి.

"విద్యార్థినుల జులుం నశించాలి"

"ప్రిన్సిపాల్‌గారి దౌర్జన్యం నశించాలి"

"సమాన పురుషహక్కులకోసం తుదిరక్తపుబొట్టు వరకు పోరాడుతాం"

"పురుష సంక్షేమంకోసం పోరాటం"

"స్త్రీల దౌర్జన్యం నశించాలి"

ప్రిన్సిపాల్‌గారికి మతిపోయింది.

"ఏంపిల్లలు... ఈ యూనిటీ మంచి విషయాలలో చూపితే?..." అనుకోకుండా వుండలేకపోయారు.

"ప్రిన్సిపాల్ డౌన్ డౌన్"

"స్త్రీ జనపక్షపాతి ప్రిన్సిపాలుగారు కళ్లు తెరవాలి"

"స్త్రీ అహంకారానికి బలి అయిపోతున్న అమాయకులను ఆదుకోవాలి"

"నారాయణ జిందాబాద్"

"ప్రిన్సిపాల్ డౌన్‌డౌన్"

విద్యార్థుల నినాదాలతో ఆ పరిసరాలన్నీ మార్మోగిపోయాయి. ఆ నినాదాల మధ్య ప్రిన్సిపాల్‌గారు తల వంచుకుని తన రూములోకి వెళ్లిపోయారు.

స్వప్న తన స్నేహితురాళ్లతో కలసి రావడం దూరం నుండి కనిపించింది.

"స్వప్న డౌన్ డౌన్"

"నారాయణ జిందాబాద్"

నినాదాలు మిన్నుముట్టాయి.

స్వప్న ఆ పరిస్థితి గమనించి గతుక్కుమన్నా మరుక్షణంలోనే ధైర్యంగా ముందుకుసాగింది తన స్నేహితురాళ్లతో.

"స్త్రీలు నశించాలి" ఎవరో గొంతు చించుకుని అరిచారు.

"నీమొహం... స్త్రీలు నశించడమేమిట్రా! అలాగైతే ఇక మనకు పెళ్లిళ్లు ఎలా అవుతాయి" సమాన స్థాయిలో ఇంకొక కంఠస్వరం వినబడింది.

"అవునవును... కొందరు స్త్రీల దౌర్జన్యం నశించాలి" అంటూ నినాదాలు ప్రారంభించారు.

నిర్లక్ష్యంగా ముందుకు అడుగువేసిన ఆడ




పిల్లలకు ప్రిన్సిపాలుగారి వద్దనుండి కబురు వచ్చింది ఇంటికి మరలి పొమ్మని.

★ ★ ★

ముందు తేలికగా తీసుకున్నా నాలుగు రోజులు గడిచినా సమ్మె పరిస్థితిలో మార్పు కనపడకపోయేసరికి ప్రిన్సిపాల్‌గారు కంగారు పడటం ప్రారంభించారు.

కానీ, నయానా భయానా ఎంత చెప్పినా విద్యార్థులు ఆయన మాటలను పెడచెవిని పెట్టారు.

నాలుగు రోజులకే నారాయణ నీరసపడటం చూసేసరికి విద్యార్థులలో ఉద్రిక్తత హెచ్చింది. అయినా వాళ్లు దౌర్జన్యానికి దిగలేదు. దానితో ఊరిపెద్దల సానుభూతి లభించింది.

విద్యార్థుల తండ్రులు, రాజకీయ నాయకులు రంగంలోకి దిగారు.

కాలేజీ కమిటీవారు కల్పించుకోవడంతో ప్రిన్సిపాల్‌గారు దిగిరాక తప్పలేదు.

కాలేజీ యాజమాన్యం స్టూడెంట్సుని చర్చలకు పిలిచింది.

దానికోసమే ఎదురుచూస్తున్నా విద్యార్థులు బెట్టుసరి చూపించారు. చర్చలు తమ వేదికవద్దనే జరగాలనీ, ఇన్నాళ్ల నిరాహారదీక్షతో నారాయణ నీరసించిపోయాడు కాబట్టి నడవగలిగే స్థితిలో లేడనీ పట్టుబట్టారు.

నిరాహారదీక్ష విరమించి ప్రిన్సిపాల్‌గారి రూములో హాజరు కావలసిందని వర్తమానం పంపించారు.

"తీరా దీక్ష విరమించిన తరువాత ప్రిన్సిపాల్‌గారు తమ కోరికలను పెడచెవిన పెడితే?"

విద్యార్థుల సందేహంవిన్న ప్రిన్సిపాల్‌గారు స్వయంగా వేదికవద్దకు వచ్చారు.

విద్యార్థుల కోర్కెలనన్నిటిని తీర్చడం జరుగుతుందనీ, నారాయణను దీక్ష విరమించమని చెప్పారు. అసలీ రభసకు అంతకూ కారణం స్వప్న ఆమె స్నేహితురాళ్లూ కాబట్టి, చర్చలకు వారు తప్పనిసరిగా రావాలని విద్యార్థులంతా పట్టుబట్టారు.

విద్యార్థిని, విద్యార్థులు ఐకమత్యంతో మెలగాలని ప్రిన్సిపాల్‌గారు వుద్బోధించారు.

నిమ్మరసం గ్లాసు ప్రిన్సిపాలుగారు అందించడంతో నారాయణ ఆమరణ నిరాహారదీక్ష అంతమైంది.

విద్యార్థులపై విధించిన సస్పెన్షన్ కూడా రద్దయింది.

విద్యార్థుల జయజయధ్వానాలు మిన్నుముట్టాయి.

★ ★ ★

"రేపే కమిటీ మీటింగట. మనల్నందరిని తప్పనిసరిగా హాజరవమని నోటీసు వచ్చింది"

గిరిజ మాటలతో అందరికీ గుండెలు జారిపోయాయి.

ఇదిలా చిలికిచిలికి గాలివాన అయింది. ఆరోజేదో వాళ్లదారినవాళ్లు అరచుకుంటూంటే తమదారినతాము తలవంచుకుని వెళ్లిపోవాల్సింది. ఏ సమస్యాలేకపోయేది.

అనవసరంగా వాళ్లమీద రిపోర్ట్‌ఇచ్చి ఇంత గొడవకూ కారణమయ్యారు తామంతా.

"బాబోయ్... మా నాన్నకి విషయం తెలిస్తే చంపేస్తారు. ఆ గ్రూపులోనేను వున్నట్లు మావాళ్లకి తెలియదు" గుండెలు బాదుకుంది సావిత్రి.

"మా అన్నయ్య వీధి గుమ్మంలో నుంచుంటేనే చంపేస్తాడు. ఇలా వీధి ఎక్కి మొగపిల్లల్ని అవమానించినట్టు తెలిస్తే" ... వాక్యం పూర్తి చేయలేకపోయింది నీరజ.

"మా అమ్మకు నేనసలు కాలేజీలో చేరడమే ఇష్టంలేదు. ఇలాంటి గొడవలలో ఇరుక్కున్నట్లు తెలిస్తే కాళ్లు విరచి పొయ్యిముందు కూర్చోబెట్టేస్తుంది" బెంబేలు పడిపోతోంది విద్య.

అందరి భయాల్నీ ఒక్కమాటతో ఎగరగొట్టింది స్వప్న.

"నారాయణ గ్రూపువాళ్లు ఆడపిల్లలను ఏడిపించడం కొత్తకాదు. కాలేజీలో అందరికీ ఆవిషయం తెలుసు. ప్రత్యక్షంగా ప్రిన్సిపాల్‌గారే చూశారు. మనం రిపోర్టు చేశాం. వాళ్లు చెప్పుకునేదేదో వాళ్లు చెప్పుకుంటారు. మనం చెప్పుకునేదేదో మనం చెబుదాం.

దీనికింత కొంపలు మునిగిపోయినట్లు ఈ గొడవేమిటి?'' విసుగ్గా అంది స్వప్న.

''ఆఁ! నీకేం... ఎన్నైనా కబుర్లు చెబుతావు, మీ అమ్మగారు నీమాట కాదనరు కాబట్టి. అయినా ఎందుకంత తొందర నీకు? ప్రిన్సిపాల్‌గారికి రిపోర్టు ఇస్తే ఆ అవమానం అబ్బాయిలు భరించగలరనే అనుకున్నావా?''

చివరికి తప్పంతా స్వప్న నెత్తికే చుట్టారు అ [illegible]

''అవును... ఎందుకలా వాళ్లమీద రిపోర్టు



ఇవ్వడం?'' అమ్మాయిలంతా వంత పాడారు.

''ఎందుకా... నేను మీలాగ పిరికిదానిని కాదు కాబట్టి. అన్యాయానికి తల వంచలేను కాబట్టి'' విసురుగా వెనుదిరిగి బైటకు నడిచింది స్వప్న.

మీటింగ్ మొదలయ్యింది.

''అవును సార్... మీరు అమ్మాయిల మాటలు నమ్మినట్లు మామాటలెలా నమ్ముతారు? వాళ్లు చెప్పిందే వేదం. అసలీ స్వప్న పురుష ద్వేషిణి. ఆమె మాటలను నమ్మి

డైనా విన్నారా? ఇక, [illegible]త్మాభిమానాన్ని కాపాడుకోవడం ఎల్ల[illegible]కే ప్రాణాలకు ఒడ్డి మా అభిమా[illegible]ంచుకున్నాం. ఇంతసేపూ మేము [illegible]లన్నీ ఈవిడ లిస్టు రాసి వల్లించ[illegible], ఎవరినైతే అల్లరి పెట్టామని [illegible] అందో వాళ్లనే పిలిచి అడగండి- [illegible] మీకే తెలుస్తాయి''

ఆవేశంతో అన్నాడు నారాయణ కమిటీ ముందు-

కమిటీ మెంబర్లూ, ప్రిన్సిపాల్‌గారూ, కొందరు లెక్చరర్లూ, పెద్దలూ వున్న ఆ సమావేశంలో స్వప్న నిశ్శబ్దంగా నిలబడి ఇంతసేపూ నారాయణ ఆడపిల్లల్ని ఎన్ని [illegible]గా వేధిస్తున్నారో రుజువులతో సహా [illegible]ంది.

కానీ, అలా అవమానించబడ్డ ఏ ఆడపిల్లా స్వప్న మాటలను సపోర్ట్ చేయలేదు. కమిటీ ముందు నారాయణ తప్పులేదనే సాక్ష్యం ఇచ్చారు.

దానితో నారాయణ స్వప్న చేసిన నేరానికి ఆ పెద్దలందరి ముందూ తమ గ్రూపుకు క్షమాపణ చెప్పుకోవాలని పట్టుబట్టాడు.

కానీ, స్వప్న నిరాకరించింది.

"తరతరాలుగా బానిస మనస్తత్వానికి అలవాటుపడ్డ మన ఆడవారికి అవమానింపబడటంలోనే ఆనందముంటుందేమో! లేకపోతే ఆరోజు రిపోర్ట్ రాసిన కాగితంపై వీరంతా ఎలా సంతకాలు చేశారు? ఆఖరికి వాళ్ల అల్లరి ప్రిన్సిపాల్‌గారే స్వయంగా చూశారే. ఆ తరువాతనేగదా రిపోర్టు చేశాం'' అంది.

ప్రిన్సిపాల్‌గారు స్త్రీజన పక్షపాతి అనీ, ఆ రోజు అమ్మాయిలు తమ వెనుక నడవడం తాము గమనించనేలేదనీ, గమనించి వుండి నట్లయితే వారితోపాటు ప్రిన్సిపాల్‌గారిని చూసి వుండేవారమనీ వాదించాడు నారాయణ. తమదారిన తాము ఏదో హుషారుకొద్దీ పాటలు పాడుకుంటూ నడుస్తుంటే, తమపై అకారణ ద్వేషాన్ని పెంచుకున్న స్వప్న అదునుచూసి ప్రిన్సిపాల్‌గారికి రిపోర్టు ఇచ్చిందన్నాడు.

"అయినా ఇంత చిన్న విషయానికింత రాద్ధాంతమా... ఇప్పటికైనా జరిగినది మరచిపొండి. సామరస్యంతో మెలగండి'' సలహా ఇచ్చాడు కమిటీ ప్రెసిడెంటు.

తమకు కూడా అనవసరమైన కక్షలు పెంచుకోవడం ఇష్టంలేదనీ, ఇంత రభసకు కారణమైన స్వప్న తమకు క్షమాపణ చెప్పితీరాలనీ, లేకపోతే పరిస్థితి చాలావరకు వెడుతుందనీ బెదిరించాడు నారాయణ.

స్వప్న స్నేహితురాళ్లంతా ఎవరిమట్టుకు వారు ముందుగానే తప్పించుకున్నారు.

చివరికి ప్రిన్సిపాల్‌గారు కలుగచేసుకుని స్వప్నకు నచ్చజెప్పారు.

కాలేజీ పరువు, తన పరువూ కాపాడమనీ, ఇంకా అల్లర్లు జరగడం, విద్యార్థులు రెచ్చిపోవడం మంచిదికాదనీ ప్రిన్సిపాలుగారు నచ్చజెప్పడంతో తన అభిమానం దెబ్బతినగా, సుళ్లు తిరుగుతున్న కన్నీటిని కళ్లలోనే అదిమిపెట్టుకుని పళ్ల బిగువున నారాయణకు క్షమాపణ చెప్పుకుని గిరుక్కున వెనుదిరిగి వెళ్లిపోయింది స్వప్న.

నిట్టూర్చడం తప్ప మరేమీ చేయలేకపోయారు ప్రిన్సిపాల్‌గారు.

సమయానికి తాము కల్పించుకుని పరిస్థితి మరింత విషమించకుండా సర్దుబాటు చేసినందుకు కమిటీ పెద్దలంతా తమనితాము అభినందించుకున్నారు.

ఒక ఆడపిల్ల అభిమానం ఎంతగా గాయపడిందో వారికి తెలియదు, తెలుసుకున్నా చేసేదీలేదు.

అయితే...

ప్రిన్సిపాలుగారు ఆశించినట్లు, ఆ గొడవ అంతటితో సమసిపోలేదు. పదిమంది పెద్దలముందు ఒక ఆడపిల్లతో క్షమాపణ చెప్పించుకున్న తమ ప్రతాపానికి మురిసిపోయిన వారి అల్లరి మరింతగా శృతిమించింది.

కట్టుతాడు తెంచుకున్న పోట్లగిత్తలా తయారయ్యాడు నారాయణ.




స్వప్న మాత్రం మిగిలిన ఆడపిల్లలకు దూరమైంది.




స్వప్న స్వతహాగ ధైర్యస్తురాలు.

పుట్టిన సంవత్సరానికే ఆఫీసునుండి సైకిలు మీద వస్తున్న స్వప్న తండ్రిని లారీ గుద్దేయడంతో అక్కడికక్కడే మరణించాడు. వెనకాముందూ ఎవరులేని స్వప్న తల్లి వర్ధనమ్మ ధైర్యంగా నిలబడింది.

గవర్నమెంటూ, ఇన్సూరెన్సువారూ ఇచ్చిన డబ్బుతో అప్పటికి వున్న అప్పులుతీర్చింది. తనవద్దనున్న బంగారం అమ్మి దానికి మిగిలిన సొమ్ము జతచేసి ఉన్న స్థలంలో తాటాకు ఇల్లు కట్టించి, మిగిలిన పాతికవేల రూపాయలు స్వప్న పేర ఫిక్సిడ్ డిపాజిట్‌లో వేసింది.

జరుగుబాటుకు ఏ ఉద్యోగమైనా చూసుకుందామంటే, తన చదువు ఎలిమెంటరీస్కూలు దాటలేదు. కూర్చుని తింటే కొండలైనా తరిగి పోతాయంటారు. అలాంటిది బ్యాంకులో వున్న పాతిక వేలూ ఏమూలకి?

ఇక, మధ్య తరగతి భేషజాలకి స్వస్తిచెప్పి, తన కష్టసుఖాలు తమ ఆఫీసరుగారికి చెప్పుకుని వారింటిలోనే వంటలక్కగా చేరింది.

ఆయన ట్రాన్స్‌ఫర్, అయివెళ్లిపోతూ స్నేహితుడు, లాయరు రామనాథం ఇంట్లో ఆమెను కుదిర్చి మరీ వెళ్లారు.

అణుకువగా, పొందికగా తన దారిన తాను పనిచేసుకునే వర్ధనమ్మ అంటే ఆ ఇంటిల్లపాదికి అభిమానం. ఆ లాయరుగారి పర్యవేక్షణలోనే స్వప్న చదువు సంధ్యలు సాగుతున్నాయి.

రోజూ ఉదయం, సాయంత్రం ప్లీడరుగారింటికి వెళ్లి వంటచేసి వస్తూ మధ్యాహ్నం ఖాళీసమయాలలో చుట్టుపక్కలవారికి మిషన్‌పై బట్టలు కుట్టిపెడుతూ, వేసవికాలంలో అప్పడాలు, వడియాలు పెట్టి అమ్ముతూ డబ్బు సంపాదిస్తోంది వర్ధనమ్మ. అవిధంగా తమ ఖర్చులు గడచిపోతుంటే, బ్యాంకులో డబ్బు స్వప్న పెళ్లికి ఉపయోగపడుతుందని ఆమె ఆశ. తన భర్త హయాంలోని వైభవం కూతురి హయాంలో అనుభవించాలని ఆమె కోరిక.

చిన్నతనంనుండీ కష్టాలలో పెరిగిన స్వప్న ధైర్యంగా ముందుకు దూసుకు పోగలదు. లేని తండ్రి ప్రేమకోసం అర్రులు చాచకుండా ఆత్మస్థైర్యంతో బాధపడకుండా తనకున్న పరిధిలో కష్టసుఖాలు తెలుసుకుని మెలిగే మనస్తత్వం కన్నతల్లివద్దనుండి పుణికి పుచ్చుకుంది స్వప్న.

చదువు తన భవిష్యత్తుకి ఎంత అవసరమో తెలుసుకున్న స్వప్న ఏనాడు చదువును నిర్లక్ష్యంచేయలేదు.

క్లాసు ఫస్టువచ్చే స్వప్నను సహజంగానే లెక్చరర్స్ అందరూ అభిమానించేవారు. అందరి అభిమానాన్ని చూరగొన్న స్వప్న ఆత్మ విశ్వాసాన్ని అహంకారంగాను భావించింది నారాయణ మిత్ర బృందం. ఆమె ఒక సవాలుగా తోచింది వారికి. మిగిలిన ఆడపిల్లలంతా తమని చూడగానే తప్పుకుపోతుంటే, స్వప్న తల ఎగరేసి నిర్లక్ష్యంగా తన దారిన తాను వెళ్లడంతో నారాయణ పురుషాహంకారం దెబ్బ తింది.

ఎలాగైనా దెబ్బతీసి తన ఆధిక్యతను నిరూపించు కోవాలనుకున్నాడు.

* * *

"అబ్బబ్బ! ఈ స్వప్న ఒక కొరకరాని కొయ్యరా. తన వెనుక మనం ఎన్ని వ్యాఖ్యానాలు చేసినా చెవిటివాని ముందు శంఖం వూదినట్లే" నిరాశగా అన్నాడు నారాయణ– ఆరోజు సాయంత్రం తన మిత్రులతో మెస్‌లో కొలువు తీరివుండగా.

"ఛ ఛ! ఒక ఆడపిల్లముందు ఓడిపోవడానికి సిగ్గు లేదురా నీకు" వ్యాఖ్యానించాడు ఒక స్నేహితుడు.

"ఓడిపోవడమేమిటోయ్! మన జాత

కంలోనే లేదది" పౌరుషంగా అన్నాడు నారాయణ.

"అసలు మీకు కామన్‌సెన్సు లేదురా" అంతవరకు వాళ్ల మాటలు వింటూ నిశ్శబ్దంగా కూర్చున్న రాజారాం కలగజేసుకున్నాడు. ఆ మెస్ విద్యార్థులలో చెప్పుకోదగ్గ బుద్ధిమంతుడు అతడొక్కడే. తన చదువేమో, తానేమో తప్ప మిగిలిన విషయాల జోలికి వెళ్లడు.

"ఏమిటోయ్... పెద్ద మాకు తెలియనిది, నీకు తెలిసింది, ఆ దేవరహస్యం?" ఉక్రోషంగా అడిగాడు నారాయణ.

"అల్లరి చిల్లరిగా తిరిగేవాడిని, ఆత్మాభిమానంగల ఆడపిల్ల లక్ష్యపెట్టదు. అయినా మన మంచితనంతోనూ, అభిమానంతోనూ ఆడపిల్లల మనసును గెలుచుకోవాలి కానీ, వాళ్ల అభిమానాన్ని దెబ్బతీస్తే కలిసివచ్చేదేమీ వుండదు"

"ఓహో... మనవాడు కూడా హీరోనే. ఇన్నాళ్లు చాపకింద నీరులావుంటే, ఏమిటో అనుకున్నాం. ఫరవాలేదే" స్టూడెంట్సంతా గొల్లుమని నవ్వారు.

కాని, నారాయణపై ఆ మాటలు బాగా పనిచేశాయి. ఎలాగైనా స్వప్నను సాధించాలి. ఆమెను లోబరచుకోవాలి— ఎలా? ఎలా?

★ ★ ★

నారాయణ హఠాత్తుగా బుద్ధిమంతుడైపోవడం కాలేజిలో అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆడపిల్లలను అల్లరిపెట్టకపోవడం, క్లాసులకు రెగ్యులర్‌గా హాజరుకావడం, నారాయణ మారినందుకు లెక్చరర్స్ అందరూ చాలా సంతోషించారు— ఒక తెలివైన విద్యార్థి ఇన్నాళ్లకైనా దారిలో పడ్డాడని.

"అదేమిటోయ్! అంత రౌడీలా వుండే నారాయణ ఎంతలో ఎంత బుద్ధిమంతుడైపోయాడో" వింతగా అంది విరజ, ఓరోజు కాలేజీ లేడీస్ వెయిటింగ్ రూంలో. మధ్యాహ్నం విరామసమయంలో కాలేజికి దూరంగా ఇళ్లువున్న ఆడపిల్లలు వెయిటింగ్ రూంలోనే వుండిపోతారు. వారితోపాటు స్వప్న కూడా కూర్చుని— తనదారిన తాను ఒక మూల కూర్చుని పుస్తకం చదువుతుంటుంది. అమ్మాయిలు కాఫీ, టిఫిన్లు తీసుకుంటూ తీరికగా సినిమాల గురించి, నవలల గురించి మాట్లాడుకుంటూ ఆ గంటా కాలక్షేపం చేస్తారు. అలా మాట్లాడటం బోరుకొడితే, ఆ సంభాషణను లెక్చరర్ల మీదకు, అబ్బాయిలమీదకు మళ్లిస్తారు.

ఆరోజు మధ్యాహ్నం వారి సంభాషణ నారాయణ మీదకు మళ్లింది. అప్పటికి ఒక అరగంట నుండి అతని స్తోత్రం సాగిస్తున్నారు.

"మనిషి ఎప్పుడూ మంచివాడే. ఏదో కుర్రతనం— అంతే!" సమర్థించింది విద్య.

"అవును మరి... అందులోనూ బాగా డబ్బువున్నవాళ్లకి ఒక్కగానొక్క కొడుకట. ఆపాటి చిలిపితనం లేకుండా ఎలావుంటుంది?" వంతపాడింది వసజ.

"ఏమిటో? అందరూ మెచ్చుకుంటున్నా స్వప్న మాత్రం ఏమీ కామెంట్ చేయడంలేదు. అతడంత బుద్ధిమంతుడైపోవడం నిరుత్సాహం కల్గించి వుంటుంది" వ్యంగ్యంగా అంది అరుణ.

"అవును మరి. ఇన్నాళ్లు తన అందం చూసి వెంటబడుతున్నారని గర్వపడుతూ వుండేది లోలోపల" స్వప్నపై అసూయగల అనసూయ తన మనసులోని కుళ్లుని బైటపెట్టుకుంది.

"షటప్"

చదువుతున్న పుస్తకంలోంచి తలెత్తి తీవ్రంగా అంది స్వప్న—

"మీలా అడ్డమైన మొగవాడిని పొగుడుతూ కూర్చునే అవసరం నాకులేదు"

"అదిగో... ఆ తొందరపాటే వద్దనేది? ఎందుకంత పొగరు నీకు? మగపిల్లలని ఇష్టంవచ్చినట్లు కామెంటు చేస్తే వాళ్లు సహిస్తారా? ఆ నారాయణమీద రిపోర్ట్ ఇచ్చి, లేనిపోని బెడద నెత్తిమీదకు తెచ్చుకున్నావా? ఇంకా నీకు జ్ఞానం రాలేదు" మందలించింది సీత.

మండిపడింది స్వప్న "సిగ్గులేదూ మీకు? నిన్న మొన్నటిదాకా ఆ నారాయణ ఇలా అన్నాడనీ, అలా చేశాడనీ చెప్పుకుని ఈ కామన్ రూంలోనే ముఖం వాచేటట్లు ఏడ్చేరు— జ్ఞాపకం లేదూ? ఇప్పుడతగాడిని ఇంద్రుడని, చంద్రుడనీ పొగుడుతున్నారు. అయినా కాలే

జీకి వచ్చింది చదువుకోవడానికా లేక మగ పిల్లల గుణగ ణాలను వల్లించడానికా?''

"అబ్బే... మగపిల్లల మీద రిపోర్ట్ ఇవ్వడానికీ, వాళ్లని సస్పెండ్ చేయించడానికీనూ'' వ్యంగ్యంగా అంది సావిత్రి.

"నోర్ముయ్... ఆరోజు ప్రిన్సిపాలుగారు రిపోర్ట్‌రాసి ఇమ్మనగానే ముందుగా రాసింది నువ్వుకదూ! అప్పుడు అందరం కలిసేగా రిపోర్ట్ ఇచ్చింది. తరువాత ఊసరవెల్లిలా రంగులు మార్చింది మీరు కదూ! అయినా మీలాంటివాళ్లని నమ్ముకుని ఇటువంటి విషయాలలో జోక్యం కల్గించుకోవడం నాదే బుద్ధితక్కువ. ఇకనైనా దయచేసి నాజోలికి రాకండి'' విసురుగా లేచి పుస్తకాలు తీసుకొని తన క్లాసు రూమువైపు నడిచింది. అమ్మాయిలెవరూ నోరెత్తలేదు.

★ ★ ★

స్వప్న కాలేజీ నుండి ఇంటికి వస్తూనే గుమ్మంలో పడివున్న కవరును చేతిలోకి తీసుకుంది. తనకుగానీ, తన తల్లికిగానీ ఉత్తరాలు రాసేవారెవరున్నారు? కవరు మీద తన పేరును చూసి భృకుటి ముడిచింది. ఆలోచిస్తూనే కవరుచింపి కాగితం బైటకు తీసింది. ఆ జాబు చదువుతుంటే ఆమె కళ్లలోనుండి నిప్పురవ్వలు రాలాయి.

ఎంత ధైర్యం? తనకు ప్రేమలేఖ రాస్తాడా ఆ నారాయణ?

ఆడదంటే అంత లోకువా? ఇన్నాళ్లూ మేకతోలు కప్పుకున్న పులిలా వున్నాడన్నమాట. అయినా పుట్టుకతో పుట్టినబుద్ధి....?

అలాంటివాడు మారతాడని తాననుకోవడమేమిటి?

ఇపుడు తానేం చేయాలి? ఈ లెటర్ ప్రిన్సిపాల్‌కి చూపించి అతని మీద కంప్లైంటు చేయాలా?

చేస్తే ప్రయోజనం?

ఇదివరకు ఆయన కళ్ళెదుట జరిగిన విషయంలోనే ఆయన చెప్పినట్లే కంప్లైంటు ఇచ్చి ఉపయోగం లేక పోయిందీ! ఆయన మాత్రం ఏం చేయగలరు?

అయినా ఈ విషయాన్ని పిచ్చివాడి చేతిరాతలా తోసివేయక, దీనికొక విలువఇచ్చి ఇంతగా తర్జనబర్జన చేయాలా?

ఆ ఉత్తరం చివర అగ్గిపుల్ల వెలిగించింది స్వప్న.

ఆ కాగితం భగభగమండిపోయింది. ఆమె అంతరంగంలాగే.

కానీ ఉత్తరాల ప్రహసనం అంతటితో ఆగలేదు. వారానికీ, పదిరోజులకీ ఒకో ఉత్తరం వస్తూనే ఉంది. పోస్టు వచ్చే సమయం వర్దనమ్మ ప్లీడరుగారింటికి వెళ్ళేటైము. పైగా తల్లి కంటే ముందుగానే స్వప్న కాలేజీనుండి ఇంటికి తిరిగి వస్తుంటుంది. దాంతో ఆ ఉత్తరాల విషయం మూడో కంటికి తెలియలేదు.

మొదటి ఉత్తరానికి అగ్గిపుల్లగీసి వెలిగించిన స్వప్న రానురాను ఆ ఉత్తరాలను పెట్టె అడుగునపడేసి, వీలయినంతవరకు వాటి విషయం తన మనసుకు పట్టకుండా ఉండటానికి ప్రయత్నించేది.

ఉత్తరాలు పోస్టు చేస్తున్న నారాయణకు ఆ ఉత్తరాలను స్వప్న అందుకుంటుందో లేదో అర్థంకావడంలేదు.

వాటికి జవాబైనా రాస్తుందనీ, లేదా కోపంలో మండిపడి ప్రిన్సిపాలుగారికి రిపోర్టు ఇస్తుందనీ అప్పుడు ఆమెను మరింత అల్లరి పెట్టవచ్చని ఆశించిన నారాయణకు ఆశాభంగమే కలిగింది.

ఇక, ఇది పనికాదనుకున్నాడు.

పదిమందిలోనూ స్వప్నను అవమానించడమే ధ్యేయంగా పెట్టుకున్నాడు.

కాలేజి ఎడ్రసుకే రిజిస్టరు పోస్టులో పంపితే అందరిలోనూ ఏమని చెప్పుకుంటుందోననే కుతూహలం కలిగింది నారాయణకు.

స్వప్నకు రిజిస్టర్ పోస్టులో లెటర్ వచ్చిందనగానే కామన్ రూంలో అమ్మాయిలలో కలకలం బయలుదేరింది. స్వప్న మౌనంగా సంతకంచేసి కవరు అందుకుని తల ఎత్తి చూసేసరికి ఎదుటనున్న క్లాసు రూము గుమ్మంలో నిలబడి స్వప్ననే తదేకంగా చూస్తున్నాడు నారాయణ.

"ఏమిటి... కలల రాకుమారుడు మేఘసందేశం పంపించాడా?'' వ్యంగ్యంగా అంది

వనజ.

"సందేశమే? మన స్వప్నకే... అంత గుండె ధైర్యం ఉన్న మొనగాడెవడు?" నవ్వింది విద్య.

"కనపడటంలా! రిజిస్టరు సందేశం" అందింకో అమ్మాయి.

"అదేమిటి... ఉత్తరం చదవనేనాచదవ కుండానే పుస్తకంలో పెట్టేస్తున్నావేమిటి" వింతగా అడిగింది సీత.

"ప్రియుడు రాసిన ఉత్తరాన్నైతే చదువుకో వాలనే తహతహ ఉంటుంది. కానీ, పరాయి వారి ఉత్తరాలు చదవడంలో ఉత్సాహం ఏముంటుంది?" నవ్వింది స్వప్న.

చుట్టుపక్కల వారి మొహాలు నల్లబడ్డాయి.

"పరాయివారా... అయితే పరాయివారి వద్ద నుండి కూడా ఉత్తరాలు అందుకుంటూ ఉంటావన్నమాట" దెబ్బతీశాననుకుంది విద్య.

"ఉత్తరం రాసిన ప్రతివాడూ భర్తో, ప్రియుడో అయివుండాలన్న విషయం నాకు తెలియదు" అమాయకంగా మొహంపెట్టి అంది స్వప్న. ఆ మాటలకు కలం స్నేహం పేరుతో ఎవరెవరితోనో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపే నలుగురైదుగురు అడపిల్లల మొహాలు మాడిపోయాయి.

వారి ఉత్తరాలన్నీ కాలేజి ఎడ్రసుకే వస్తాయి మరి!

"నేనిదివరలో చాలాసార్లు చెప్పాను- మళ్ళా ఒకసారి చెబుతున్నాను, ఎదుటివారి వ్యక్తిగత విషయాలలో అవసరానికిమించి కల్పించుకోవడం సభ్యతకాదు. ఎప్పుడూ నా జోలికి రాకండి" విసురుగా బైటకునడిచింది స్వప్న.

ఏదో పని ఉన్నట్లు అటుగా వచ్చిన నారాయణకు వారి మాటలు విన్న తరువాత నిరుత్సాహమే మిగిలింది.

ఆరోజు నారాయణ అహం బాగా దెబ్బ తింది. స్వప్న తిట్టి, గోలచేసి, తన జోలికి రావద్దని ప్రాధేయపడితే అతనిలోని 'ఈగో సంతృప్తి పడేదేమో? కాని ఆమె నిర్లక్ష్యంగా ప్రవర్తించడంతో అతని ఆవేశం బుసలుకొట్టింది. సమయం కోసం చూస్తూ అవకాశం వస్తే ఆవిడ అంతు చూడాలనుకున్నాడు.

★ ★ ★

సంక్రాంత్రి సెలవులకు ఇల్లు చేరాడు నారాయణ.

"ఈ ఏడు మనవాడికి పెళ్ళి చేసేయాలండీ. వాడితోటి వాళ్ళంతా అప్పుడే పిల్లల తండ్రులైపోతున్నారు కూడానూ" ఆ రాత్రి తండ్రి కొడుకులకిద్దరికి భోజనాలు వడ్డించి సంభాషణ ప్రారంభించింది తల్లి పార్వతమ్మ.

"నీమొహం... ఇంకా వాడిచదువే పూర్తికాలేదు. అప్పుడే పెళ్ళేమిటి?" తేలిగ్గా అన్నాడు తండ్రి రంగారావు.

"ఆ... వాడితోటి వాళ్ళకందరికి అవడంలేదేమిటి... అయినా చదువుకీ, పెళ్ళికి సంబంధమేమిటి? పెళ్లయినా వాడేం భార్యను కాపరానికి తీసుకువెళ్ళనవసరం లేదుగా! ఇంట్లో ఒక్కదాన్ని ఉండలేక ఛస్తున్నాను. కోడలైనావస్తే, ఇంట్లో ఒకరి కొకరం తోడుగా ఉండవచ్చుని నాఆశ"

నవ్వాడు రంగారావు. "అయితే వాడికి భార్యకాదు. నీకు కోడలు రావాలంటావ్? ఈ మోజు ఇప్పుడు కాదు, కోడలు వచ్చాక కూడా నిలబడాలి"

"అనవసరంగా మాట మార్చకండి. ఎలాగా వచ్చే ఏటితో వీడి చదువు పూర్తిఅవుతుంది. ఈ వేసవిలో ఆ శుభకార్యం కాస్తాకానిచ్చేస్తే...?"

"పెళ్ళికూతుర్ని కూడా చూసేశావేమిటి... ముందు సంబంధాలు రానియ్, తొందరేముంది?" తేలిగ్గా తీసేశాడు రంగారావు.

వింటున్న నారాయణలో ఏవేవో ఆలోచనలు త్వరత్వరగా రూపుదిద్దు కుంటున్నాయి. అప్పటికప్పుడే అతని మనసులో ప్లాను తయారైపోయింది.

"అమ్మా" ఆరోజు మధ్యాహ్నం తీరికగా వంటింటి వసారాలో కూర్చునిఉన్న తల్లిదగ్గరకు చేరాడు నారాయణ.

"నీ సామానంతా సర్దిపెట్టాను చూసుకున్నావా... జాగ్రత్తగా చదువుకో! డబ్బు దుబారా చేస్తున్నావని నాన్న విసుక్కుంటున్నారు. అలాగని డబ్బుకి ఇబ్బందిపడకు. కుర్రవాళ్ళ ఖర్చులు ఆయనకెలా తెలుస్తాయి. నా దగ్గర అయిదు వందలున్నాయి. అవి తీసుకువెళ్ళు. అవ




[illegible] ఈ విషయం మీ నాన్నకి తెలిస్తే నిన్ను నేనే పాడుచేస్తున్నానని మండిపడతారు'' నీతిబోధలు ప్రారంభించింది తల్లి.

''బాగానే చదువుతున్నానమ్మా... అసలు మా కాలేజిలో నేనంటే ఎంత గౌరవమోతెలుసా! నా పేరు తెలియని లెక్చరర్‌కానీ, విద్యార్థికాని లేడనుకో! కావాలంటే ఒక్కసారి నువ్వు మా కాలేజికివచ్చి నారాయణ కావాలి- అని అడుగు. ఎవరినడిగినా సరే నిన్ను నా దగ్గరకి తీసుకువస్తారు. మా స్టూడెంట్స్‌కి నేనెంత చెబితే అంత. మేం చెప్పిన మాటకు మా ప్రిన్సిపాలే ఎదురుచెప్పలేరు. అసలింతవరకూ నేనెప్పుడైనా ఫెయిలయ్యానా'' వరుసగా వల్లించేశాడు నారాయణ.

ఉబ్బిపోయింది ఆ తల్లి.

''ఆ దేముడి దయవల్ల ఈ ఏటితో నీ చదువు అయిపోయి ఒకింటివాడివికావడం, నీ భార్యాబిడ్డలతో ఇల్లు కలకలలాడటం కంటే నాకింకేంకావాలి? తొందరగా పెళ్ళిచేసుకుని కోడలిని ఇంటికి తీసుకురారా! ఒక్కదాన్నే ఉండలేకపోతున్నాను. అందులోనూ అక్కయ్య అత్తవారింటికి వెళ్ళిపోయాక బొత్తిగా ఒంటరి దాన్నయిపోయాను. మీ నాన్నగారా! ఇల్లంటే భోజనానికీ, పడకకీ మాత్రమే అనుకుంటారాయన. ఒక మాటా! మన్నా?'' కష్టసుఖాలు చెప్పుకుంది పార్వతమ్మ.

''ఇంతకీ నీకెలాంటి కోడలుకావాలమ్మా?'' నవ్వులాటకు అంటున్నట్లే అడిగాడు నారాయణ.

''ఇంట్లో మహాలక్ష్మిలా కోడలు తిరుగుతుంటే చాలు నాయనా! ఇంతకీ నీకెలాంటి భార్యకావాలో చెప్పలేదు'' ఆరాగా అడిగింది.

''ఆహా... అలాకాదు ముందునేనడిగాను కాబట్టి చెప్పు. అమ్మాయి అప్సరసలా ఉండాలా- లేక కట్నం దండిగా తెచ్చే కోడలే కావాలా? నీకు పాదపూజచేసే కోడలు కావాలా? పోనీ నేను మెచ్చిన పిల్లను కట్నంలేకున్నా నువ్వు కోడలుగా అంగీకరించగలవా?''

''అయితే, నీదృష్టిలో ఎవరో ఉన్నారన్న మాట. ఎవరో గానీ, అది కాస్త నాచెవిని వెయ్యి నాయనా! మనలో కలసిపోయి, సంప్రదాయమైన కుటుంబంలోపిల్ల అయితే నాకంతేచాలు. ఇంతకీ ఎవర్రా ఆ అమ్మాయి? కుతూహలంగా అడిగింది పార్వతమ్మ.

''నాతోటే చదువుకుంటోందమ్మా, స్వప్న అని మన వాళ్ల అమ్మాయే. తండ్రిలేడు. కట్నకానుకలు ఇచ్చుకోలేరు. తల్లికి ఒకే ఒక్కకూతురు. నువ్వు చూస్తే వదిలిపెట్టవనుకో''

వంటలక్క కూతురికి బ్యాంకు బాలెన్స్ ఉండదనే నారాయణ నమ్మకం, పిల్లతల్లి వంటపనిచేసుకుని బతుకుతోందంటే తన తల్లి ఈ సంబంధానికి ఛస్తే ఒప్పుకోదు. ఒక్క కూతురే అంటే ఏదో ఆస్తి కలవకపోతుందా అనే ఆశతో తల్లి ఈ సంబంధానికి ఒప్పుకోవచ్చు. అందుకే ఆ విషయం గోప్యంగా ఉంచి పెళ్ళి అయిన తరువాత ఆ వంటలక్క కూతురనే విషయం తనకూ తెలియదనీ, ఆ విషయం దాచి తనను మోసం చేసిందనీ, ఒక్కమాట తల్లితో చెబితేచాలు తన తల్లి ఎంత మంచిదైనా, స్వప్నను ఆరళ్ళుపెట్టకమానదు. అలా స్వప్నను ముప్పతిప్పలు పెట్టి తన కసి తీర్చుకోవాలి. ఆ తరువాత అసలే వదిలేస్తే ఆవిడ గర్వం ఏమౌతుందో చూడాలి.

కసిగా నవ్వుకున్నాడు నారాయణ.

''కట్నకానుకలెవరికి కావాలిరా నారాయణా! సాంప్రదాయమైన కుటుంబమైతే అంతేచాలు. నీకు నచ్చితే మాదేముంది! వాళ్లవాళ్లను నాన్నగారి దగ్గరకు వచ్చి మాట్లాడమను. ఈలోగా నేను కూడా చెబుతాను. ఈ వేసవిలోనే ఆ శుభకార్యం కూడ కానిచ్చేయవచ్చు'' అంది తల్లి.

గతుక్కుమన్నాడు నారాయణ. వాళ్ళవాళ్ళు వచ్చి నాన్నను అడగడమా! అది అసంభవం.

ఆ కొరకరానికొయ్య స్వప్న అంత తేలికగా దారికి వస్తుందా?

అంతకంటే స్వప్న తల్లినే కదిపితే ఆవిడ సంతోషంగా అంగీకరిస్తుంది. ఆవిడ నచ్చజెబితే స్వప్న కాదనలేదు. పెళ్ళి నిశ్చయమయ్యేవరకు ఈ విషయం స్వప్న వరకు వెళ్ళకపోవడమే మంచిది. అయినా ఒక వంటలక్క కూతురిని తనలాంటివాడు చేసుకుంటాననడమే అదృష్టం. అందుకే ఆమె తల్లి అయితే





మంచిది. తమ అదృష్టానికి మురిసిపోయి కూతురినేదో ఒకవిధంగా ఒప్పిస్తుంది.

"ఆ అమ్మాయికి తండ్రి లేదు కదమ్మా! అందుకని మనమే అడగాలి. నాన్న వెళ్ళి అడిగితే...."

"అదేంమాటరా అబ్బాయ్! మగపెళ్ళివారం మనం వెళ్ళి అడగడమేమిటి? అయినా వెనకా ముందూ ఎవరూ లేని ఆ సంబంధం మనకెందుకురా? కనీసం పెళ్ళిమాటలు

మాట్లాడటానికి కూడా వెనక మొగదిక్కు లేదంటే- అవ్వ... అప్రదిష్టకూడాను'' నోరు నొక్కుకుంది పార్వతమ్మ.

''ఆ అమ్మాయి చాలా మంచిదమ్మా''

ప్రాధేయపడుతున్నట్లుగా అన్నాడు నారాయణ.

''నాన్న నువ్వు చెబుతే కాదనరు. మనకు అమ్మాయి ప్రధానంగాని, వెనుక నున్న మందీ మార్బలం కాదుగా? అయినా వెనక తల్లి తప్పు ఎవరూ లేని ఆ పిల్లను చేసుకుంటే మిమ్మల్నే తల్లీ తండ్రిలా పూజించుకుంటుంది. మీ అడుగుజాడలలో నడుస్తుంది. వెనుక పదిమంది



వున్న కుటుంబంలోంచి వచ్చిన పిల్ల అయితే అస్తమానం పుట్టింటికి పరుగుపెడుతూ వుంటుంది. ఆ పుట్టింటివారు 'మీ అత్తగారిలా, మీ ఆయనిలా...' అని ఆ అమ్మాయికి ఎగదోస్తే ఇక మన కుటుంబం సంగతి ఆలోచించు. ఏమైనా నీయిష్టం! నన్ను ఒకింటివాడిని కమ్మంటావో లేక జీవితాంతం బ్రహ్మచారిగా బతకమంటావో నువ్వే నిర్ణయించుకో. ఆ అమ్మాయిని తప్ప వేరొక పిల్లను నా భార్యగా ఊహించుకోలేను కూడా''

అలిగినట్లుగా మొహంపెట్టాడు నారాయణ.

''అంతతొందర పనికిరాదురా నాయనా! మగపెళ్ళివారం అంత ఆదుర్దా వెల్లడి చేస్తే ఆడపెళ్ళివారికి లోకువకామూ! నీకంతగా నచ్చిన పిల్లను చేసుకుంటానంటే కాదంటమా? ఇలాంటి విషయాలలో కాస్త లౌక్యంగా మాట్లాడాలి. నీకెందుకు? మీ నాన్నగారిని ఒప్పించి, నచ్చచెప్పి, మంచిరోజు చూసి పంపిస్తానుగా'' అంది తల్లి చివరికి.

''పిచ్చి అమ్మ'' మనసులోనే నవ్వుకున్నాడు నారాయణ.

మూడుముళ్ళువేసి ముప్పతిప్పలూ పెట్టాలి స్వప్నని- అని ప్రతిజ్ఞకూడా చేసుకున్నాడు మనసులోనే.

★ ★ ★

భార్య పోరుపడలేక, ఒక్కగానొక్క కొడుకు కోరికను కాదనలేక, తనకు సన్నిహితుడైన దశరథరామయ్యను వెంటబెట్టుకుని పట్నం వచ్చాడు రంగారావు.

లాస్ట్ పిరియడ్ ఎగ్గొట్టి తండ్రికి స్వప్న వుండే యిల్లు దూరంనుండి చూపించి తన దారిన తాను వెళ్ళిపోయాడు నారాయణ.

అంత సన్నిహితంగా మెలిగేవాడయినా పెళ్ళిమాటలు అనేసరికి స్వప్న ఇంటికి రావడానికి మొహమాటపడుతున్నాడనుకుని మనసులోనే నవ్వుకున్నారు పెద్దవాళ్ళిద్దరూ.

ఆ తాటాకుల ఇల్లు చూడగానే మొహం చిట్లించుకున్నాడు రంగారావు. అయినా అంతవరకూ వచ్చాక ముఖ్యంగా తల్లీకొడుకులు ఆ పిల్లే కావాలని పట్టు బడుతుంటే ఇక వెనుకంజ వేసే ప్రసక్తిలేదు.

అయినా కోడలు తెచ్చే కట్నకానుకలపై తాను ఏనాడు ఆశలు పెట్టుకోలేదు. తీరా అలికి ముగ్గులు పెట్టి పరిశుభ్రంగా, ప్రశాంతంగా వున్న ఆ ఇంటిని చూస్తూనే అంతవరకు రంగారావు మనసులో కలిగిన భావం మటుమాయమైంది. వీధి గుమ్మం దాటుతూనే విశాలమైన గది. దానిని అనుకునివున్నది బహుశా పడకగది కావచ్చు. వెనుక వైపు చూరుదింపిన వరండా గదిలోనుండే కనిపిస్తోంది.

హాలులో ఒక మూలనున్న కుట్టుమిషను ముందు కూర్చుని బట్టలు కుట్టుకుంటున్న వర్ధనమ్మ గుమ్మంలో నిలబడివున్న ఆగంతకులను చూసి తత్తరపడింది.

''వర్ధనమ్మగారిల్లు ఇదేనామ్మా?'' అడిగాడు దశరథరామయ్య.

''అవును బాబుగారూ! ఆ వర్ధనమ్మను నేనే'' నమ్రతగా అంది.

మొదటిచూపులోనే వర్ధనమ్మ మీద గౌరవభావం కలిగింది వారిద్దరికీ.

''మీతో పనివుండి వచ్చానమ్మా''

''నాతోనా...?'' అనుమానంగా అడిగింది వర్ధనమ్మ. తన సహాయం అవసరమైన ఇరుగు పొరుగువారెవరైనా వస్తే ఆడవారే వస్తారు తప్ప మగవారు వచ్చిమాట్లాడ్డం ఇంతవరకూ ఎప్పుడూలేదు.పోనీ, వారింట ఏ శుభకార్యానికైనా వంటకు పిలిచారేమోననుకుంటే, లాయరుగారింటికి తప్ప ఏనాడూ ఇతరుల ఇంటికి వెళ్ళలేదు. అయినా వారింటనే కాదు, ఈ చుట్టుపక్కల ఎవరూ తనను వంటలక్కగా చూడరు. మరి వీరికి తనతో వచ్చిన అవసరమేమిటో?

''కూర్చోండి బాబుగారు''

ఆమె చూపించిన కుర్చీలో కూర్చుని గది అంతా పరీక్షగా చూస్తున్నాడు రంగారావు.

ఒకమూల నాలుగు గాడ్రేజ్ ఫోల్డింగ్ ఛైర్లు, మధ్యన టీపాయ్ వుంది. మరొక మూల టేబులూ, కుర్చీ, గోడనానుకుని పుస్తకాల రాక్ వుంది.మరొక మూల మిషను. పక్కన వున్న ట్రంకుపెట్టెలో రంగురంగుల గుడ్డపీలికలు తొంగి చూస్తున్నాయి. మరొక మూల పాతకర్ర




బయట గోడకు ఆనించి వుంది. మధ్యన ఏ సా మాను లేకపోవడంతో స్థలం తక్కువైనా పొంది కగా, పరిశుభ్రంగా వుంది.

ఇల్లు చూసి ఇల్లాలిని చూడమన్నారు! అలాగే కూతురు గుణగుణాలు తల్లిని చూసి చెప్పవచ్చునన్నారు! దానినిబట్టి తానింతవ రకూ చూడని స్వప్నపై అప్పుడే మనసులో తెలియని అభిమానం మొలకెత్తింది రంగారా వుకి.

"మీరు కూడా కూర్చోండమ్మా" అన్నాడు దశరథరామయ్య.

"ఫరవాలేదు బాబుగారూ! చెప్పండి... నేను మీకేం చేయగలను?" వినయంగా అడిగింది వర్ధనమ్మ.

"ఏమీ లేదమ్మా! ఇతను నా స్నేహితుడు రంగారావు. మా వూరిలో పెద్ద మోతుబరి రైతు. మీవాళ్లే. ఈయనకు ఒక్కడే కొడుకు, మీ అమ్మాయితో కలసి చదువుకుంటున్నాడు. ఒక రినొకరు ప్రేమించుకున్నారట. ఆ పిల్లను తప్ప ఇంకెవరినీ పెళ్లాడనని భీష్మించుకుని కూర్చున్నాడతగాడు. పోనీ అయినింటి పిల్ల. వాళ్లిద్దరిని వేరుచేయటమెందుకని నేనే నచ్చ జెప్పి మావాడిని తీసుకుని వచ్చాను. మొగ పిల్లవాడి తండ్రి వచ్చి అడగడం సాంప్ర దాయం కాకపోయినా, మీకు వెనుకా ముందూ ఎవరూ లేరని తెలిసి మేమే వచ్చాం. మీకైనా ఈ సంబంధంలో వంకలు పెట్టడానికేమీ లేదు. నాలుగు తరాలు తిని కూర్చున్నా తర గని ఆస్తి. ఒక్కగానొక్క ఆడబడుచు సుఖంగా అత్తింట కాపురం చేసుకుంటోంది. మావాళ్ల గొప్ప మేం చెప్పుకోకూడదు. కానీ, అత్తగారు దేవతలాంటి ఇల్లాలు. లంకంత ఆ ఇంట్లో ఒంటరిగా వుండలేక కోడలి కోసం ఎదురు చూస్తోంది ఆమె. లేకపోతే మావాడికి వయసే మీ మీరిపోలేదు. ప్రేమించుకున్న ఆ చిన్న వాళ్లిద్దరినీ విడదీయకూడదని పట్టుబట్టింది ఆమె"

అంటూ వారి ఆస్తి వివరాలు కూడా చె ప్పుకు వచ్చాడు దశరథరామయ్య.

వింటున్న వర్ధనమ్మకు ఇదంతా కలో నిజమో అర్థం కావడం లేదు.

ఇంతటి ఆస్తిపరులు, తన కూతురిని కోరి కోడలుగా చేసుకుంటున్నారంటే ఆమెకు నమ్మ శక్యంగా లేదు. అయినా ఇద్దరూ ప్రేమించు కుంటున్నారటగా. ఎన్నాళ్లుగా సాగుతోందో ఆ ప్రేమాయణం. తనకొక్కనాడూ అనుమానం రాలేదే! వారిద్దరూ ఒకరినొకరు అంతగా కావా లనుకుంటే, తనెందుకు అడ్డు చెబుతుంది. ఇన్నాళ్లకు తమకూ మంచి రోజులు వచ్చాయ న్నమాట.

"ఏమిటమ్మా.... మీరంతగా ఆలోచనల్లో పడిపోయారు?" దశరథరామయ్య మాటలతో తన ఆలోచనల్లో నుండి బైటపడింది వర్ధనమ్మ.

"నాకూతురింతటి అదృష్టవంతురాలంటే, సంతోషంతో నాకు మాట రావటం లేదు బాబు గారూ! గొప్ప మనస్సు చేసుకొని నా కూతుర్ని మీఇంటి కోడలుగా తీసుకు వెడతానంటున్నా రు. అంతకంటే నాకు కావలసినదేముంది? అయినా మాకు పెద్ద దిక్కు ప్లీడరు రామనా థంగారు. ఆయన చెవిన కూడా ఒక్కమాట వేస్తే బాగుంటుంది"

దాచుకున్నా దాగని ఆనందం వర్ధనమ్మ మొహంలో కనిపిస్తోంది.

ప్లీడరు రామనాథంగారి బంధువులా వీళ్లు!

ఇదో కొత్త వార్త.

ఆతాలూకా మొత్తానికి రామనాథంగారి పే రు వినని వారు లేరే! ప్లీడరుగానే కాకుండా మంచితనానికీ, కుటుంబసాంప్రదాయానికీ ఆయనను చెప్పుకుంటూ ఉంటారు. నిజంగా రామనాథంగారి బంధుజనంలోని అమ్మాయే అయితే, అంతకంటే కావలసిందేమిటి? డబ్బుదేముంది? పాపం చిన్నతనంలోనే భర్త ను కోల్పోయిన మూలంగా ఆర్థిక ఇబ్బందు లకు గురి అయింది. మంచి సాంప్రదాయ మైన కుటుంబం- తనకంతేచాలు.

అంతవరకూ రంగారావు మనసులో ఏమూ లనో కొద్దిగా మిగిలిన సంకోచం కూడా ఈ మాటతో తుడిచిపెట్టుకుపోయింది.

"ఒక్క నిముషం బాబుగారూ! వచ్చినవా రిని వచ్చినట్లే కూర్చోబెట్టేశాను. ఇప్పుడే వస్తా ను వుండండి" అంటూనే లోపలకు నడిచింది, వర్ధనమ్మ.

అప్పుడే కాలేజినుండి వచ్చిన స్వప్నకు

గదిలో కూర్చున్న పెద్ద మనుమలు ఎవరో సరిగా అర్థం కాలేదు. తలవంచుకుని పుస్తకాలు టేబుల్‌మీద పెట్టి, కాళ్ళూ, చేతులూ కడుక్కోడానికి లోపలకు నడిచింది.

"స్వప్నా... ఈ కాఫీలు వారికిచ్చిరా తల్లీ!"

బొట్టు పెట్టుకుంటున్న స్వప్న వచ్చి తల్లి చేతిలోని ట్రే అందుకుంది.

స్వప్నను చూస్తూనే సంతృప్తి పడ్డారు రంగారావు. తన కొడుకు దుడుకుతనానికి, ఈ అమ్మాయి నెమ్మదికి బాగానే సరిపోతుందనిపించింది.

"మంచిరోజు చూసి, అవుననుకుంటే వేసంగిలో ముహూర్తాలు పెట్టుకోవచ్చు. పెళ్లి ఖర్చులకు మీరేమీ కంగారు పడకండమ్మా! లక్ష్మి లాంటి పిల్ల.. తనే విలువైన కట్నం" అన్నాడు దశరథరామయ్య సంతృప్తిగా.

"ఇల్లుచూసి మా పరిస్థితి తక్కువగా అంచనా వేయకండి బాబూ! పెళ్లి ఖర్చులు కూడా పెట్టుకోలేనంత హీన స్థితిలో లేము. వెనక మగదిక్కులేని వాళ్లం కనుక, అమ్మాయి పెరిగి పెళ్లీడుకొచ్చేసరికి ఏమీ మిగలదేమోననే భయంతో ఆయన పోయిన వెంటనే మిగిలిన పాతిక వేలూ ఫిక్సిడ్ డిపాజిట్‌లో వేశాం- పద్దెనిమిదేళ్ల క్రితం. అమ్మాయి పెళ్లికేతప్ప ఇతరత్రా అవసరాలకు వాడకూడదని, ఎంత అవసరం వచ్చినా ఆ డబ్బుని ముట్టుకోలేదు. అదే ఇప్పుడు అరవై, డెబ్బై వేల వరకు అవుతుంది. అవన్నీ మా ప్లీడరు బాబు గారే చూసుకుంటున్నారు. నాకు సరిగ్గా లెక్కలు తెలియవు. ఆయనే మీకన్నీ వివరంగా చెబుతారు. డబ్బు మీరెలా ఖర్చు చేయమంటే అలాగే చేస్తాం" అంది వర్ధనమ్మ.

ఆ మాటతో తెల్లబోయారు ఇద్దరూ. అంత డబ్బు వెనక వేసుకుని ఎంత పొదుపుగా బతుకుతున్నారు. ఇలాంటి వ్యక్తిత్వం ఉన్నవారు ఎటువంటి పరిస్థితులతోనైనా రాజీ పడతారు. తన కొడుకు సెలక్షన్ సరియైనదే. ఇన్నాళ్లకు వాడికి సరియైన ఆలోచన వచ్చిందన్నమాట.

"అయినా చూడండి బాబూగారూ! ఇంత





రకూ మా అమ్మాయి నాకీ విషయాలేమీ తెలియనివ్వలేదు. తను కోరుకున్నవాడినే పెళ్లాడుతానంటే నేను కాదంటానా? ఏమైనా ఆడపిల్లలకు తల్లి పరాయిదే" నిష్ఠూరంగా అంది వర్ధనమ్మ.

వింటున్న స్వప్నకు ఏమీ అర్థం కావడం లేదు. కోరుకున్నవాడెవరు? తను తల్లిదగ్గర గోప్యంగా వుంచిన విషయాలేమిటి?

"ఏమిటమ్మా, నువ్వనేది?" విసుగ్గా అడిగింది స్వప్న.

"చూశారా బాబుగారూ! తన పెళ్లికొడుకుని తానే వెతుక్కుని ఏమీ తెలియనిదానిలా ఎలా అడుగుతోందో?"

"ఎంతైనా ఆడపిల్లకు సిగ్గే సింగారం కదమ్మా! అందులోనే అందం, ఆనందం వుంటాయి. ఏమీలేదమ్మాయి! ఈయన రంగారావుగారని నీ ఫ్రెండు నారాయణ తండ్రి. మీరిద్దరూ ప్రేమించి, పెళ్లాడాలని నిర్ణయించుకున్న తరువాత ఆ శుభకార్యమేదో మా చేతులమీదుగా జరగాలనీ, పెద్దలుగా మా బాధ్యత నెరవేర్చుకోవాలనీ వచ్చాం"

దశరథరామయ్య మాటలతో మరింత అయోమయంలో పడింది స్వప్న.

"ఏమిటి... నేను, నారాయణ ప్రేమించుకున్నామా? పెళ్లాడడానికి నిర్ణయించుకున్నామా?" ఆశ్చర్యంగా అడిగింది స్వప్న.

"అదేమిటమ్మా అలాగంటావ్? నారాయణ నిన్ను తప్ప వేరెవరిని పెళ్లాడనని భీష్మించుకు కూచుంటే, మీ కోరికను కాదనడమెందుకని మేము వచ్చాం"

పరిస్థితి అందరినీ అయోమయంలో పడేసింది.

స్వప్నకు లోపల ఏదో అనుమానం- నారాయణ మళ్లీ ఏదో కొత్త ప్లాను వేశాడని. తనను ప్రేమించడం నిజమైతే, తనతో మాటమాత్రమైనా చెప్పకుండా అతని తల్లిదండ్రులకి ఈ విషయం చెబుతాడా?

"ఒక్కనిమిషం వుండండి సార్" పక్కగదిలోకి వెళ్లిన స్వప్న రెండు చేతులలోనూ కవర్లను పట్టుకుని తిరిగి వచ్చింది.

"చూడండి బాబుగారూ! ఒక మొగవాడు తాను ప్రేమించి పెళ్లాడుదామనుకున్న ఆడ

పిల్లలకీరకంగా ఉత్తరాలు రాయగలడా?''

ఆ ఉత్తరాలు చదివిన రంగారావుకి, దశర థరామయ్యకి మనసంతా జుగుప్సతో నిండిపో యింది.

రంగారావు తల ఎత్తనేలేకపోయాడు.

తనతో చదువుకునే ఆడపిల్లను ఇంత హీ నంగా విలాస వస్తువులా చూడగలుగుతు న్నాడా తన కొడుకు?

ఛీ ఛీ...

జరుగుతున్నదంతా వర్ధనమ్మకు అయోమ యంగా వుంది. అయినా తన కూతురి తెలివి తేటల మీదా, నిర్ణయంమీద నమ్మకం వున్నది కాబట్టి, తానేమీ కల్పించుకోకుండా కేవలం ప్రేక్షకురాలిలా చూస్తూ వుండిపోయింది.

సంగతి గ్రహించిన దశరథరామయ్య కల్పించుకున్నాడు.

"ఏదో చిన్నతనంకొద్దీ తెలియక కుర్రవాడు రాశాడు. పెళ్లిచేసుకునే వుద్దేశమే లేకపోతే మాకిక్కడికి రావలసిన అవసరమేముందీ?''

"తనకు లొంగని ఆడపిల్లను సాధించడాని కి ఇదొక మార్గంగా అనుకుని వుండవచ్చుగా''

"అలాగైతే కోరి పెళ్లాడటం దేనికి? భార్యను సాధించి, బాధించి తన జీవితాన్నే నాశనం చేసుకునేటంత తెలివితక్కువవాడా నారా యణ? వాడు మనస్ఫూర్తిగా నిన్ను పెళ్లాడాల నుకుంటున్నాడు. లేకపోతే పెద్దల ప్రమేయం లేకుండా నిన్ను నమ్మించి ఏ గుడిలోనో పెళ్లిచే సుకుని తరువాత నాకేం తెలియదని బుకా యించవచ్చుగా?''

"క్షమించండి బాబుగారూ! గత నాలుగే ళ్లుగా అతను చేసిన అల్లరి, పెట్టిన ఆరడీ సామాన్యమైందేమీ కాదు. మీరెంత చెబుతు న్నా అతనిదంతా మంచి మనసుతో చేశాడని నమ్మలేకపోతున్నాను. అనుమానాలతోను, అపార్థాలతోను సంసారిక జీవితం ప్రారంభంకా వడం మంచిదంటారా?'' అంటూ జరిగిన విషయాలన్నీ వివరంగా చెప్పుకు వచ్చింది స్వప్న.

"ఒక విషయం అడుగుతాను- ఏమీ అనుకో కుండా జవాబు చెప్పండి. మిమ్మల్ని పెళ్లి నిర్ణయించడానికి పంపిన నారాయణ మా కుటుంబ పరిస్థితి వివరంగా చెప్పాడా? కయ్యానికైనా వియ్యానికైనా సమానులే వుండా లంటారుగదా పెద్దలు'' అంది స్వప్న.

"మీ కుటుంబానికేమిటమ్మా! లాయరు రామనాథంగారి బంధుకోటిలోని వారంటే అదే చాలు. ధనలోపంలేదని మీ అమ్మగారు చెబు తున్నారు'' నర్ది చెప్పాడు దశరథరామయ్య.

"మీ మాటకు అడ్డువస్తున్నందుకు మన్నించండి బాబుగారూ! మేము రామనా థంగారి బంధుజనంలోవారిమని మీకెవరు చె ప్పారు?'' నిలదీసింది స్వప్న.

"అదేమిటమ్మా... మీకు పెద్దదిక్కు రామనా థంగారేనని ఇంతకుముందేగా మీ అమ్మగారు చెప్పారు?''

ఇదేదో గందరగోళం అనిపిస్తోంది రంగారా వుకి, దశరథరామయ్యకి కూడా.

"క్షమించండి సార్... మాకు పెద్దదిక్కు అంటే వారి బంధుకోటిలోవారమని మీరు పొర పాటుపడ్డారు. మా అమ్మ వారి ఇంట్లో వంటపని చేస్తోంది. అదే మాకు జీవనాధారం. స్వకుల స్తులం, పైగా రామనాథంగారు సహృదయులు కాబట్టి మాకు పెద్దదిక్కుగా నా చదువు సంధ్యల విషయం చూస్తున్నారు''

రంగారావు తెల్లబోయాడు.

ఏదో తండ్రి చిన్నతనంలో పోయాడు కాబట్టి పేదరికంలో వున్నారని అనుకున్నా ఈ విషయం మాత్రం తన భార్యకి తెలిసివుండ దు.

తెలిస్తే, ఈ సంబంధం విషయంలో ఇంత పట్టుబట్టి వుండేది కాదు.

తన భార్యేమిటి? అసలు నారాయణకే ఈ విషయం తెలిసివుండదు. తెలిస్తే ఒక వంట లక్క కూతురిని తన ఇంటికోడలుగా చేస్తా నంటాడా?

రంగారావులోని అభిజాత్యం తలయెత్తింది.

"ఈ విషయం మీ అబ్బాయికి తెలియదే మోనని మీరేమీ అనుకోనక్కరలేదు సార్! వంటలక్క కూతురునని నన్ను క్లాసులో చాలా సార్లే హేళనచేశాడు. చదువులేక, వెనక ఆసరా లేని స్థితిలో ఎవరింటిలోనో వంటపని చేసుకు



బతకడం నేరమని మేమెప్పుడూ అనుకోలేదు సార్! ఆ పరిస్థితికి మేమిద్దరమూ ఏనాడూ సిగ్గుపడలేదు. ఆ స్థితినుండి నన్నింతదానిని చేసిన మా అమ్మను చూసి నేను ఎప్పుడూ గర్వపడతాను''

స్వప్న కంఠంలో తల్లిపైగల అభిమానం, గౌరవం తొణికిసలాడాయి.

అయినా, వయసుకు మించిన ఆరిందాతనంతో, డబ్బు ప్రలోభంలో పడకుండా, ఉన్నది వున్నట్లుగా చెప్పకలిగిన ఆ అమ్మాయిని చూస్తే మాత్రం ముచ్చటేసింది రంగారావుకి.

కానీ, ఈమె నారాయణ గురించి చెప్పినదంతా నిజమేనా? ఇన్నాళ్ళూ వాడెంతో బుద్ధిగా వుంటున్నాడని అనుకుంటున్నాడు తను. క్లాసులో ఎప్పుడూ మంచి మార్కులే వస్తాయనీ లెక్చరర్‌కి, విద్యార్థులకి కూడా తనంటే అంతులేని అభిమానమనీ తల్లితో చెప్పినవన్నీ ఒట్టి అబద్ధాలేనా?

ఇక వీడినొక దారిలో పెట్టడమెలా? ఎందుకువచ్చిన పిల్లలు?

విరక్తిగా అనుకున్నాడు రంగారావు.

స్వప్ననే కోడలుగా చేసుకుంటే ఆ అమ్మాయి అతణ్ని సరియైనదారిలో పెట్టగలదేమో అనిపించి ఆ మాటే వర్ధనమ్మతో అన్నాడు రంగారావు.

"మా అమ్మాయి తెలివితేటలపై నాకు నమ్మకం వుంది బాబుగారూ! ఆలోచించకుండా అమ్మాయి ఏదీ చెయ్యదు. ఏంచేస్తాం... మీలాంటి సహృదయులతో సంబంధం కలుపుకునే అదృష్టం లేదనుకోండి. అన్యథా భావించకండి''

వినయంగా రెండు చేతులూ జోడించింది వర్ధనమ్మ.

"వస్తానమ్మా... జరిగినదానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను'' ఉత్తరాలు తీసుకుని దశరథరామయ్య వెంటరాగా బైటకు నడిచాడు రంగారావు.

కొద్దిక్షణాల ముందు తన కళ్ల ఎదుట సాక్షాత్కరించిన సుందరహర్మ్యం కూలిపోవడంతో దిగులుపడిపోయింది వర్ధనమ్మ.

స్వప్న తన క్లాసు పుస్తకాలు తీసుకుని టేబులు దగ్గరకు నడిచింది.




దశరథరామయ్యను పంపించేసి ఆ తరువాత రెండురోజులపాటు పట్నంలోనే వుండిపోయాడు రంగారావు. నారాయణను గురించి లెక్చరర్‌నీ, ప్రిన్సిపాలునీ వాకబు చేశాడు.

అందరు చెప్పినదీ ఒక్కటే మాట-

మనిషి తెలివైనవాడే కాని, చదువుమీద తగిన శ్రద్ధలేదు.

కాలేజికి రావడం అమ్మాయిలను ఏడిపించడానికే కాని పాఠాలు వినడానికి కాదు.

కానీ పరీక్షలముందు మాత్రం దీక్షగా చదివి ఎప్పటికప్పుడు మంచి మార్కులతోనే పాసవుతున్నాడు.

"మగపిల్లలను మొదటినుండి ఒకకంట కనిపెట్టి వుండాలండీ! ఇన్నేళ్లూ అశ్రద్ధచేసి ఇప్పుడు కళ్లుతెరిస్తే ప్రయోజనమేమిటి? తగినంత శ్రద్ధ తీసుకుంటే పైకి వచ్చే కుర్రాడే'' నిర్మొహమాటంగా చెప్పారు ప్రిన్సిపాలుగారు.

ఇక ఆడపిల్లలంతా ఒకటే గొడవ.

రకరకాలుగా వేధిస్తూ వుంటాడనేవారే అందరూ. ఈమధ్య కాస్త కుదురుగా వుంటున్నాడన్నారు కొందరు.

వింటున్నకొద్దీ రంగారావులో ఆవేశం పెరిగిపోతోంది. అయితే ఈ విషయాలేవీ నారాయణకు తెలియవు.

తండ్రి రెండురోజులు ఊళ్లోనే వుండిపోయాడంటే ఏదో ఇతరమైన పనులు వుండివుంటాయని అనుకున్నాడు. రంగారావు తెలియనివ్వలేదు.

పెళ్లి నిశ్చయమైపోయినట్లేనని సంబరపడి

పోతున్నాడు నారాయణ.

ఆసాయంత్రం మిగిలిన స్టూడెంట్స్ అందరూ షికారుకి వెళ్లినట్లున్నారు, మెస్‌లో నిశ్శబ్దంగా వుంది.

తండ్రి వున్నాడు కాబట్టి నారాయణ బుద్ధిగా తన గదిలో కూర్చుని పుస్తకం చేత్తో పట్టుకున్నాడు.

అప్పుడే బైటనుండి వచ్చిన రంగారావుకి నారాయణతో మాట్లాడానికి అదే తగిన సమయం అనిపించింది.

మెల్లిగా కొడుకుని పిలుచుకుని పెరటివైపు నడిచాడు.

మెస్ వంటవాడు ఎక్కడో వంటగదిలో హడావుడిగా వున్నాడు.

"రేపు వుదయం బయలుదేరి మనూరు వెడదామనుకుంటున్నాను"

పెరట్లో నూతి వద్దనున్న సిమెంట్ చప్టా మీద కూర్చుంటూ అన్నాడు రంగారావు.

పక్కనే నిలబడి వున్న నారాయణ మిగిలిన వివరాలకోసం ఆతృతగా చూస్తున్నాడు. పెళ్లి ముహూర్తం ఎప్పుడు పెట్టారో- ఏమో? తనంత తానెలా అడుగుతాడు.

పోనీ ఆ విషయం అర్థంచేసుకుని తండ్రే చెప్పకూడదూ?

ఏమిటో- పెద్దవాళ్లకిలాంటి విషయాలు బొత్తిగా తెలియవు.

"చదువు ఎలా వుంది?"

రంగారావుకి విషయం ఎలా ప్రస్తావించాలో తెలియడంలేదు.

"బాగానే వుంది"

నిరుత్సాహంగా అన్నాడు నారాయణ.

అంతవరకూ అణచుకున్న ఆవేశం ఒక్కసారి పెల్లుబికింది రంగారావులో.

"ఏమిటి... ఇదేనా బాగు" అంటూ స్వప్న వద్దనుండి తెచ్చిన ఉత్తరాలకట్ట నారాయణ మొహన్న కొట్టాడు.

ఆ ఉత్తరాలను చూసిన నారాయణ తెల్లబోయాడు. స్వప్నకు రాసిన జాబులు తండ్రి చేతికి ఎలా వచ్చాయి?

అంటే పెళ్లి సంబంధం మాట్లాడటానికి వెళ్లిన తండ్రితో తన గురించి చాలానే చెప్పి వుంటుందా?

సాక్ష్యంగా ఉత్తరాలు కూడా ఇచ్చిందా?

అంటే తనతో పెళ్లికి అంగీకరించలేదనా?

ఆఫ్టాల్ ఒక వంటలక్క కూతురు, తన లాంటి సంపన్నుడు కోరి పెళ్లాడుతానంటే ఎగిరిగంతేసి ఒప్పుకోక ఇలా ప్రతీకారం తీర్చుకుంటుందా?

"ఇదేనా నీ చదువు?" రెట్టించాడు రంగారావు.

నారాయణ ఆలోచనలు త్వరత్వరగా మారిపోతున్నాయ్.

"ఆ... పరిచయమైన కొత్తలో రాసిన ఉత్తరాలవి. తరువాత నాతో బాగానేవుండేది. రోజూ జాబులు రాస్తూ వుండేది. నన్ను విడిచి బతకలేననేది. నాకు నిన్ననే తెలిసింది. వాళ్ల అమ్మ ఎవరి ఇంట్లోనో వంటలు చేసుకుని బతుకుతోందని. ఆ విషయం ఇన్నాళ్లూ నాకు తెలియనివ్వలేదు. అసలా అమ్మాయికి ఇలాంటివి కొత్తకాదట. కాస్త డబ్బున్న అబ్బాయి కనపడితే చాలు, ఇలాగే వలవేసి పట్టుకుంటుందట. మోసం చేసినందుకు ఆమెతో అనుబంధం తెంచుకుంటానని బెదిరిస్తే ఆ లెటర్స్‌తో నన్ను బ్లాక్‌మెయిల్ చెయ్యాలని చూస్తోందన్నమాట. అసలు వాళ్ల అమ్మ..."

"నోర్ముయ్" అరచినట్లుగా అన్నాడు రంగారావు.

ఆ మాటలకు అదిరిన నారాయణ నోరు మూతబడింది.

"తన వివరాలేవీ నీతో చెప్పని ఆ అమ్మాయి పెళ్లి కుదర్చడానికి వెళ్లిన నాతో మొదటి పరిచయంలోనే తన వివరాలన్నీ చెప్పిందే! నీకు ఆమె విషయం నిన్ననే తెలిసిందేమో కానీ, ఆ అమ్మాయి మేము వెళ్లిన రోజునే చెప్పింది. నిజంగా ఆ అమ్మాయికి డబ్బు ఆశవుంటే ఎగిరిగంతేసి ఈ సంబంధానికి ఒప్పుకుని వుండేది. మూడుముళ్లూపడిన తరువాత నీ తిప్పలు నీకు పెట్టివుండేది. ఆ అమ్మాయి కాలిగోటికి కూడా సరిపోవురా నువ్వు. నీ సంగతంతా మీ ప్రిన్సిపాలుగారూ, మిగిలిన లెక్చరర్లు చెప్పారు. ఇంతకాలం నువ్వెంతో



బుద్ధిగా వుంటున్నావనే భ్రమలోపడి నిర్లక్ష్యం చేశాను. ఇక చాలు, ఇంకా ఇక్కడే వుండి మనఇంటి పరువూ, ప్రతిష్ఠ మంట గలపకు. రేపు ఉదయమే మన ప్రయాణం. నీ సామాను లన్నీ సర్దుకుని రెడీగా వుండు''

నారాయణ మౌనంగానే మాటవింటూ చివా లునలేచి చరచర వీధిలోకి నడిచాడు రంగా రావు.

రాత్రి మెస్‌కి తిరిగి వచ్చిన రంగారావుని స్టూడెంట్సంతా చుట్టుముట్టారు. అంతకు ముందే నారాయణద్వారా విషయమంతా తెలుసుకుని ఉన్నారు వాళ్లు.

నారాయణ చదువును మాన్పించవద్దనీ, ఇంకొక్క ఏడాదిలో డిగ్రీ తీసుకోబోయేవాడి భవి ష్యత్తును నాశనం చేయడం న్యాయంకాదని విద్యార్థులంతా పట్టుబట్టారు.

ఇక నుండీ బుద్ధిగా వుంటాడని తాము హామీ వుంటామనీ స్టూడెంట్స్ అందరూ నొక్కి చెప్పారు

నిజానికి కొడుకు చదువుని పాడు చేయా లనే ఉద్దేశ్యం ఆ తండ్రికిలేదు.

చివరికి స్టూడెంట్స్ మాటలతో సమాధానప డి కొడుక్కి నీతి బోధలుచేసి వెళ్లాడు రంగా

రావు.

ఇంటికి వెళ్లిన తండ్రి అక్కడి వ్యాపకాలలో పడి, ఇక్కడి విషయాలు ఇక్కడే మరచిపోత దని ఆశించాడు నారాయణ.

అప్పట్నుంచీ నారాయణ స్వప్నపై మరింత కార్పణ్యం పెంచుకున్నాడు.

పెళ్లాడి, చిత్రహింసలుపెట్టి, తన కసి తీర్చుకుందామంటే అది సాగనివ్వకపోగా, తన చదువుకే ఎసరు పెడుతుందా?

సరే... తను కాలేజీలో ఉండగా స్వప్న చదువు ఎలా కొనసాగిస్తుందో చూస్తాడుగాక.

మరునాటినుండి నారాయణ మరింత విజృంభించాడు.

స్వప్నమీద కసితో ఉచితానుచిత జ్ఞానాన్ని సైతం పూర్తిగా కోల్పోయాడు.

కానీ స్వప్న నారాయణ మాటలకూ, చేత లకూ విలువ నివ్వటంలేదు.

దానితో అతనిలో మరింత కసి పెరిగింది.

ఆరోజు సాయంత్రం స్వప్న మామూలుగా తనదారినతాను కాలేజీనుండి ఇంటికి వెడు తోంది.

ఇంటినుండి కాలేజీకి మామూలు తారు రోడ్డువున్నా దగ్గరని మామిడితోటలోనుండి నడిచి వెళ్లడం ఆ కాలేజీ అమ్మాయిలందరికీ అలవాటు.

ఆరోజు ఆఖరి పిరియడ్ ఖాళీ కావడంతో స్వప్న ఒక్కతే వెడుతోంది.

ఇంతలో హఠాత్తుగా ఒక మామిడిచెట్టు చాటునుండి ఎవరో వచ్చి తనను పట్టుకునేసరి కి స్వప్న బిత్తరపోయింది.

కాస్త తేరుకుని చూసేసరికి నారాయణ తన ను బాహువులలో బంధించడం గమ నించింది. ఒక్క విసురుతో అతన్నితోసివేసి తనదారినతాను ఇంటికి వెళ్లిపోయింది. ఆ హడావుడిలో తనపై ఏదో వెలుతురుపడటం గమనించలేదు.

మరునాడు కాలేజీకి వెళ్లేసరికి కాలేజీ అంతా గగ్గోలెత్తిపోతోంది.

ఎవరి చేతిలో చూసినా కార్డుసైజు ఫొటోలే. విచిత్రంగా అవి చూస్తూ అమ్మాయిలు గుసగుసలాడుకుంటున్నారు.

తన చేతిలో ఎవరో పెట్టిన ఆ ఫొటోవంక చూసిన స్వప్న కళ్లు చీకట్లు కమ్మాయి. స్వప్న, నారాయణ ఒకరి బాహుబంధంలో మరొకరు.

తననుతాను కంట్రోలు చేసుకుని ఆ ఫొటోని ముక్కముక్కలుచేసి ఎవరివైపు తలెత్తి చూడ కుండా క్లాసు రూములోకి వెళ్లిన స్వప్నకు ప్రిన్సి పాలుగారివద్దనుండి కబురు వచ్చింది.

"ఏమిటమ్మా... ఈ అల్లరి?" ఎదుట నిల్చు న్న స్వప్నను అడిగారు ప్రిన్సిపాలుగారు. సూ టిగా చూసింది స్వప్న "నన్నడిగితే నేనేం చెప్పను సార్! ఆ ఫొటోలు తీసినదీ, కాలేజీలో పేరు పేరునా పంచి పెట్టింది నేనుకాదు. నా దారిని నేను వెడుతుంటే వెనుకమాటున వచ్చి నామీద పడి, ఫొటోలుతీసి పంచిపెడితే నేనేం చేయగలను?"

నిర్భయంగా అడిగింది స్వప్న.

నిజమే... ప్రిన్సిపాలుగారు మాత్రం ఏం చేయగలరు? నారాయణను పిలిచి మందలి ద్దామంటే మళ్లీ ఏ నిరాహారదీక్షో అంటే తానేం చేయగలడు?

"మరేం చేయమంటావమ్మా?" నిస్సహా యంగా అడిగారు ప్రిన్సిపాలుగారు.

జాలిగా నవ్వింది స్వప్న.

"మీ సర్వీసంత వయసులేనిదాన్ని, నేనేం సలహా చెప్పగలను సర్! అయినా కన్నతండ్రీ, కాలేజీ ప్రిన్సిపాలుగారూ కంట్రోలు చేయలేని వ్యక్తిని నేనేం చేయగలను" విరక్తిగా అంది.

"పోనీ, ఇంకే కాలేజీకైనా ట్రాన్స్ఫర్ చే యించుకుని వెళ్లిపోతే? ఆహా... నా ఉద్దేశం వేరే ఏమీకాదు. అనవసరంగా అల్లరిపడటం నీ భవిష్యత్తుకి మంచిదికాదని. అందులో కన్న తండ్రి, తోడబుట్టిన అన్నదమ్ములు అంటూ వెనుక మగదిక్కు కూడా లేదు కనుక" సర్దుకు న్నారు ప్రిన్సిపాలుగారు.

నారాయణకు టి.సి. ఇచ్చి పంపే ధైర్యం ఆయనకులేదు.

"వెనుక మగదిక్కులేదనే ధైర్యంతోనే నన్ను తానెలా అవమానించినా చెల్లుతుందను కుంటున్నాడు నారాయణ. ఈ కాలేజీనుండి టి.సి. తీసుకుని, ఇంకొక కాలేజీలో చేరితే




అక్కడమాత్రం ఇటువంటివారు వుండకపో తారా మాస్టారూ! అప్పుడు మళ్లీ అక్కడనుండి టి.సి. తీసుకుని ఇంకొక కాలేజీలో సీటు వెతు క్కోవాలా నేను? లేక మా అమ్మ ఎటూ వంటల క్కగనుక నన్నుకూడా చదువు మానేసుకుని వంటలక్కగా బతుకు గడపమంటారా? పోనీ మీ ఇంట్లో నాకా అవకాశం ఇస్తారా?'' నవ్వింది స్వప్న.

స్వప్న మాటలకు ఏమీ సమాధానం చెప్పలే కపోయారు ప్రిన్సిపాలుగారు. నిజమే! అల్లరి చేసినవారినివదలి, అల్లరిపడుతున్న ఆడపిల్ల ను తానుకూడా ఆరడి పెట్టడమేమిటి?

''ఏనుగు వెడుతుంటే వెనుక కుక్కలు మొ రుగుతూ వుంటాయి, అయినంత మాత్రాన ఆ ఏనుగుకి వచ్చిన నష్టం ఏముంటుంది సార్! నాకు కావలసింది నేను చదువుకుని నాకాళ్ల మీద నేను నిలబడగలగడం. నా తల్లి కంటు న్నకలలు నేనైనా నిజం చేయాలనీ, నా తల్లి చివరిరోజులైనా నిశ్చింతగా గడపాలనీ తప్ప నాకే కోరికాలేదు మాస్టారూ! ఏ నారాయణలూ నన్ను నా చదువుకి దూరం చేయలేరు. క్షమించి నన్ను నా దారిన వదలండి''

రెండు చేతులూ జోడించి గిరుక్కున వెను దిరిగి వెళ్లిపోతున్న స్వప్ననే చూస్తుండిపోయా రు ప్రిన్సిపాలుగారు.

ఇక నారాయణను అలాగే వదిలేస్తే ప్రయో జనంలేదని ప్రిన్సిపాలుగారు నారాయణకు కబురుచేసి మందలించారు. ఇప్పటికైనా నీ ప్రవర్తన మార్చుకోకపోతే నీ తండ్రికి కబురు చేసి నిన్ను ఇంటికి తీసుకువెళ్లమని చెప్పవ లసి వస్తుందన్నారు.

ప్రిన్సిపాలుగారి మాటలతో నారాయణ ఆలోచనలోపడ్డాడు. ఈసారి తన తండ్రివస్తే, తనను చదువు మానిపించి ఇంటికి తీసుకువె ళ్లకమానడు.

స్వప్నకోసం తన చదువు పాడుచేసుకోవాలా?

ఎందుకు వచ్చిన గొడవ? ప్రస్తుతం ఈయ న్ని క్షమార్పణ కోరుకుని బైటపడితే స్వప్న విషయం తరువాత చూడవచ్చుననుకున్నాడు.

''క్షమించండి సార్! ఇక స్వప్న జోలికేకాదు- మరే ఆడపిల్లజోలికీ వెళ్లను. నా చదువు సంగతేదో నేను చూసుకుంటాను. మా నాన్నకు కంప్లైంట్‌చేసి నా చదువు పాడుచేయకండి సార్'' అంటూ క్షమాపణ చెప్పుకుని బైటపడ్డా డు.

★ ★ ★

''వర్ధనమ్మగారూ... మీకు ఉత్తరం'' ఇంటికి వెళ్లడానికి బయలుదేరిన వర్ధనమ్మ చేతిలో కవరు వుంచాడు ప్లీడరు గుమస్తా పంతులు.

''నాకు ఉత్తరమా?'' ఆశ్చర్యంగానే అంటు న్నా అందుకుని ముందుకు నడిచింది.

దారిపొడుగునా ఉత్తరం ఎక్కడనుండి?- అనే ఆలోచన.

అందులోనూ ఆ మధ్య తన కూతురుకు ఏవో ఉత్తరాలు వచ్చినప్పటినుండీ ఉత్తరా లంటేనే భయంపట్టుకుంది వర్ధనమ్మకు.

ఏవేవో అనుమానాలతో ఇల్లు చేరిన వర్ధన మ్మ

లోపలకు వస్తూనే కవరు చింపి చదివింది.

కవరుతోపాటు ఫొటో కూడా కిందపడింది.

ఆ ఫొటో చూసిన వర్ధనమ్మకు ఒళ్లంతా చమటపట్టింది. తన కూతురు ఎవరో పరాయి వాడి కౌగిలిలో కులుకుతూ వుండటమా?

పైపెచ్చు అదో ఘనకార్యంలా ఫొటోలు కూడా దిగడమా?

ఇన్నాళ్లూ తన కూతురేదో బుద్ధిమంతురా లని అనుకుంటూ వచ్చింది తాను ఛీ ఛీ... తన కడుపున చెడబుట్టింది.

ఇప్పుడు దీన్ని దారిలోకి తీసుకురావడ మెలా?- అనుకుంటూనే ఉత్తరం చదివింది.

వర్ధనమ్మగారికి—

నమస్కారాలు.

ఈ ఉత్తరంతోపాటు జతచేసి పంపిన ఫొటో చూస్తేనే, మీ అమ్మాయి ఎంతటి నెరజాణో మీకు తెలిసివుంటుంది. మీ అమ్మాయి వలలో పడింది ఈ అమాయకుడు ఒక్కడేకాదు. ఇప్ప టికైనా మీ అమ్మాయిని మీరు కంట్రోలులో పెట్టుకోకపోతే ఎందరో అభాగ్యులకు భవిష్యత్తు లేకుండా పోతుంది.

— ఆకాశరామన్న

వర్ధనమ్మకు ఇక ఒళ్లు తెలియలేదు.

సాయంత్రం స్వప్న ఇల్లు చేరేంతవరకూ తన ఆవేశాన్ని ఎలా కంట్రోలు చేసుకుందో ఆమెకే తెలియదు.

"ఏమిటమ్మా, అలావున్నావ్? వంట్లో బాగుండలేదా?" ఆదుర్దాగా అడిగింది కాలేజీ నుండి వచ్చిన స్వప్న తల్లినిచూసి.

"నీలాంటి కూతుర్ని కన్న తల్లి ఇంకెలా వుంటుంది?" విరక్తిగా అంది వర్ధనమ్మ.

స్వప్న దెబ్బతిన్నట్టు చూసింది.

"ఏమైందమ్మా? నేనెవరినీ తలవంచుకునే టట్టు ఎప్పుడూ ప్రవర్తించడంలేదే" అంది స్వప్న.

స్వప్నకీ అసలే ఈమధ్య జరిగిన సంఘటన లతో విసుగ్గావుంది. మిగిలిన వారితోబాటు తల్లికూడా తనను అనుమానించడం భరించ లేనంత అవమానంగా వుంది.

"ఇదిగో చూడు... నువ్వు జరిపే రాసక్రీడ లు"

ఫొటో, ఉత్తరం స్వప్నమీదకు విసిరేసింది తల్లి.

ఉత్తరం చదివిన స్వప్న మెల్లిగా అంది-

"జరిగిన విషయాలన్నీ నీకు తెలుసు! నువ్వు బాధపడతావని చెప్పలేదు. కానీ గత రెండురోజులనుండి ఇంటికి ఇటువంటి ఉత్త రాలే వస్తున్నాయి. ఆ ఫొటో కూడా మోసంతో తీసినదేకానీ నాకూ అతగాడికీ ఏ సంబంధ మూలేదు. నామీద కక్షగట్టి ఇంతటి రభస చేస్తున్నాడు ఆ నారాయణ. ఎవరెన్ని అన్నా నాకు ఫర్వాలేదు అమ్మా! నువ్వొక్కదానివి నన్ను నమ్మితేచాలు"

"నా నమ్మకం, అపనమ్మకాలతో పనేమి వుంటుంది తల్లీ! ఏదో నిన్ను చూసి బతుకుతు న్నాను. నా కడుపులో చిచ్చుపెట్టకు. మగపిల్ల లతో పంతాలూ, పట్టింపులూ ఎందుకు? ఆకు వచ్చి ముల్లుమీద పడ్డా, ముల్లు వచ్చి ఆకుమీ దపడ్డా నష్టపోయేది ఎవరు?"

"నన్నేం చేయమంటావమ్మా! నేనేమీ అత న్ని ఎదిరించలేదు. అతనితో మాట్లాడలేదు. నన్ను వెంటబడి వేధిస్తున్నది అతను. అయినా తలవంచుకుని నాదారిన నేను పోతున్నాను. చివరికి కాలేజీకి వెళ్లడమే నా అపరాధమా?"

"పరువుకంటే చదువు ముఖ్యంకాదు తల్లీ! అనవసరంగా అల్లరిపడి నూరేళ్ల జీవితాన్ని నాశనంచేసుకోకు. రేపటినుండి నువ్వికి కాలేజీ కి వెళ్లావంటే నామీద ఒట్టే. రేపే రామనాథంగా రితో చెబుతాను. ఏదో గంతకుతగ్గ బొంత మన తాహతుకి మించని సంబంధమేదో చూసి ఆ మూడుముళ్లూ వేయించేస్తే....? లేకపోతే ఇక మన గతి అధోగతే"

లోపలికి వెళ్లిపోయింది వర్ధనమ్మ కూతురి మొహం చూడలేక.

స్వప్న చదువులపై ఎంత ఆశలు పెట్టు కుందో ఆ తల్లికి బాగానే తెలుసు. అయినా చేసేదేముంది. విధికి తలవంచడం తప్ప?

లోపలకు వెళ్లిన తల్లినే పిచ్చిగా చూస్తూ వుండిపోయింది స్వప్న.

ఒక దౌర్భాగ్యుడికి భయపడి చదువు మానే యాలా?

దుష్టత్వానికి తలవంచవలసిందేనా?

అంత చేతగానిదా తను?

ఏదోలెమ్మని ఇంతకాలమూ సహనం వహించింది. ఇంక సహించే ఓపిక తనకులే దు.

అతగాడికి తగిన గుణపాఠం నేర్పాలి.

ఆడపిల్లలు అబలలుకాదనీ, తలచు కుంటే ఆదిశక్తే కాగలరనీ నిరూపించాలి.

తను నిరూపిస్తుంది.

తన జీవితం పణంగాపెట్టి అయినాసరే నిరూపిస్తుంది.

"అమ్మా... ఈ రోజు కాలేజీకి వెళ్లి వస్తాను"

నాలుగు రోజుల తరువాత బయటకు కదు లుతున్న స్వప్నను కోపంగా చూసింది వర్ధన మ్మ.

"కాలేజీలో చదవడానికి వెళ్లడంలేదమ్మా! ఇంకొక నెల రోజులలో ఎటూ పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. ఇప్పుడు లీవ్‌లెటర్‌పెట్టి పరీక్ష లకు అటెండ్ కావచ్చేమో అడుగుతాను. ఈ సెకండియర్ అయిపోతే ఫైనల్ ఇయర్ ప్ర యివేటుగా పరీక్షకు వెళ్లవచ్చేమో? అలాగైతే ఏం చేయాలో ఆఫీసులో కనుక్కుని వచ్చేస్తా ను"

తల్లి చెప్పే మాటలు కూడా వినిపించుకో కుండా చరచరా బైటకు నడిచింది స్వప్న.

గత నాలుగురోజులుగా రాత్రీ పగలూ నారాయణకు ఎలా బుద్ధి చెప్పాలా? అనే ఆలోచిస్తూ గడిపింది స్వప్న.

ఎలాగైనా అతన్ని దెబ్బతీయాలి.

తిరుగులేని దెబ్బ.

పోనీలేరా అని ఎప్పటికప్పుడు తన కోపం దిగమింగి తలవంచుకుపోతుంటే అది తన అసమర్థతగా భావిస్తున్నాడు నారాయణ.

ఆ లెటర్స్ ప్రిన్సిపాలుగారికి చూపించి అతనిమీద కంప్లెయింటు రాసిద్దామంటే ఆ ఉత్తరాలలోని హాండ్‌రైటింగ్ అతనిదికాదు. ఆ విషయం తనకు బాగానే తెలుసు.

కాలేజీ గేటు దగ్గరే తన బృందంతో ఎదురు పడ్డాడు నారాయణ.

నాలుగురోజులుగా స్వప్న కాలేజీ ముఖం చూడలేదు. ఇది తనకు విజయమే.

ఒంటరిగా వస్తున్న స్వప్నను చూసి విజయ గర్వంతో ఈల వేశాడు నారాయణ.

స్వప్న ఆ విషయం పట్టించుకున్నట్టులేదు. తిన్నగా నారాయణదగ్గరకు వచ్చింది.

"నారాయణా!" అతిమామూలుగా పిలుస్తున్న స్వప్నను నమ్మలేనట్టు చూశాడు నారాయణ.

"ఒకసారి ఇటు వస్తావా?"

నారాయణ సైగననుసరించి అతని మిత్రులు బయటకు తప్పుకున్నారు.

స్వప్న కాళ్లబేరానికి వచ్చినందుకు నారాయణకు మహదానందంగా వుంది. ఈ అమ్మాయికీ బుద్ధి ముందే వుంటే... తనెందుకు అల్లరి చేస్తాడు?

పాపం.. తన జోలికి రావద్దని ప్రాధేయపడుతుందేమో? అలా అడిగితే తనేమిటి- ఈ కాలేజీలో ఎవరూ ఆమె జోలికి వెళ్లకుండా చూస్తాడు.

ఆమెమీద ఈగ వాలకుండా చేస్తాడు.

"ఏమిటి స్వప్నా?" మృదువుగా అడిగాడు నారాయణ.

స్వప్న అహాన్ని దెబ్బతీయాలనే ఆలోచనే తప్ప వేరే అభిప్రాయంలేదు నారాయణకు.

"నీతో మాట్లాడాలి... రేపొకసారి మా ఇంటికి రాగలవా?"

ఎంతో శాంతంగా అడుగుతున్న స్వప్నను అనుమానంగా చూశాడు నారాయణ.

"దయచేసి ఇప్పుడింకేమీ అడగవద్దు నారాయణా! రేపు మధ్యాహ్నాం మూడు గంటలకు అమ్మ ప్లీడరుగారింటికి వెడుతుంది. సుప్పు సరిగా మూడున్నరకల్లారా! చాలా విషయాలు మాట్లాడాలి. ఈ కోరిక కాదనకు... ప్లీజ్"

ఇంకేమీ మాట్లాడకుండానే వెనుదిరిగి వెళ్ళిపోయింది స్వప్న.

వెళ్ళిపోతున్న స్వప్నను చూస్తూ ఆలోచనలో పడ్డాడు నారాయణ.

మరునాడు సరిగ్గా స్వప్న చెప్పిన టైముకే ఆమె ఇంటి తలుపులు తట్టాడు నారాయణ.

"రా నారాయణా!" ఎంతో శాంతంగా పిలిచింది. తన గదిలోకి తీసుకువెళ్లి కూర్చోబెట్టింది.

"జస్ట్ ఒన్ మినిట్... కాఫీ తీసుకువస్తానుండు"

స్వప్న లోపలకు వెళ్లగానే అక్కడవున్న కుర్చీలో కూర్చుని గదినంతా పరీక్షగా పరకాయించి చూడసాగాడు నారాయణ.

ట్రేలో కాఫీ, టిఫిను, మంచినీళ్లగ్లాసు పెట్టుకుని తీసుకువచ్చింది స్వప్న.

పక్కనున్న టీపాయ్ మీద పెట్టి పక్క కుర్చీలో కూర్చుంది.

"ఏమిటి విశేషం... ఈరోజు నీపుట్టిన రోజా?"

స్వీటు తీసుకుని నోట్లో పెట్టుకుంటూ స్వప్ననే పరీక్షగా చూస్తూ అడిగాడు నారాయణ.

స్వప్న తల స్నానం చేసిఉంది. కట్టుకున్నది కొత్తచీర. నిజంగా బర్త్‌డే పార్టీ అనే తనను పిలిచి ఉంటుందా? అయినా తనంటే లోపల అభిమానం, ప్రేమ ఉండే ఉంటాయి. నలుగురిలోనూ వెల్లడికావడం ఆమెకి ఇష్టం ఉండి ఉండదు. అందుకే ఇన్నాళ్లు దెబ్బనరి చూపించిందేమో? మరి ఆ విషయం తనతో

చెప్పకపోతే తనకెలా తెలుస్తుంది.

నారాయణ ఆలోచనల్లో ఉండగానే కాఫీ, టిఫిను తీసుకోవడం అయిపోయింది. స్వప్న లోపలకు వెళ్లడం గమనించలేదు.

"నారాయణా... ఇటు చూడు"

కాఫీ కప్పు టీపాయ్ మీద పెడుతున్న నారాయణ స్వప్న పిలుపుకు తలెత్తి చూశాడు.

మరుక్షణంలోనే కళ్లు రెండూ భగ్గుమని మండాయి.

స్వప్న రెండు గుప్పిళ్ల కారం నారాయణ కళ్లలో కొట్టింది.

"అబ్బా, అమ్మా" రెండు చేతులతోనూ మొహం కప్పుకొని గిలగిల్లాడుతున్నాడు నారాయణ. స్వప్న క్షణం ఆలస్యం చెయలేదు.

కుర్చీలోనున్న నారాయణను అంతకు ముందే సిద్ధం చేసి ఉంచుకున్న తాడుతో ఆ కుర్చీకే బలంగా కట్టివేసింది.

నారాయణ ఎంత పెనుగులాడినా ప్రయోజనం లేకపోయింది.

తరువాత చల్లని నీటితో నారాయణ కళ్లు తుడిచింది స్వప్న.

బోనులో పడ్డ పులిలా ఉన్నాడు నారాయణ.

ఏమాత్రం అవకాశం ఉన్నా విడిపించుకొని స్వప్న అంతు చూసేలా ఉన్నాడు.

"చూడు నారాయణా... నువ్వే తెలివైనవాడి ననుకొంటున్నావు కదూ! నాదారిన నేను ఉంటే, నన్ను వెంటాడి వెంటాడి, నా చదువు నాశనం చేశావు. చదువు తప్ప వేరే ధ్యేయం లేని నాకు భవిష్యత్తు లేకుండా చేశావ్. ఇప్పుడు నిన్ను నాశనం చేయడం నా చేతిలో ఉంది. ఈ క్షణంలో నిన్నేం చేసినా ఆదుకునే వారెవరూ లేరు. కానీ నీ ప్రాణాలను తీస్తే నాకు కలిసి వచ్చేదేమీ ఉండదు నేను జైల్లో పడటంతప్ప. ఇప్పుడే పోలీసు స్టేషనుకు వెళ్లి నువ్వు నా ఇంటికి వచ్చి నామీద అఘాయిత్యం చేయబోయేవని రిపోర్టు ఇవ్వబోతున్నాను. ఇక నిన్ను ఆ దేముడు కూడా రక్షించలేడు. ఆడపిల్లలను అవమానించడం నువ్వనుకున్నంత తేలిక కాదు నారాయణా"





స్వప్న నిజంగానే ఆదిశక్తిలా ఉంది.

విపరీతమైన ఆవేశంతో మాట్లాడుతూ బైటకు వెళ్లడానికి తలుపుతీసిన స్వప్న నిలువునా నీరుకారిపోయింది ఎదుట నిలబడివున్న వారిని చూడగానే.

"వాడిని రక్షించడానికి ఎవరొచ్చారో చూస్తూనే ఉన్నావుగా స్వప్నాదేవి! ఇక, నీ గతి ఏమిటో ఆలోచించుకో" అంటూనే చటుక్కున స్వప్నను లోపలకు లాగి నలుగురూ లోపలకు వచ్చారు.

వీధి తలుపులు గడియవేశారు నారాయణ మిత్రులు నలుగురూ.

స్వప్నను పూర్తిగా నమ్మలేని నారాయణ తన ఏర్పాట్లు తాను చేసుకునే వచ్చాడు.

"ఎవరు మీరంతా... మా ఇంటిమీద కేందుకు వచ్చారు? మర్యాదగా బైటకు నడవండి" మేకపోతు గాంభీర్యంతో హుంకరించింది స్వప్న.

"ఓహో... నీక్లాసుమేట్సునే గుర్తించలేనంత కండకావరంతో ఉన్నావన్నమాట. ఇక మేమెందుకు వచ్చామో? తెలియజెప్పకుండానే ఇక్కడనుండి బైటకు వెళ్ళంగా. అప్పుడే కంగారుపడతావేం? అయినా బైటకు నడవడానికేనా మేమింత దూరం వచ్చింది. మా పని అయిన తరువాత ఎటూ వెళ్లక మానం. అంతలోనే కంగారెందుకు భామామణీ"

వెటకారంగా అన్నాడు రామారావు.

నలుగురూ గింజుకుంటున్న స్వప్నను గదిలోకి ఈడ్చుకుని వచ్చారు.

ఎలాగైనా వాళ్లని వదిలించుకొని బైటకు పారిపోవాలని చూస్తోంది స్వప్న.

పెడరెక్కలు విరిచి పట్టుకున్నాడు ఒకడు.

ఇంకొకడు గబగబా నారాయణ కట్లు విప్పాడు.

కట్లు తెంచుకున్న ఆంబోతులా స్వప్న ముందుకు వచ్చాడు నారాయణ.

కళ్లలో పడిన కారం వల్ల కళ్లు రెండూ చింతనిప్పుల్లా ఉన్నాయి. కళ్లవెంట నీరు కారుతూనే ఉంది. మొహం జేవురించి ఉంది. కుడిచేత్తో స్వప్న జుట్టు పట్టుకుని మొహంపైకెత్తి ఆమె కళ్లలోకి క్రూరంగా చూశాడు.

''కెవ్వు''మని అరచి రెండు కళ్లూ మూసుకుంది స్వప్న నారాయణ భయంకరాకారాన్ని చూడలేక.

''ఏం... నువ్వే తెలివైనదానివనుకున్నావ్ కదూ! నీ మీద అఘాయిత్యం చేయబోయామని పోలీసు రిపోర్టు ఇవ్వడానికి బయల్దేరావు కదూ! అప్పుడే తొందరేముంది. కొంతసేపు గడిచాక అఘాయిత్యం చేయబోయాడని కాదు, చేశాడనే ఇద్దువుకాని. చేసి నలుగురిలో ఎలా తలెత్తుకు తిరుగుతావో నేనూ చూస్తాను'' మండి పడుతున్నాడు నారాయణ.

''వద్దు... నన్నేం చేయకండి, మీకు చేతులెత్తి నమస్కారం చేస్తాను. ఇక మీజోలికి ఎప్పుడూ రాను. ఆఖరికి ఈ ఊరినుండి ఎవరికీ కనిపించకుండా వెళ్లిపోతాను. నన్ను క్షమించి నాదారిన నన్ను వదిలేయ్. నన్ను నాశనం చేయకు''

స్వప్న ఘోష వారి చెవులకు సోకడంలేదు.

తన శక్తి ఉన్నంతవరకు పోరాడింది స్వప్న.

కానీ నలుగురు వయసులోఉన్న పైగా ఆవేశంతో ఉచితానుచిత జ్ఞానాన్ని కోల్పోయిన విద్యార్థులనుండి తప్పించుకోవడం ఆమెకు సాధ్యం కాలేదు.

''ఇక దీనిసంగతి నేను చూసుకుంటాను. మళ్లీ ఎవరైనా ఇటు వస్తే మనపని ఆఖరు. మూడువైపులా కాపలా కాస్తూ ఉండండి. ఎవరైనా వస్తున్నట్లయితే ముందుగానే ఈలవేసి హెచ్చరించి మీరు పారిపోండి. అంతా సవ్యంగా జరిగితే నా తరువాత చాన్సు మీదేలే''

తోటకూరకాడలా వాలిపోతున్న స్వప్నకు మంచంమీదకు చేరుస్తూ తన స్నేహితులను ఆదేశించాడు నారాయణ.

నారాయణ మాటలతో ఉత్సాహంగా బైటకు నడిచారు అతని మిత్రబృందం.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలవేళ ఇంట్లో అడుగు పెట్టింది వర్ధనమ్మ.

పైడరు రామనాథంగారి అమ్మాయికి పెళ్ళిచూపులు వచ్చినవారికి కాఫీ, టిఫిన్ల ఏర్పాటు చేసి, వారు వెళ్లిన తరువాత వంటావార్పు చూసుకునేసరికి ఇంత వేళయింది.

పెళ్ళిచూపుల తతంగం జరుగుతున్నంతసేపూ వర్ధనమ్మకు మనసులో గుబులు గుబులుగానే వుంది. అనుక్షణమూ స్వప్నే కళ్లలో మెదిలింది.

ఒకపక్క 'శుభమా' అని తన యజమాని కూతురికి పెళ్ళిచూపులు జరుగుతూంటే తన మనసు ఎందుకింతగా భారంగా వుందో వర్ధనమ్మకు అర్థం కాలేదు. తన కూతురి వయసుదే రామనాథంగారి అమ్మాయికూడా. తన కూతురి పెళ్ళికన్నా ముందుగా ఆ అమ్మాయికి పెళ్ళి అవుతోందని తనేమైనా ఈర్ష్య పడుతోందా?

మనసులోనే నొచ్చుకుంది వర్ధనమ్మ.

మొత్తానికి అన్యమనస్కంగానే భోజనమైనా చేయకుండా ఇంటి దారిపట్టింది వర్ధనమ్మ.

రామనాథంగారి భార్య, ఆ తల్లీకూతుళ్ళిద్దరికీ కారియర్‌సర్ది వర్ధనమ్మ చేతికి ఇచ్చింది. మనిషిని తోడిచ్చి వంపాడు రామనాథం.

ఇల్లంతా చీకటిగావుంది. లైటన్నా వేసుకోకుండా స్వప్న ఏం చేస్తోందో అర్థంకాలేదు. పైగా వీధి తలుపు తీసి ఉంది.

దడదడలాడుతున్న గుండెలతో తోడువచ్చిన మనిషి టార్చ్‌లైట్ వేసి చూపిస్తుంటే చుట్టూరా చూసి కంగారుపడింది వర్ధనమ్మ.

ముందు గది అంతా చిందరవందరగా వుంది. ''స్వప్నా... అమ్మాయ్ స్వప్నా!''

ఆదుర్దాగా పిలుస్తూ పక్క గదిలోకి వెళ్ళి లైటు వేసిన వర్ధనమ్మ మంచంవైపు చూసి 'కెవ్వు'మని అరచి కుప్పకూలిపోయింది.

మంచం మీద అస్తవ్యస్తంగా అపస్మారక స్థితిలో పడివుంది స్వప్న.

వర్ధనమ్మ కేకతో ఏం జరిగిందోననే ఆదుర్దాతో లోపలకు వచ్చిన ఆ పదిహేనేళ్ళ కుర్రాడు, స్పృహలేని స్థితిలోనున్న ఆ ఇద్దరి ఆడవారినీ చూసి భయంతో పిచ్చికేకలు వేయడం ప్రారంభించాడు- వీధిలోకి వచ్చి.

ఆ గోలకి ఇరుగు పొరుగూ చేరి పరిస్థితిని చూసి పోలీసులకి కబురు చేశారు.

కొంచెం తేరుకున్న ఆ కుర్రాడు బాణంలా దూసుకుపోయి రామనాథంగారికి కబురు తెలియజేశాడు.

రామనాథంవచ్చే సరికే పోలీసువాను ఇంటి ముందు వుంది. అంతా కలిసి స్పృహలేని స్థితిలోవున్న స్వప్నను హాస్పిటల్‌లో చేర్పించారు.

వర్ధనమ్మను హాస్పిటల్‌లోచేర్పించ వలసిన అవసరమే లేకపోయింది.

కూతురిపై అన్నీ ఆశలూపెట్టుకుని ఆ కూతురి కోసమే బతుకుతున్న ఆ కన్న తల్లి గుండె, కూతురినా స్థితిలో చూసిన మరుక్షణమే ఆగిపోయింది.

స్పృహలేనిస్థితిలో వున్న స్వప్నను దిక్కులేనిదానినిగా చేసి అన్ని బంధాలను తెంచుకుందివర్ధనమ్మ.

★ ★ ★

రెండురోజులు స్పృహలేనిస్థితిలో చావుబతుకులమధ్య కొట్టుకులాడిన స్వప్న మూడవరోజున కళ్ళు తెరిచింది.

కళ్ళు తెరిచిన స్వప్నకు ఎదురుగా నారాయణ తండ్రి రంగారావు కనిపించాడు. స్వప్న రెండు కళ్ళూ నీటితో నిండాయి. పేపరులో జరిగిన దారుణ వార్త చదివిన రంగారావు వెంటనే పరుగెత్తుకు వచ్చాడు.

"అమ్మా... స్వప్నా! నిన్నీ స్థితికి దిగజార్చిన



దౌర్భాగ్యుడెవరమ్మా?''

నారాయణేమోననే అనుమానం ఆయనకు లేకపోలేదు. కాని నారాయణా, అతని మిత్రులూ ఎలిబి సృష్టించుకుని ముందే జాగ్రత్తపడ్డారు.

స్వప్న మాట్లాడలేదు.

స్వప్నకు తెలివిరాగానే పోలీసులు చుట్టుముట్టారు. పోలీసుల ఇంటరాగేషన్‌లో స్వప్న జరిగినది జరిగినట్లు నిర్భయంగా చెప్పింది. వచ్చిన వారిపేర్లు కూడా చెప్పింది.

కాని నారాయణ మిత్రులు తమ తండ్రుల పలుకుబడితోనూ, దొంగ సాక్ష్యాధారాలతోనూ తప్పించుకున్నారు. వారితోపాటు నారాయణా బతికి బయటపడ్డాడు. రంగారావు మాత్రం ఈ విషయంలో ఏమీ కల్పించుకోలేదు.

హడావుడి అంతా తగ్గిన తరువాత ఇంకా హాస్పిటల్‌లోనే వున్న స్వప్నను కలుసుకున్నాడు రంగారావు.

''ఈ దౌర్భాగ్యులు కోర్టు వేసే శిక్షను తప్పించుకోగలరేమో కానీ, ఆ లోకంలో తప్పించుకోలేరు. అయినా నీ బతుకుని కాలరాసినవాడే నీ మెడలో మూడుముళ్ళూ వేస్తాడు. జరిగినది మరచిపోయి నా ఇంటికోడలిగా అడుగు పెట్టు తల్లీ! ఈ రకంగా మావాడు చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకునే అవకాశం ఇయ్యి'' రంగారావు మాటలకు అడ్డువచ్చింది స్వప్న.

''క్షమించండి బాబుగారూ! అలాంటి వ్యక్తికి భార్యగా బతికేకంటే ఆత్మహత్య చేసుకోవడం మేలు''

ఆ ఊహకే ఒళ్ళు కంపరమెత్తినట్లు మొహం చిట్లించుకుంది స్వప్న.

''అంతమాట అనకమ్మా! నీలాంటి వ్యక్తి బతకాలి... బతికితీరాలి. బతికి అలాంటి వ్యక్తులకు తగిన గుణపాఠం నేర్పాలి''

''నేను ఆత్మహత్య చేసుకోను బాబుగారూ. బతుకుతాను. ఈ సమాజానికి ఎదురీది బతుకుతాను. ఇలాంటి దౌర్భాగ్యులవల్ల జీవితాన్ని నాశనం చేసుకోవలసిన అవసరం లేదని నిరూపించడానికైనా బతుకుతాను- కాని అతనికి భార్యగా మాత్రంకాదు. మీ మాట కాదంటున్నందుకు మన్నించండి''

రెండు చేతులూ జోడించింది స్వప్న.

''ఆ దేముడు నిన్ను చల్లగా చూడాలి తల్లీ! నీకే అవసరం వచ్చినా, నీకు తండ్రిలాంటివాడిని నేనంటూ ఒకడిని వున్నానని మరచిపోకు''

''అలాగేనండీ... కానీ ఆ అవసరం రాకూడదనే ఆశిద్దాం'' స్థిరంగా అంది స్వప్న.

★ ★ ★

రంగారావు నారాయణను చదువు మాని పించి ఇంటికి తీసుకు వచ్చాడు.

సన్నిహితులు ఎంత చెప్పినా, భార్య ఎంత ప్రాధేయపడినా నారాయణను చదువు కోసం పట్నంలో వుంచడానికి అంగీకరించలేదాయన.

బాధ్యత అప్పజెబితే తప్ప కుదురుగా వుండడని, ఆస్తి వ్యవహారాలన్నీ ఒక్కొక్కటిగా అప్పజెప్పడం ప్రారంభించాడు.

ఏ ప్రాధాన్యతా లేకుండానే నారాయణ జీవితంలో రెండేళ్ళు కాలగర్భంలో కలిసిపోయాయి.

''ఏమిటో... మీరే విషయమూ పట్టించుకోరు. ఒక్కగానొక్క బిడ్డ అలా మోడులా తిరుగుతూవుంటే నా గుండె తరుక్కుపోతోంది. 'బెండకాయ ముదిరినా, బ్రహ్మచారి ముదిరినా'- అని- అసలు మనవాడికి పెళ్ళీడు దాటిపోతోందన్న ధ్యాస మీకేమైనా వుందా'' ఆ రాత్రి తీరికగా రంగారావుతో ప్రారంభించింది శాంతమ్మ.

రంగారావు సూటిగా భార్యను చూశాడు. ''నీకొడుక్కి పెళ్ళిచేసి అభం శుభం తెలియని ఓ ఆడపిల్లకి ఉరితాడు వేయలేను''

''అవ్వ...'' నోరు నొక్కుకుంది శాంతమ్మ.

''ఎప్పుడో తెలిసీ తెలియని వయస్సులో ఏదో చేశాడని ఇప్పటికీ వాడిని సాధిస్తారేమిటి? అసలు తండ్రి కన్నకొడుకుని అనవలసిన మాటలేనా అవి? అసలా పిల్ల మందో మాకో ఏదో పెట్టింది. దాని పుణ్యమా అని నా కొడుకు చదువు గంగలో కలిసింది. దానిపాటికి అది సుఖంగానే బతుకుతోంది! మనవాడికి మాత్రం పెళ్ళిచేయకుండా మోడులా బతకమంటున్నా

రు మీరు. నీతీ జాతీలేని ఆ పిల్లకోసం...''

''నోర్మూయ్''

రంగారావు గర్జింపుతో శాంతమ్మ వాక్ప్రవాహం ఆగింది.

''ఛా ఛా... సిగ్గులేదూ నీకు! నీ కొడుకు పుణ్యమా అని ఒక అమాయకురాలి నూరేళ్ల జీవితం మంటగలసింది. నీలాంటి ఒక తల్లి నీకొడుకు ఘోరకృత్యానికి గుండె ఆగి మరణించింది. ఆడదానివైవుండీ ఒక ఆడపిల్లను అవమానిస్తావా? అసలు నువ్వు ఆడదానివేనా? నీకొడుకు పెళ్లి నీఇష్టం, వాడిష్టం- నేనే మాత్రం ప్రమేయం కల్పించుకోదలచుకోలేదు'' అన్నాడాయన.

భర్త ధోరణికి భయపడి శాంతమ్మ అప్పటికి మౌనం వహించింది.

ఆ తర్వాత అతను మంచి మూడ్ లో వున్నప్పుడల్లా కొడుకు వివాహ ప్రసక్తి తెస్తూనే వుంది. ముందులా మండిపడకపోయినా, నిర్లిప్తంగా వుండటం ప్రారంభించాడు రంగారావు.

శాంతమ్మ దూరపు చుట్టం సీతమ్మగారు తన మనుమరాలు భారతిని తీసుకుని వచ్చింది.

''ప్రక్క ఊరికి ఎటూ బంధువుల ఇంట్లో శుభకార్యమైతే, వచ్చాను కదా- ఇంతవరకూ వచ్చి మా శాంతమ్మను చూడకుండా వెళ్లడం ఏమిటని ఇటువచ్చాను''

వస్తూనే సంజాయిషి చెప్పుకుంది సీతమ్మ.

''రండి రండి, పిన్నిగారూ... ఇన్నాళ్లకు మామీద దయ కలిగింది- మాకంతే చాలు'' మనస్ఫూర్తిగా ఆహ్వానించింది శాంతమ్మ.

నాయనమ్మ వెనుక నిలబడి భయం భయంగా లోపలకు వచ్చిన భారతిని చూస్తుంటే శాంతమ్మలో ఏవేవో ఆశలూ, ఆలోచనలూ చోటుచేసుకుంటున్నాయి.

సీతమ్మ ఊరికే చూసిపోదామని వచ్చామని చెబుతున్నా ఆమె లోపలి ఆలోచనలువేరు.

రెండురోజుల తరువాత మెల్లిగా తన మనసులో మాట బైటపెట్టింది సీతమ్మ.

''ఏమిటో... నీ తమ్ముడు ఇన్నాళ్లూ పది మందిలోను తలయెత్తుకుని బతికాడు. పెద్ద పిల్లలిద్దరినీ సలక్షణంగా అత్తవారింటికి అంపకంపెట్టాడు. కట్నకానుకలూ, లాంఛనాలూ సక్రమంగానే జరిపాడు. ఇదిగో- ఆఖరిది ఇది మిగిలింది. దీని అదృష్టమెలా వుందో? కట్నాలు చూస్తే చుక్కలనంటుతున్నాయి. ఇదివరకులా కుటుంబాలని, కుటుంబ సాంప్రదాయాల్నీ చూసి ఎవరు చేసుకుంటున్నారు? ఎంతసేపూ అమ్మాయి వెనుక ఎంత మూట వస్తుందో అనేగా దృష్టి అంతా! దీన్ని గురించే బెంగపెట్టుకుని ఉన్నారు నీ తమ్ముడూ, మరదలూ. అప్పటికీ నేను చెబుతూనే వున్నాను- అందరూ డబ్బు మనుషులే వుండరు, సాంప్రదాయాలకి విలువనిచ్చేవారు లేకపోరు. ఎవరికెక్కడ రాసిపెట్టి వుందో? అయినా ఆ ఘడియ రావాలిగా- అని''

వేదాంత ధోరణిలోకి వెళ్లిపోయింది సీతమ్మ.

''లక్షణమైన పిల్ల- భారతిని కోరి చేసుకుంటారెవరైనా''

అందేగానీ భారతి తండ్రి సదాశివం ఆర్థికంగా దెబ్బతిన్న విషయం శాంతమ్మకూ తెలుసు.

''ఎంత లక్షణమైన పిల్ల అయినా వెనుక లక్షలు లేకపోతే, మగపెళ్లివారికి అవలక్షణంగానే కనిపిస్తుంది. అంతెందుకు అయిన సంబంధమని నీ కొడుక్కి ఈ పిల్లను చేసుకుంటావా? మీ స్థాయికి తగ్గ సంబంధాలనే చూస్తావుగాని''

''మాకు కట్నాలమీద ఆశలేదు పిన్నిగారూ! ఆయనకీ, పిల్లాడికీ నచ్చితే కట్నాల ప్రమేయమేలేదు. ఆయనతో మాట్లాడి చూస్తానుండండి''

''బాబ్బాబు- ఆ మాత్రం ఉపకారంచేసి పిల్లకు నీ నీడన కాస్త చోటిస్తివా చచ్చి నీ కడుపున పుడతాను''

''తప్పు పిన్నిగారూ! మీ మనవరాలి కడుపున పుడతాననండి'' నవ్వింది శాంతమ్మ.

తను అనుకున్న పథకం నెరవేరిందన్న సంతోషంతో మరునాడే మనుమరాలితో తిరుగు ప్రయాణం అయింది శాంతమ్మ.

భారతిని కాదనడానికి రంగారావుకి కానీ, నారాయణకిగానీ ఏ కారణమూ కనిపించలేదు. నారాయణను మొదటిచూపులోనే ఆక

ర్థించింది భారతి. ఏదో రకంగా కోడలు తన ఇంట గృహప్రవేశం చేస్తేనేచాలు అనుకున్న శాంతమ్మ పట్టుబట్టి త్వరగా ముహూర్తాలుపెట్టించింది.

ఆడపెళ్లివారింటికి వెళ్లి తాంబూలాలు పుచ్చుకుని పదిహేను రోజుల్లో పెళ్లి ముహూర్తం పెట్టించుకుని తిరిగి వచ్చాడు రంగారావు.

ఎప్పుడూ తెల్లవారకుండా నిద్రలేచే రంగారావు ఏడు గంటలు కావస్తున్నా నిద్ర లేవకుంటే, ప్రయాణప్రు బడలికేమోనని శాంతమ్మ చాలాసేపు పట్టించుకోలేదు.

తన స్నానం, పూజాకార్యక్రమాలన్నీ అయ్యాక, వంటమనిషి అందించిన కాఫీగ్లాసు తీసుకుని భర్త గదిలోకి వచ్చింది.

"ఏమిటింకా నిద్రలేవలేదు" అంటూ భర్తను లేపడానికి మీదచెయ్యి వేసిన శాంతమ్మకు రంగారావు శరీరం చల్లగా తగిలింది.

రాత్రి ఏ సమయంలో ప్రాణం పోయిందో- శరీరం కట్టెలా బిగుసుకుపోయివుంది.

శాంతమ్మ వెర్రికేకవేసి విరుచుకుపడిపోయింది.

ఆమె కేకకు ఇంట్లో వినివారంతా గుమికూడారు. బైటకు వెళ్లిన నారాయణను పిలుచుకు వచ్చారు.

మిగిలిన కార్యక్రమాలన్నీ యథావిధిగా జరిగిపోయాయి. కబురు తెలుసుకున్న భారతి తండ్రి కృష్ణారావు రెక్కలు కట్టుకుని వాలాడు తల్లి సీతమ్మతో.

పుట్టింట నా అనేవారు లేని శాంతమ్మకు కృష్ణారావు, సీతమ్మ అండగా నిలబడ్డారు.

ఇక పెళ్లి ఒక ఏడాదిపాటు వాయిదా పడింది.

ఆ సంవత్సర కాలమూ నారాయణ అక్క తల్లికి సాయపడేందుగాను పుట్టింట్లో వుండిపోయింది. అత్తగారి సలహామేరకు.

నారాయణ అక్క సరోజను పదిమైళ్ళ దూరంలోనే వున్న మరొక పల్లెటూరిలో వ్యవసాయం చేసుకునే రమేష్‌కిచ్చి పెళ్లిచేశారు- ఏడెనిమిదేళ్ల క్రితం.

రమేష్ తండ్రి ఆ ఊరిలో మోతుబరి రైతు. తండ్రి అజమాయిషీలో కొడుకులు నలుగురూ బైట వ్యవహారాలు చూసుకుంటూ వుంటే, ఇంట్లో అత్తగారి పెత్తనంలో కోడళ్లు నలుగురూ ఇల్లు చక్కదిద్దుకుంటూ వుంటారు.

కొడుకులూ, కోడళ్లతోపాటు ఉన్న ఇద్దరు కూతుళ్లూ పురుళ్లకూ, పుణ్యాలకూ వస్తూపోతూ వుండటంతో ఇల్లు కలకలలాడుతూ ఉంటుంది. ఆ ఇంటి చిన్న కోడలు సరోజ కొన్నాళ్లు పుట్టింట్లో వున్నా ఆ ఇంట ఇబ్బంది లేదు.

సరోజ అత్తవారిల్లు చూస్తే ఎంతో సంతోషంగా వుంటుంది శాంతమ్మకు. ఇంకా పిల్లలు లేరని తప్ప సరోజ విషయంలో ఇంకే దిగులు లేదు.

రమేష్ పని హడావుడిలేనప్పుడల్లా అత్తవారింటికి వచ్చి వెడుతూనే వున్నాడు.

బాధ్యతలు మీదపడటంతో నారాయణ పని కుడితిలోపడ్డ ఎలుకలా తయారైంది. స్వతహాగ తెలివైనవాడు కాబట్టి దశరథరామయ్య సహకారంతో వ్యవహారాలన్నీ ఒక కొలిక్కి తీసుకువచ్చాడు. కొడుకు సమర్థతనుచూసి సంతోషించింది తల్లి.

చూస్తుండగానే సంవత్సరకాలం గడిచిపోయింది.

రంగారావు సంవత్సరీకాలు పూర్తిఅయిన వెంటనే పెళ్లిఅయి భారతి కాపురానికి వచ్చింది.

తన అవసరం తీరడంతో సరోజ తన ఇల్లు చేరుకుంది.




శ్రావణమాసం...

కొత్తకోడలితో శ్రావణమాసం నోములు తన ఇంటనే జరిపించాలని పట్టుబట్టింది శాంత

మ్మ. సహాయానికి వియ్యపురాలు జానకమ్మ వచ్చింది.

కూతురిని కూడా అత్తవారింట నుండి పిలిపించింది శాంతమ్మ. సరోజకప్పుడు మూడో మాసం. పెళ్లయిన ఏడేళ్లకు సరోజ గర్భవతి కావడం- రెండు కుటుంబాలవారికి సంతోష కారణమైంది.

శాంతమ్మ ఆనందానికి అవధులేలేవు.

ఆ మరునాడే సరోజ తన ఇంటికి ప్రయాణం.

కానీ... అత్తవారింటినుండి మనిషి టాక్సీ తీసుకునే వచ్చాడు.

సరోజ భర్త రమేష్‌ను పొలంలో ఏదో పురుగు ముట్టిందనీ, పట్నం తీసుకు వెళ్లారనీ, సరోజని కూడా పట్నం తీసుకురమ్మని టాక్సీ పంపారని చెప్పాడు ఆ మనిషి.

దడదడలాడే గుండెలతో నారాయణ తోడు రాగా టాక్సీ ఎక్కారు తల్లీకూతుళ్లు.

అయిదోతనంకోసం చేసిన శ్రావణమాసం నోములైనా సరోజ అయిదోతనాన్ని కాపాడలేక పోయాయి.

సరోజ పట్నం చేరేసరికి అతని భౌతికకాయమే మిగిలివుంది. రమేష్ అంత్యక్రియల అనంతరం శాశ్వతంగా పుట్టిల్లు చేరింది సరోజ.

★ ★ ★

దెబ్బమీద దెబ్బతగిలేసరికి శాంతమ్మ తట్టుకోలేకపోయింది.

పెళ్లి నిశ్చయమైన వెంటనే భర్త పోవడం, కోడలు కాపురానికి వచ్చి ఆరు నెలలైనా కాకుండానే అల్లుడు పోవడంతో కోడలు అంటే ఆమెకు భయంపట్టుకుంది.

భర్త తన కొడుకు పెళ్లి గురించి పట్టించుకోలేదని, ఏదో ఒక సంబంధమని తొందరపడి జాతకాలైనా సరిగా చూసుకోకుండా భారతిని కోడలుగా తెచ్చుకున్నందుకు పశ్చాత్తాపపడటం ప్రారంభించింది శాంతమ్మ.

అంతవరకు పేరుకుతగ్గ ఇల్లాలు అనిపించుకుంటూ శాంతమూర్తిలా వుండే శాంతమ్మ కోడలు విషయంలో గయ్యాళిలా మారిపోయింది.

భారతి పని ఇరకాటంలో పడింది.

ఇన్నాళ్లూ అత్తచాటు కోడలుగా ఆవిడ కనుసన్నలలో పనిపాటలు చేసుకుంటూ వుండేది. ఇన్నాళ్లు అపురూపంగా చూసిన అత్తగారు అల్లుడు పోయేసరికి తనమీద కార్పణ్యం చూపించడమెందుకో అర్థం అయ్యేది కాదు.

ఒకవైపు విచారసాగరంలో మునిగితేలే ఆడపడుచు;

మరోవైపు తనను ఆరడిపెట్టడమే ధ్యేయంగా పెట్టుకున్న అత్తగారు.

పద్దెనిమిదేళ్ల భారతి బెదిరిపోయేది. అంత ఇంట్లోను ఒక్కతే బిక్కుబిక్కుమని తిరుగుతూ వుండేది.

నారాయణ ఎప్పుడూ ఏవో పనులమీద పగలంతా బైటే గడుపుతూ వుంటాడు. భారతి వంటమనిషి రంగమ్మతోనో, పనివారితోనో మాటలు వేసుకుని కూర్చుంటే లేకిబుద్ధులని అత్తగారు ఈసడిస్తూ వుండేది.

ఇక నారాయణ అవసరాలను గమనిస్తూ ఎప్పటికప్పుడు అతని కూడా తిరుగుతూ అతనికేం కావాలో చూడటమే భారతికి ఆ ఇంట మిగిలిన కాలక్షేపం.

'బరితెగించిన రకమని' అత్తగారు ఆడిపోసుకుంటూ వున్నా ఆ విషయంలో భారతి అత్తగారిని లక్ష్యపెట్టేది కాదు.

నారాయణకేమో పగలంతా బైట గడపడమే ప్రాణానికి హాయిగా వుండేది.

శోకదేవతలా మసలుతున్న అక్కగారూ, కోడలిని చెండాడడమే ధ్యేయంగాపెట్టుకున్న తల్లీ, తన సపోర్టుకోసం భయంగా, బేలగా తనవైపు చూసే భార్య వీటి మధ్య నారాయణ నలిగిపోయేవాడు.

వాటిని తప్పించుకోవడానికి ఏవేవో వ్యాపకాలను కల్పించుకునేవాడు.

వయసులోనున్న భార్య, పైగా తన అవసరాలు తన పెదవిదాటి బైటకు రాకుండా నెరవేర్చే భార్యవైపు నారాయణ సహజంగానే ఆ దశలో ఆకర్షితుడయ్యాడు.

నెలలు నిండిన సరోజ పండంటి బిడ్డను ప్రసవించింది. తండ్రిని మింగిన ఆ పసివాడికి ఏ వేడుకలూ జరిపించలేదు.





జాగ్రత్తపడింది శాంతమ్మ.

పోయిన తన భర్తను ఆ పసివాడిలో చూసుకుని తన విచారాన్ని మరచిపోతోంది సరోజ. అమ్మ, అమ్మమ్మల అరచేతులలో పెరుగుతున్నాడు ఆ పసివాడు.

భారతి ఒక్కసారి కూడా వాడిని తన చేతులలోకి తీసుకోలేదు ఆ ఆరు నెలల్లోనూ.

ఆరోజు శాంతమ్మ పూజలో వుంది.

సరోజ బాత్‌రూంలో స్నానం చేస్తోంది.

ఉయ్యాల్లో బిడ్డ కక్కటిల్లిపోతున్నాడు. సరోజ సముదాయిస్తుందని శాంతమ్మ పూజలో వుండిపోయింది.

ఎంతకీ ఏడుపు ఆపకపోతుంటే గబగబా పూజకానిచ్చి సరోజ గదిలోకి వచ్చింది.

అప్పటికే పసివాడి రోదనను విని ఆగలేక భారతి చుట్టుపక్కల అత్తగారుగాని, ఆడపడుచుగాని కనిపించకపోవడంతో తన చేతులలోకి తీసుకుని సముదాయిస్తోంది.

భారతి చేతుల్లోని బిడ్డను విసురుగా లాక్కుంది శాంతమ్మ.

"అసలే ఇనుపగజ్జెల తల్లివి. నీకు పుణ్యం వుంటుంది కానీ, పసివాడిమీద మాత్రం నీ చూపు పడనీయకు తల్లీ! నీ పుణ్యమా అంటూ మా బతుకులిలా కాలిపోయినై. వాడినైనా సుఖంగా నాలుగుకాలాలపాటు బతకనీయ్" ఇన్నాళ్ల ద్వేషాన్ని వెళ్లగక్కింది శాంతమ్మ.

భారతి మొహం మాడిపోయింది.

ఈనాడు జరిగిన వాటికి తన బాధ్యత ఎంతవరకు?

ఎంత ఓర్చుకుందామన్నా అత్తగారి మాటలతో తన గుండె తూట్లు పడుతుంటే, ఎంత కాలం సహించగలదు తాను!

అసలెందుకు సహించాలి.

"వైధవ్యయోగమున్న మీ అమ్మాయిని కోడలుగా చేసుకున్న కారణంగా తన బిడ్డ తనకు దూరమయ్యాడని, మీ వియ్యపురాలు పెడుతున్న ఘోష చెవిన పడలేదా? అయినా చేసుకున్న వారికి చేసుకున్నంతమహదేవా అన్నారెండి పెద్దలు"

విసురుగా లోపలికి నడిచింది భారతి, ఆ మాటలు అనేసి.

మాటలకు కళ్లనీళ్లు పెట్టుకుంది.

శాంతమ్మ సరేసరి.

ఇన్నాళ్లూ తన మాటలకు నోరెత్తని కోడలు ఈవేళ ఇంతగా పేట్రేగిపోయినందుకు ఏంచేయాలో, ఏంమాట్లాడాలో తోచలేదు.

"బాగానే వుంది. కోరి చేసుకున్నందుకు ఈ సంబంధం" గొణుక్కుంటూ లోపలకు వెళ్లింది శాంతమ్మ.

మొదటిసారి ఎదురుతిరిగి జవాబు చెప్పడమే ఎవరికైనా కష్టం.

ఒక్కసారి అలవాటు అయితే ఇక వారిని అదుపులో పెట్టడం ఎవరి తరమూ కాదు.

కోడలు ఎదురుతిరిగే ప్రసక్తి లేకుండా శాంతమ్మ జాగ్రత్తపడి వుండవలసింది.

కాని ఆ జ్ఞానం శాంతమ్మకు లేకపోయింది.

★ ★ ★

"భారతీ... కానివేళ ఇప్పుడు పడుకున్నావేమిటి? లే లే... ఏమైంది... ఒంట్లో బాగుండలేదా?" సాయంత్రం ఇల్లు చేరిన నారాయణ తన గదిలో ముసుగుపెట్టి పడుకున్న భారతిని తట్టిలేపాడు.

మంచంమీదనుండి లేచికూచున్న భారతిని చూసి గతుక్కుమన్నాడు. ఎర్రబడ్డ కళ్లతో, ముఖం పీక్కుపోయి, చెదరిపోయిన తలతో నాలుగు లంకణాలు చేసిన మనిషిలా వుంది భారతి.

భర్తను చూడగానే బావురుమంది.

"ఏమిటి భారతి... ఏమైంది? భోజనం చేశావా? తలనెప్పిగా వుందా? జ్వరం వచ్చిందా?"

ఆరాటంగా తల, ఒళ్లూ పట్టిచూస్తున్న భర్తను చూసి భారతి మనసు చల్లబడింది.

తన భర్త తనకు అండగా వుంటే ఇక అత్తగారినీ, ఆడపడుచునీ లెక్కపెట్టవలసిన అవసరం ఏమిటి?

ఇంకా తను కాబట్టి ఇన్నాళ్లూ మర్యాదకు కట్టుబడి, తన అత్తగారి ప్రవర్తనను తన భర్తకు చెప్పలేదు. లేకపోతే ఆవిడ నోరు మూ



యించడం ఎంతసేపు?

"ఏమిటి భారతీ... మాట్లాడవ్? మీ ఇంటి మీద బెంగపెట్టుకున్నావేమిటి?"

భర్త మాటలతో ఈ లోకానికి వచ్చిన భారతి అతన్ని పట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

నారాయణ చాలాసేపూ ఓదారుస్తూ వుండి పోయాడు.

ఎప్పటికో తేరుకున్న భారతి నెమ్మదిగా జరిగిన సంఘటనలు నారాయణకు చెప్పింది. తర్వాత ఇన్నాళ్లుగా జరిగిన సంఘటనలన్నీ వివరించింది.

అలా అనుమానపు విత్తు నాటింది భారతి- నారాయణ హృదయంలో.

ఆ మొక్క మొలిచి మహావృక్షం కావడానికి కొంతకాలం పడుతుంది.

సరోజకు బిడ్డ పుట్టిన వెంటనే ఆమెకు అత్తవారింటితో తెగతెంపులు చేసి, అక్కడ బాబుకి వచ్చిన ఆస్తిని స్వాధీనం చేసుకుని, అక్క అనుమతితోనే తన మేనల్లుడికి సంరక్షకుడిగా వుండి వ్యవహారం నడిపించసాగాడు నారాయణ.

అక్కడి ఆస్తి అమ్మి తన వూరిలోనే పొలంకొని మరింత మోతుబరి అయ్యాడు.

★ ★ ★

రానురానూ శాంతమ్మకూ సరోజకూ, భారతి ధాటికి తట్టుకోవడం కష్టంగా వుంది. క్రమక్రమంగా ఇంటి పెత్తనం అంతా కోడలి చేతిలోకి వెడుతుంటే నిస్సహాయంగా చూస్తూ వుండిపోయింది శాంతమ్మ.

అత్తగారు ఇనుపగజ్జెల తల్లివి అన్నరోజు నుండి భారతి మళ్లీ వసవాడి జోలికి వెళ్లలేదు. అప్పట్నించీ అత్తగారినీ, ఆడపడుచునీ లక్ష్య పెట్టడం మానేసింది.

అయితే వంటింట్లో సైతం కోడలు పెత్తనం చెలాయించడం మాత్రం సహించలేకపోయింది శాంతమ్మ.

సహించలేకపోతే వేరే ఇల్లు ఏర్పాటు చేసుకుని తల్లీ కూతుళ్లు నిరభ్యంతరంగా అక్కడే వుండవచ్చనని మాట వచ్చింది.

ఆ మాట భారతి వద్దనుండి కాదు... నారాయణ వద్దనుండే.

ఇక తల్లీ కూతుళ్లకు నోరెత్తే అవకాశం లేకుండా పోయింది.

శివాలయంకి వెళ్లడంతోనూ, పురాణ కాలక్షేపంతోనూ రోజులు గడపడం ప్రారంభించారు ఆ ఇద్దరూ.

ఇంతలో తన కొబ్బరితోట ఇళ్లస్థలాల కోసం ఎవరో హరిజనులు అర్జీ పెట్టుకుంటున్నారని తెలియవచ్చింది నారాయణకు.

వెంటనే తన వద్ద పనిచేస్తున్న రంగయ్యను చేరదీసి అతనిచేత అప్లికేషన్ పెట్టించాడు.

ఆ స్థలం అతనికే వచ్చేటట్లు ప్రయత్నం చేశాడు. తనేమో గవర్నమెంటు వద్దనుండి రెమ్యునరేషన్ తీసుకున్నాడు.

తన పొలంలో వుండే తాటిమట్టలతోనూ, కొబ్బరి ఆకులతోనూ చిన్న ఇల్లు తనే వేయించి ఇచ్చాడు నారాయణ.

తన ఇల్లు నిలబెట్టిన దేముడిగా నారాయణను తలచాడు రంగయ్య. అయినా నారాయణ నెలానెలా పచ్చికొబ్బరికాయలు దించుకుంటూ, అమ్ముకుంటూ వుంట వాటపై తనకధికారం వుందని ఎలా చెప్పాలో తెలియలేదు రంగయ్యకు.

అయినా ఇల్లు తనది, ఆ స్థలంలో పండించుకుంటున్న కూరగాయలు తనవి. అవి అమ్ముకుంటేనే తన బతుకు గడిచిపోతుందని సంతోషపడ్డాడు రంగయ్య.

కాని, ఆ రోజున నారాయణ తోటతోపాటు దానిని ఆనుకుని వున్న స్థలాన్ని కూడా ఎవరో కొనుగోలుదారులు వచ్చి పరీక్షగా చూస్తుంటే కంగారు పడ్డాడు రంగయ్య.

నారాయణ వూళ్లో లేడు కాబట్టి వారికి తెలియక వచ్చారని అప్పటికి సరిపెట్టుకున్నాడు.

నారాయణ వూరినుండి వచ్చిన వెంటనే రెక్కలు కట్టుకుని అక్కడ వాలాడు.

రంగయ్య గోడు విన్న నారాయణ నిదానంగా అన్నాడు-

"అసలా భూమిని అమ్మకూడదనే అనుకున్నానయ్యా! కానీ హైదరాబాద్‌లో స్థలం కొంటున్నాను. డబ్బుకి కటకట వచ్చింది. అమ్మక తప్పడంలేదు. పోనీ నువ్వే తీసుకునేటట్టయితే చెప్పు. పదివేలు ఖరీదుచేసే ఆ భూమిని నీకు నాలుగువేలకే ఇచ్చేస్తాను. ఇన్నాళ్లూ కనిపెట్టుకున్నావన్న అభిమానంకొద్దీ ఆ నష్టం భరించుకుంటాను"

రంగయ్య నిర్ఘాంతపోయాడు.

"అదేమిటి బాబుగారూ... ఆ భూమి ఇళ్లస్థలానికని నా చేత పట్టా పెట్టించుకున్నారుగా?"

పగలబడి నవ్వాడు నారాయణ. "మంచివాడివే. మన గవర్నమెంటుతో పనులు అంత త్వరగా తెమిలితే, ఇక కానిదేముంది! నీ అప్లికేషను ఇంకా ప్రభుత్వం దగ్గిరే ఉండిపోయింది. ఎప్పుడో వాళ్లకు దయకలిగినప్పుడు బైటకు వస్తుంది లేదా ఈపాటికే చిత్తుబుట్టలో పడేశారేమో? నేనింకా అవకాశం ఉన్నంతవరకూ చెబుతూనే ఉన్నాను, కానీ పని జరగలేదు"

"అదేమిటి బాబుగారూ... పట్టా వచ్చేసిందన్నారుగా?" రంగయ్యకు భూమిలో కూరుకుపోతున్నట్లుగా ఉంది.

"ఏదీ... నీ దగ్గరేమైనా కాగితాలున్నాయా?"

[illegible]
వేయడంతప్ప రంగయ్యకింకేమీ తెలియదు. అన్నీ నారాయణే చూసుకున్నాడు. అయ్యగారన్న కాగితాలేమైనా ఉంటే ఆయన దగ్గరే ఉండాలి. ఆ మాటే అన్నాడు రంగయ్య.

"బాగానే ఉంది. ఏదో పుణ్యానికి పోతే పాపం ఎదురైనట్లు ఇదంతా చివరికి నా నెత్తిన చుడుతున్నావేమిటి? ఏదో నా మనిషివి కదా అని నేను కల్పించుకుని దగ్గరుండి పెట్టించాను. పట్టా ఏమైనా ఇస్తే నీకే ఇస్తారుగానీ నా చేతికి ఇవ్వరు. అయినా నీకు పట్టాయిచ్చి ఉంటే, ప్రతినెలా నేను కొబ్బరికాయలు దింపుకుంటూ ఉంటే చూస్తూవూరుకునే జాతా మీది? అంతగా ఆ స్థలం మీద నీకు మోజు ఉంది కాబట్టి నాలుగు వేలు ఇచ్చి నీపేర ఆ స్థలం రిజిస్టర్ చేయించుకో, లేదా పైవారికి అమ్మివేయకతప్పదు" ఖండితంగా చెప్పాడు నారాయణ.

రంగయ్య కృంగిపోయాడు. ఎట్లాగూ భూమి తనదేననే ఆశతో ఆఇంటికి ఎన్నో హంగులు ఏర్పరచుకున్నాడు. కూరగాయల మొక్కలన్నీ కాపుకి వచ్చి ఉన్నాయి. ఈ స్థితిలో తోటను యజమానికి అప్పచెప్పడమా?

నారాయణకు ఎదురుతిరిగి ఆ ఊళ్లో బతికే ధైర్యంలేక తనకున్న రెండు పాడిగేదెలను, భార్య మెడలో మంగళసూత్రాలను అమ్మి నారాయణకు నాలుగు వేలూ సమర్పించుకున్నాడు రంగయ్య.

★ ★ ★

ఆ సంవత్సరం నారాయణ తమ భవంతి పైకప్పు తీసి స్లాబు వేయించి పైన రెండు గదులు కట్టించాడు. పైన వాటాకు టాంకు కట్టించి పైపులైను పెట్టించాడు. ఇంట్లో అధునాతన పరికరాలన్నీ చోటుచేసుకుంటున్నాయి.

కాలక్రమంలో అత్తాకోడళ్ల మధ్య కూడా సఖ్యత పెరుగుతోంది. తన భర్తతోనే తన అధికారం పోయిందని సరిపెట్టుకుంది శాంతమ్మ.

తండ్రి హయాంలోకంటె నారాయణ హయాంలోనే ఆధునిక పరికరాలు ఇంట్లో చోటుచేసుకున్నాయి. రెండు చేతులా డబ్బు సంపాదిస్తున్నాడు. ఊళ్లో పెద్దమనిషిగా చలామణీ అవుతున్నాడు- అని తృప్తిపడింది సోదరి.

ఆ రోజు మేడపై గదిలో నుండి బైటకు వచ్చిన నారాయణకు వాటర్‌టాంకులోకి దిగి అట్టడుగున ఉన్న నీళ్లతో కేరింతలు కొట్టుకుంటూ ఆడుతున్న ఆ పసివాడిని చూడగానే గుండె గుభేలుమంది.

నిజంగా టాంకు నిండుగా నీళ్లు ఉండి వుంటే?

నౌకర్లు నిర్లక్ష్యంగా వాటరు టాంకుపై మూతవేయడం మరచిపోయి వెళ్లి పోయారు. నారాయణలో ఏదో భావం కదలాడింది- అతని కళ్లు మెరిశాయి.

కిందకు దిగి డైనింగు టేబులుముందు కూర్చుని కాఫీ, టిఫినూ తీసుకున్నాడు. పక్కనే ఉన్న సింకు దగ్గర చేతులు కడుక్కున్నాడు. నీళ్లు సరిగా రావడంలేదు.

"పోలయ్యా! నీళ్లు సరిగా రావడంలేదు. మోటారు స్విచ్చివెయ్యి"

టవలు హేంగరుకు తగిలిస్తూ పోలయ్యకా పని పురమాయించి ఊళ్లోకి నడిచాడు నారాయణ.

ఆ సంవత్సరమే ఊళ్లో హైస్కూలు పెట్టించడానికి పెద్దలందరూ నిర్ణయించారు. ప్రెసిడెంటుగారింట్లో మిగిలిన వూరి పెద్దలతో ఆ విషయమే మాట్లాడుతూ ఉండగా పోలయ్య వగరుస్తూ పరిగెత్తుకు వచ్చాడు అక్కడికి.

"బాబుగారూ... మన చంటిబాబు నీళ్ల టాంకులో పడిపోయారయ్యా, చచ్చిపోయారు. అక్కయ్యగారు తెలివిలేకుండా పడివున్నారు"

కబురు వింటూనే ఒక్క పరుగున ఇల్లుచేరాడు నారాయణ.

ప్రాణంలేని ఆ పసివాడి శరీరాన్ని ఒడిలోకి తీసుకుని గుండెలు పగిలేటట్లు ఏడుస్తోంది శాంతమ్మ. స్పృహలేని సరోజకు తెలివితెప్పించడానికి ఉపచర్యలు చేస్తోంది భారతి.

ఒక్కక్షణం నారాయణ గుండె కలుక్కుమంది.

మరుక్షణంలోనే సర్దుకున్నాడు.

వాడిని నీళ్లటాంకులో చూసిన వెంటనే స్విచ్ ఆన్ చేయమనలేదు తను. వాడికి బతికే



యోగమేఉంటే ఆ టాంకు లోంచి బైటకు వచ్చి ఉండేవాడు లేక ఎవరి కంటనైనా పడి ఉండేవాడు. నిజానికి వాడు టాంకులో నుండి బైటకు వచ్చి ఉంటాడనే అనుకున్నాడు తను. పోలయ్యతో స్విచ్ ఆన్ చేయమని చెప్పేసరికి అరగంట- అరగంటేమిటి- గంటకుపైగానే గడిచింది. అంతసేపూ వాడు ఆ టాంకులోనే ఉంటాడని కలగన్నాడా తాను. అయినా ఈ ఆడవాళ్లు అంతసేపు ఆ పసివాడేమైపోయాడో చూసుకోవద్దూ? అయినా వాడికి ఆయుర్దాయ ముంటే ఇలా ఎందుకవుతుంది? విధి రాత తప్పించుకోవడం ఎవరితరం? వాడికలా రాసిపెట్టి ఉంది? అంతే!

అదీ అతని సమర్థన.

భర్తపోయి, కొడుకుపోయి సరోజ మళ్లీ తేరు కోలేదు.

సరోజ కొడుకు పోయిన వెంటనే తాను సంరక్షకుడిగా ఉండి అతని పేర కొన్న ఆస్తిని అమ్మకానికి పెట్టేశాడు.

భర్తపోయిన కొత్తలో బైటకు రావడానికి మొహం చెల్లని సరోజ నారాయణకు 'జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ' రాసి ఇచ్చింది. కాబట్టి ఇప్పుడు ఆస్తి అమ్మకానికి సరోజ అనుమతి తీసుకోవలసిన అవసరం లేకపోయింది.

"సరోజ ఆస్తిని అమ్మకానికి పెట్టావటగా? అంత మంచి పొలాన్ని అమ్మడమెందుకంటు న్నారు దశరథరామయ్యగారు"

భోజనం చేస్తున్న కొడుకుని కదిపింది శాంత మ్మ.

"మీ ఆడవాళ్లకి వ్యవహారాలేం తెలుస్తాయి. ఇక ఆ దశరథరామయ్య పూర్వకాలం మనిషి, వ్యవహార జ్ఞానం లేనివాడు. ఈ పిల్లవాడు పోవడంతో ఆస్తి సరోజ అత్తవారికి చెందు తుంది- పిల్లవాడి పేరున ఉందికాబట్టి. ఆస్తి అంతా అత్తవారికి కట్టబెట్టి, సరోజకు డబ్బు అవసరమైతే ఎవరిముందు చేయి చాపు తుంది. అక్కకు తిండిపెట్టడం నాకు కష్టమని కాదు. కానీ నిండా ముప్పై ఏళ్ళు పూర్తికాలేదు. అసలు జీవితం ముందేవుంది. తనకంటూ ఆస్తి ఉంటే ఆ ధైర్యం వేరు. అందుకని పిల్లవాడిపేరన ఉన్న ఆస్తి అమ్మి సరోజ పే రున కొంటున్నాను అన్నాడు"

కొడుకు మాటలకు, తెలివితేటలకు మురి సిపోయింది శాంతమ్మ.

కాని నారాయణ కొన్న పొలాలను సరోజ పేరునగాక తన పేరనే రిజిస్టర్ చేయించుకు న్నాడన్న విషయం ఆ తల్లీకూతుళ్లకేకాక భార తికి కూడా తెలియదు.

"పూసుకు చేస్తుంటే ఇలాగే ఉంటుంది. మనకెందుకని వదిలేస్తే ఆ అత్తవారింట్లో వంటమనిషిలా బతుకుతూ ఉండేది. వాళ్ల మంచి కోసమే మనం ఇలా చేస్తుంటే మనమే దో తినేస్తున్నట్లు మీ అమ్మ ఆరాలు అడుగు తోంది" అన్న కోడలి రుసరుసలకు శాంతమ్మ నోరు మూతబడింది.

★ ★ ★

"బాబూ నారాయణా... అక్క పరిస్థితి ఏమీ బాగోలేదురా! ఒక్కసారి పట్నం తీసుకువెళ్లి డాక్టరుకి చూపిస్తే...." అంది శాంతమ్మ ఓరోజు ఆదుర్దాగా.

"మానసిక అశాంతికి డాక్టర్లేం చేస్తారమ్మా? అయినా అస్తమానం అలా మంచంమీద పడు కుని లేనిపోని ఆలోచనలతో కాలక్షేపం చేసుకో కపోతే, ఇంట్లో పనిపాటలు చూసుకుంటే కాస్త కాలక్షేపమైనా అవుతుందిగా" విసురుగా అన్నాడు నారాయణ.

"ఈ ఇంట్లో పనివారికేం లోటు లేదులే నాయనా! అసలే సహించచ్చి బతుకుతోందది. అది లేచి పనిపాటలు చేసుకుంటేగాని గడ వని ఇల్లుగాదు" నిష్ఠూరంగా అంది శాంతమ్మ.

"మీ ఆడవాళ్లకసలు ఏదీ సక్రమంగా అర్థం చేసుకోవడం అలవాటు ఉండదు. కాస్త వ్యాపకం ఉంటే మంచిదని నేనంటే, నువ్వింకో అర్థంలో మాట్లాడుతున్నావు. సరే... నీ ఇష్టప్రకా రమే సరోజను పట్నం తీసుకువెళ్లి డాక్టరుకి చూపిస్తాను. అయినా అసలు విచారంలో ఉన్న మనిషికి, ఆ విచారాన్ని మరిచిపోయేటట్లు చేయాలి! నువ్వేమో మళ్లీ మళ్లీ అదే విషయా న్ని ఎత్తుకుని ఆవిడ మరచిపోదామన్నా మర చిపోలేకుండా చేస్తున్నావ్. అసలు నీఛాదస్తం తగ్గితేకానీ ఆవిడ తేరుకోదు"

కొడుకు మాటకు నోరు నొక్కుకుంది శాంత మ్మ.

కన్నకూతురు పుట్టెడు దుఃఖంతో ఉంటే




ఓదార్చడం ఛాదస్తమా?

దాని జీవితం ఇలాగై పోయిందని విచారించడం నేరమా?

సరోజతో భర్త సంగతీ, బిడ్డ సంగతీ మాట్లాడటం మానేసినంత మాత్రాన అది ఆ బాధ మరచిపోతుందా?

మనసులో బాధ ఏదోవిధంగా బైటకు రావాలిగాని, లోలోపల దాచుకుంటే మనసు తూట్లు పడిపోదూ! ఏమిటో అతితెలివితేటలు-

అని నొచ్చుకుంది శాంతమ్మ

★ ★ ★

నారాయణ ఊరువెళ్లిన మరునాడు శాంతమ్మకు హఠాత్తుగా నూటనాలుగు టెంపరేచరు వచ్చింది.

విపరీతమైన చలి, కుదుపుతో పరాకు మాటలు కూడా ప్రారంభించింది. అసలే మనసు చెదిరిఉన్న సరోజ తల్లిని చూసి విరుచుకుపడిపోయింది.

ఆ తల్లీకూతుర్లిద్దరినీ చూసిన భారతి కంగారుపడి పట్నం వెళ్లి డాక్టరును తీసుకురమ్మని మనిషిని పంపించింది. ఈలోగా ఎందుకైనా మంచిదని ఆచార్యులగారికి కబురు చేసింది.

"ఏమీ ఫరవాలేదు! శాంతమ్మగారిది మలేరియా. ఎటూ పట్నం నుండి డాక్టరుగారు వస్తున్నారుగా! మందులు వాడితే తగ్గిపోతుంది. ఇక మీ ఆడబడుచు సరోజ మానసికంగా దెబ్బతిని ఉంది. కాలమే ఆవిడ మనస్సుకు కలిగిన గాయాన్ని మాన్పాలి" అన్నారు ఆచార్యులుగారు.

తల్లీకూతుళ్లిద్దరూ తేరుకున్నాక ఆచార్యులుగారు వెళ్ళిపోయారు.

పట్నం నుండి టాక్సీలో యం.బి.బి.యస్. డాక్టరు వచ్చారు. ఆచార్యులవారు చెప్పిందే తనూ చెప్పి మందులు రాసి ఏవేవి ఎప్పుడు వాడాలో చెప్పారు.

సరోజను కూడా డాక్టరుకి చూపించి పరీక్ష చేయించింది భారతి.

"జబ్బేమీ లేదమ్మా! అనవసరమైన ఆలోచనలేమీ పెట్టుకోకుండా ఏదో వ్యాపకం కల్పించుకోండి. బలానికి మందులు వాడుతూ ఉండండి" అని సరోజకు సలహాఇచ్చి ఫీజు వసూలుచేసుకొని వెళ్లిపోయాడు పట్నం డాక్టరు.

"తీరి కూర్చుని లేనిపోని ఆలోచనలతో ఆవిడ బాధపడి ఎదుటివారిని బాధపెట్టడం దేనికి? శంఖంలో పోస్తేనే కాని తీర్థం కాదనీ, డాక్టరు అన్న మాటలే ఆయనంటే, నిన్నా ఈరోజు సణుగుతూనే ఉన్నారు. ఇప్పుడేమైంది? ఆయనన్నదే నిజమైంది"

వంటమనిషి రంగమ్మతో భారతి అంటున్న మాటలు పక్క గదిలో మంచంమీద పడుకుని ఉన్న తల్లీకూతుర్లిద్దరికి వినిపిస్తూనే ఉన్నాయి.

మరునాడే వంటమనిషి రంగమ్మ అల్లుడికి జబ్బుచేసిందన్న కబురు వస్తే అప్పటికప్పుడు కబురు తెచ్చిన మనిషితో వెళ్లిపోయింది.

ఇంట్లో వంటపనీ, మంచంమీదనుండి లేవలేని అత్తగారికి పరిచర్యలూ, దానికితోడు ఆడబడుచుకి మంచందగ్గరే కాఫీ, ఫలహారాలు దగ్గరనుంచి అందించవలసి రావడంతో ఎంతమంది పనివారున్నా భారతి నలిగిపోయింది.

"ఈ ఇంట్లో నాకుతప్ప అందరికీ రోగమే. అయినా చేసిపెట్టేవారుంటే ప్రతివాళ్లూ మంచాలను అంటిపెట్టుకునే ఉంటారు. ఒక్క మనిషి ఇంతమందికి చాకిరీ చేయలేదనే జ్ఞానం ఎవరి మట్టుకు వారికుండాలిగానీ..." అనే భారతి సణుగుడు మాటలు సరోజకు ములుకుల్లా తగిలాయి.

"అదేమిటి... కాఫీ మీరుపెట్టడం దేనికి- నేను వస్తానుగా! పుట్టెడు దుఃఖంలో ఉన్న ఆడబడుచు చేత అడ్డమైన చాకిరీ చేయిస్తున్నానని అందరూ నన్నాడిపోసుకోడానికా?" అంది భారతి.

మరునాడు ఉదయం భారతి మొహం కడుక్కొని వంటింట్లోకి వచ్చేసరికి కాఫీకాచి తల్లికిచ్చి మళ్ళీ వంటింట్లో పని చూసుకొంటోంది సరోజ.

"భారతిని చూసి దయచేసి విపరీతార్థాలు తీయకు వదినా, నాకూ కాలక్షేపం", ముక్తసరిగా అని కత్తిపీట ముందు కూర్చుని కూరలు తరగడం ప్రారంభించింది సరోజ.

అసలే సన్నగా, పొట్టిగా ఉండే సరోజ ఈమధ్య మరింత చిక్కిపోయింది. దిగులుతో కళ్లు లోపలికిపోయి ఎముకలు బైటకు పొడుకువచ్చి ఎముకల గూడులా తయారైంది. మరదలి మాటలకు పౌరుషం వచ్చి పళ్ల బిగువున పనిపాటలు చూస్తోందేగానీ నాలుగు అడుగులు వేసేసరికి గుండెదడ, ఆయాసం ముంచుకొచ్చి వారంరోజులు గడిచేసరికి మంచమెక్కింది. ఈలోగా శాంతమ్మ ఆరోగ్యం చక్కబడింది. కాస్త నీరసంగా ఉన్నా ఇంట్లో అటూఇటూ తిరుగగలుగుతోంది.

రంగమ్మ తిరిగి వచ్చినరోజే నారాయణ కూడా హైదరాబాదు నుండి తిరిగి వచ్చేశాడు.

మంచంపట్టిన సరోజ మళ్లీ తేరుకోలేదు.

కూతురుని రక్షించుకోవాలనే తాపత్రయం శాంతమ్మకు ఎంతగా వున్నా కొడుకు నిర్లక్ష్యం, డాక్టర్లు ముందుగానే అన్నమాటలు నిరాశ కలిగించాయి.

ఆరు నెలలు మంచం పట్టిన సరోజ భర్తనూ కొడుకునూ వెతుక్కుంటూ వెళ్లిపోయింది.

దానితో సరోజ ఆస్తి గురించి ప్రశ్నించేవారు కూడా లేకపోయారు.

ఆ ఆస్తిని స్వాధీనంచేసుకున్న నారాయణ మరింత మోతుబరి అయ్యాడు.

చేయగలిగిందేంలేక సరోజ అత్తవారు మౌనం వహించారు.




డబ్బు సంపాదించాలనే తపన అన్ని వ్యసనాలలోకి ప్రమాదకరమైనది.

ఎన్నిరకాలుగా ఆస్తి కలసి వచ్చినా, ఇంకా డబ్బు సంపాదించాలనే తపన మాత్రం నారాయణలో తగ్గలేదు. రకరకాల వ్యాపారాలలో పెట్టుబడిపెట్టేవాడు. ఎందులో ప్రవేశించినా నారాయణకి ఆర్థికంగా కలసి వస్తూనే వుంది.

ఈ అయిదేళ్లలో నారాయణ ఇద్దరి బిడ్డల తండ్రి అయ్యాడు.

తల్లి శాంతమ్మ నాలుగురోజుల విషజ్వరంతో కన్నుమూసింది.

చివరిరోజులు శాంతమ్మకు బాగానే గడిచాయి. కొడుకు ప్రయోజకుడు కావడం, మనుమలతో కాలక్షేపం.

దానికితోడు చివరిరోజులలో అత్తాకోడళ్ల మధ్య సయోధ్య కుదిరింది.

ఈమధ్య నారాయణ హైదరాబాదులో ఇళ్ల స్థలాలు కొనడం, అమ్మడం ప్రారంభించాడు. ముగ్గురు స్నేహితులు ఈ బిజినెస్‌లో తోడయ్యారు.

ఈమధ్య చవగ్గా దొరికిన భూమిని పెద్ద మొత్తంలో కొని ప్లాట్స్ చేసి అమ్మకం ప్రారంభించాడు. మిగిలిన బిజినెస్‌లకంటే ఇదే లాభసాటిగా కనిపించింది నారాయణకు.

మధ్యమధ్య నారాయణ ఫ్రెండ్సు వస్తూనే వున్నారు. వారు వచ్చినప్పుడల్లా ఊరవతల నారాయణ తోటలోని గెస్ట్‌హౌస్‌లో విడిది ఏర్పాటవుతుంటుంది. నారాయణ తోటలోనే వారితో గడిపి మరునాడు ఉదయం ఇంటికి చేరుకునేవాడు. వారి జల్సాలకు కావల్సినవన్నీ పట్నంనుండి తెచ్చుకునేవారు.

అందువలన చీకటి పడుతూనే చుక్క వేసుకుని పడుకునే ముసలి వీరయ్యకు బంగళాలో జరిగే హడావుడి తెలిసేది కాదు. ఉన్న ఒక్క కూతురూ అత్తవారింటికి వెళ్లిపోయి ఒంటరివాడయ్యాడు వీరయ్య. అందువల్ల బంగళాలో జరిగే హడావుడి బైట జనాలకు తెలిసే అవకాశం లేకుండాపోయింది. అందులోనూ ఇప్పుడు నారాయణ ఊళ్లోని పెద్దమనుషుల్లో ఒకడు. ఊరి బాగుకోసం డబ్బు సాయానికైనా, మాట సాయానికైనా ముందుకు వచ్చే నారాయణ గురించి చెడుగా చెప్పుకునే ధైర్యం ఆవూరి జనానికి లేదు.

ఆరోజు సాయంత్రం తోటలోని బంగళా కలకల్లాడిపోతోంది. ఆరోజు సాయంత్రమే




వచ్చారు నారాయణ మిత్రులైన కంట్రాక్టర్స్ గోపాలరావు, కనకరాజులూ, బిజినెస్ మాగ్నట్ కృష్ణమూర్తీ.

రాత్రి ఎనిమిది గంటలకు నారాయణ ఇంటినుండీ మామూలుగానే కారియర్స్ వచ్చాయి.

తాము తీసుకువచ్చిన సీసాల కోసం ఆ గదిలోకి వచ్చిన కృష్ణమూర్తి కిటికీలో నుంచి తోటమాలి ఇంటి ఆవరణవైపు చూస్తూ అలాగే నిలబడిపోయాడు.

తోటమాలి ఇంట్లో లైటు వెలుతురులో మెరిసిపోతోంది ఒక పద్ధెనిమిదేళ్ల అమ్మాయి.

"ఎవరు గురూ! మీ తోటమాలి ఇంట వనదేవత వెన్నెల విహారానికి వచ్చినట్లుందే. నిజంగా కళ్లు తిప్పుకోలేమనుకో" అన్న కృష్ణమూర్తి మాటలకు మిగిలినవారంతా అటువెళ్లి చూసి వచ్చారు.

అప్పుడే అవుట్ హౌస్‌నుండి బైటకువచ్చి మళ్లీ లోపలకు వెళ్లిపోయింది ఆ యువతి. నిండు పౌర్ణమినాటి పండు వెన్నెలలో ఆమె నిజంగా దివినుండి భువికి దిగివచ్చిన అప్సరసలాగే కనిపించింది, వారికి.

"ఆ పిల్లా... వీరయ్య కూతురు. అది పుట్టినప్పుడే వాళ్ల అమ్మ వాతం కమ్మి చచ్చిపోయింది. రెండేళ్లక్రితమే పెళ్లిచేసి అత్తవారింటికి పంపించి వేశాడు. ఇప్పుడా పిల్ల తండ్రిని చూసిపోవడానికి వచ్చింది కాబోలు" పేక ముక్కలు పరుస్తూ మామూలుగా అన్నాడు నారాయణ.

"అబ్బ... అంతటి అందాన్ని ఎదురుగా ఉంచుకుని, చూస్తూ చూస్తూ ఎలా వూరుకున్నావయ్యా నారాయణా?" అన్నాడు కనకరాజు.

అప్పటికే అతను స్వర్గలోకంలోకి వెళ్లిపోయాడు.

"అబ్బ... ఆ అందాన్ని స్వంతంచేసుకోవడానికి ఎంత డబ్బు ఖర్చైనా సరే ఫరవాలేదు"

డబ్బుతో ప్రతిదీ స్వంతంచేసుకోగలమన్న అహంభావంగల కృష్ణమూర్తి అన్నాడు.

"ఆ... మనవాడెపుడో ఒకచూపు చూసివుంటాడు. సామాన్యుడనుకున్నారేమిటి? ప్లాను వేసేడంటే దానికి తిరుగువుండదు. మూడో వాడి కంటపడడు"

కాలేజీలో నారాయణతో కలసి చదువుకున్న గోపాలరావు కామెంట్ చేశాడు.

"అయితే మాకు కూడా ఒక ఛాన్స్ ఇప్పించవయ్యా బాబూ! నీమేలు మరచిపోలేం" కృష్ణమూర్తి దృష్టిలో ప్రతి స్త్రీ తనకోసం జన్మించిన ఒక గోపికే.

"బాబ్బాబు... మాకూ ఆ భాగ్యం కలిగించు. నీవు తలచుకుంటే సాధించలేని దేముంది?" అంటూ ముగ్గురూ ఊదరగొట్టేస్తున్నారు, నారాయణని.

తన కళ్లముందు పుట్టిపెరిగిన వీరయ్య కూతురు చుక్కమ్మపై ఏనాడూ నారాయణకు ఆ దృష్టిలేదు. కానీ వీరి ప్రోత్సాహంతో ఆ చూపు వచ్చింది- గబగబా ప్లాను ఆలోచించాడు.

వీరయ్యను పిలిచాడు నారాయణ.

"చూడు వీరయ్యా... మనవాళ్ళకి ఈరోజు మందుపడితేనేగాని పని జరగదట. వాళ్లు తీసుకువచ్చిన బాటిల్స్ ఖాళీచేసేశారు. కాస్త టౌనుకి వెళ్లి కాగితం మీద ఏమేం కావాలో రాసి ఇస్తారుగానీ తీసుకురా. రైల్వేస్టేషను దగ్గర షాపులో తీసుకో. మనకు తెలిసినవాడేలే. నేను పంపించానని చెప్పు. మంచి సరుకు ఇస్తాడు. అలాగే సెంటర్‌లో హొటల్ ఉంది చూడు... అక్కడనుండి ఏమైనా తినడానికి తీసుకురా- ఇదిగో డబ్బు" అంటూ రెండు వందల రూపాయల నోట్లు వీరయ్య చేతికి అందించాడు.

వీరయ్య సందేహించాడు. టౌనుకి వెళ్లి రావాలంటే ఏడెనిమిది మైళ్ల దూరం. ఎంత లేదన్నా రెండు మూడు గంటలకు తక్కువ పట్టదు. అంతవరకూ తన కూతురు ఒంటరిగా....?

అయినా ఈ వూరిలో తన కూతురికి భయమేమిటి? అందులోనూ దేమునిలాంటి బాబుగారు ఇక్కడే వుండగా- అనుకున్నాడు ఆ తర్వాత.

"ఏమిటంత ఆలోచనలోపడ్డావ్... త్వరగా వెళ్లు"

వీరయ్యకు మళ్లీ మాట్లాడటానికి అవకాశం ఇవ్వలేదు నారాయణ.

యజమాని మాటకు ఎదురుచెప్పలేని వీరయ్య, అతనందించిన రెండు వంద రూపాయల నోట్లను అందుకుని తలవంచి చీటీతోపాటు బైటకు నడిచాడు.

పున్నమి వెన్నెలతో మనోహరంగా వున్న ప్రకృతిని క్రమంగా కారు మబ్బులు కమ్ముకున్నాయి. వర్షం వచ్చేటట్లు గాలి వీస్తోంది.

"అబ్బ... వర్షం వచ్చేటట్లుంది. వాతావరణం కూడా మనకు అనుకూలంగానే వుంది. కాస్త తొందరగా ఆ పిల్లను పిలువయ్యా బాబూ! లేకపోతే వర్షం వచ్చేటట్లుంది" అన్నాడు కృష్ణమూర్తి.

హడావుడిగా కిందకు దిగాడు నారాయణ.

"చిటపట చినుకులు పడుతూ వుంటే, వెలికాడు సరసన లేడని చింతించే ఆడపిల్ల మన సరసకు రాబోతోంది" అన్నాడు కనకరాజు.

"చుక్కమ్మా" నారాయణ పిలుపుకి తలెత్తి చూసింది నిద్రలోకి జారిపోతున్న చుక్కమ్మ.

అయ్యగార్ని చూసి రెండు చేతులు

[illegible]

అయ్యా బంగళాలోనే వున్నాడుకదండీ'' అంది- నారాయణ వచ్చింది తన తండ్రి కోసమే అనుకున్న ఆ అమాయకురాలు.

''మీ అయ్యా పనిమీద ఊళ్లోకి వెళ్లాడు. పైన గది మరీ గలీజుగా వుంది. ఒక్కసారి వచ్చి శుభ్రం చేసి వెళ్లు''

గిరుక్కున వెనుదిరిగాడు నారాయణ.

మారు మాట్లాడలేని చుక్కమ్మ గొర్రెలా నారాయణను అనుసరించింది.

పులి గుహలోకి వెళ్లిన మేకపిల్ల ఎన్నడూ ప్రాణాలతో బయట పడదు. చుక్కమ్మ ఆ అనుభవజ్ఞులముందు మేకపిల్ల కంటే అధికురాలేమీ కాదు.

వర్షం పెద్దదయింది.

వర్షం భోరున కురుస్తుంటే, ఉరుములూ, మెరుపులతో ప్రకృతి విలయతాండవం చేస్తుంటే అదే అదనుగా చుక్కమ్మ బతుకును నలుగురి కామాగ్ని దహించి వేసింది. తన ఎదుటే బలియైన చుక్కమ్మను చూసి బాధపడుతున్నట్లే ఆకాశం భోరున విలపిస్తూ ఉంది.

సునాయాసంగా పరాయి స్త్రీని లోబరుచుకున్న తమ ప్రతాపానికి మురిసి పోయారు ఆమిత్రులు నలుగురూ.

చుక్కమ్మ ఇంకా గదిలోనే వుండిపోయింది. తమ అవసరం ఎటూ తీరిపోయింది కాబట్టి వీరయ్యా వచ్చేలోగానే చుక్కమ్మను ఇంటికి సాగనంపడం మంచిది.

సిగ్గు విడిచి చెప్పుకోలేదు కాబట్టి ఈ విషయం తమ మధ్యనే వుండి పోతుంది.

కోరిన ధనమిస్తాననీ,జరిగిన విషయం తమను దాటి బైటకు రాదనీ, కాబట్టి చుక్కమ్మకు వచ్చే ప్రమాదం ఏమీ లేదనీ, జరిగిన విషయం వెల్లడి చేసి అల్లరి పడవద్దనీ చెబుదామని పడక గదిలోకి వచ్చిన నారాయణకు కట్టెలా మిగిలిపోయిన చుక్కమ్మ కనిపించింది.

చుక్కమ్మప్రాణాలు ఎప్పుడో పంచభూతాలలో కలసి పోయాయి. ఆ విషయం కామంతో కళ్లు మూసుకుపోయిన ఆ నలుగురు మిత్రులూ గ్రహించలేక పోయారు.





విషయం తెలుసుకుని మిత్రులంతా కంగారుపడ్డారు.

ఎలా ఈ విషయం కప్పిపుచ్చడం.

ఈలోగా వీరయ్యా తిరిగివచ్చేస్తే?

నలుగురూ సాయంపట్టి చుక్కమ్మ శవాన్ని పక్కనున్న దిగుడు బావిలో పడేసి ఎందుకైనా మంచిదని అప్పటికప్పుడే తమ ఊళ్లకు ప్రయాణమై వెళ్లిపోయారు.

నారాయణ కూడా తన ఇంటికి వెళ్లిపోయాడు- బంగళాకు తాళంవేసుకుని.

సీసాలతో, సంచినిండా తినుబండారాలతో బంగళాకు తిరిగివచ్చిన వీరయ్యా బంగళాకు తాళంవేసి వుండటం చూసి ఆశ్చర్యపోయాడు.

మధ్యలో వర్షంరావడంవల్ల తను రావడం ఆలస్యమైంది. అయినా ఈలోగా వీళ్లంతా ఎటువెళ్లారు?

అయ్యగారి బంగళాకు వెళ్లివుంటారా?

పోనీ అక్కడికే వెళ్లి తెలుసుకుంటే సరి- అనుకుని వెనుదిరిగాడు వీరయ్యా సంచులతో సహా...

వీధి తలుపు చప్పుడు కావడంతో లేచివచ్చి తలుపు తీసిన నారాయణ ఎదుట నిలిచివున్న వీరయ్యాను చూసి గతుక్కుమన్నాడు.

మరుక్షణంలోనే సర్దుకున్నాడు.

ఎప్పటికైనా వీరయ్యను ఎదుర్కొనక తప్పదుగదా! వీరయ్యామొహం చూస్తే ఇంకా చుక్కమ్మ అంతర్ధానం కావడం గ్రహించినట్లు లేదు. ఈలోగా తనెందుకు తొందరపడటం.

''నువ్వు బయలుదేరిన కాస్సేపటికే కనకరాజుగారి తండ్రికి సీరియస్‌గా వుందని కబురు రావడంతో అందరూ అప్పటికప్పుడే బయలుదేరి వెళ్లిపోయారు. ఇక, అక్కడ నేనుండి చేసేదేముందని ఇంటికి వచ్చేశాను. పాపం... నువ్వు అనవసరంగా వానలో అంతదూరం వెళ్లొచ్చావు'' నొచ్చుకున్నాడు నారాయణ.

''ఫరవాలేదయ్యా... మరి సీసాలు, టిఫిన్లు?'' చేతిలో సంచి చూపించాడు.

''సరి సరి... అవన్నీ నువ్వే తీసేసుకో. బంగళాలో భోజనమే మిగిలిపోయి అలాగే ఉంది. నువ్వింకా భోజనం చెయ్యలేదేమో? జల్సా చేసుకో''

లాల్చీ జేబులోనుండి తాళంచెవి తీసి ఇస్తూ అన్నాడు నారాయణ.

వీరయ్య సంతోషంగా వెనుదిరిగాడు.

బంగళాచేరి తప్పతాగి అక్కడే మంచానికి అడ్డంగాపడ్డాడు.

★ ★ ★

బారెడు పొద్దుఎక్కాక మెలుకువ వచ్చింది వీరయ్యకు.

కళ్లు నులుముకుంటూ లేచిన వీరయ్యకు తనెక్కడ వున్నాడో, ఎందుకు వున్నాడో అర్థంకా లేదు. చుట్టూ ఖాళీసీసాలు, అటూ ఇటూ చెల్లాచెదురుగా పడివున్న కాగితం పొట్లాల్తో గదంతా చిందరవందరగా కనిపించింది.

'అమ్మో... అయ్యగారి మంచంమీద పడుకున్నానా? ఇంకా నయం ఎవరూ చూడలేదు' అనుకుంటూ చివాలున లేచిన వీరయ్యకు రాత్రి జరిగిన సంఘటనలన్నీ వరుసగా జ్ఞాపకం వచ్చాయి.

జీవితంలో ఏనాడూ చూడని ఆ ఖరీదైన సీసాలన్నీ ఆత్రంకొద్దీ ఖాళీచేశాడు.

ఆ తర్వాత బంగళా క్లీన్‌చేసే ఓపిక లేని వీరయ్య కళ్లు నులుముకుంటూ తన కాటేజీ వైపు నడిచాడు.

ఎదురుగా దండెంమీద ఆరేసిన చీర కనిపించింది. అప్పుడు.... అప్పుడే గుర్తుకువచ్చింది వీరయ్యకు- నిన్న తన కూతురు అత్తవారింటి నుండి వచ్చిందన్న విషయం.

కూతరినొక్కదాన్ని ఇక్కడ వదిలి తను హాయిగా బంగళాలో తాగిపడుకున్నాడు. ఆ.. అయినా ఇక్కడ తన కూతురికి భయమేమిటి? అనుకుంటూ ముందుకు నడిచాడు.

వీధి తలుపు బార్లా తీసివుంది. లోపల చుక్కమ్మ కనిపించలేదు.

ఏ నీళ్లకోసమో బైటకివెళ్లి వుంటుంది- అనుకుంటూ నులకమంచానికి అడ్డంపడ్డాడు. ఇంకా తల దిమ్ముగానే ఉంది. కళ్లుమంటలు పుడుతున్నాయి.

అలా ఎంతసేపు నిద్రపోయాడో అతనికే తెలియదు.

వీరయ్యకు మళ్లీ మెలుకువ వచ్చేసరికి మిట్టమధ్యాహ్నామైంది. కడుపులో ఆకలి కర కర మంటోంది. తలదిమ్ము, కళ్లమంటలూ తగ్గి కాస్త మనసుకి హాయిగా వుంది.

అబ్బా... ఇప్పుడు అన్నం వండుకోవాలా? మంచంమీద పడుకుని బద్ధకంగా అనుకున్న వీరయ్యకు కూతురు చుక్కమ్మ ఇంట్లోనే వుందన్న విషయం జ్ఞాపకం వచ్చేసరికి ఎంతో ఉత్సాహం వచ్చింది.

"చుక్కమ్మా... అన్నం పెట్టెయ్ తల్లీ!" అన్న వీరయ్య కేకకు సమాధానం రాలేదు.

తోటలోకి వెళ్లివుంటుందనే ఉద్దేశంతో లేచి ఒళ్లు విరుచుకుని వంటింట్లోకి నడిచాడు. వంటింట్లో నిన్నటి అన్నం, పులుసూ తప్ప, ఈరోజు వంటచేసిన జాడేమీ కనిపించలేదు.

'చుక్క ఏమైందబ్బా?' అనుకుంటూ తోటంతా కలియదిరిగాడు.

ఎక్కడికి వెళ్లివుంటుంది?

ఎక్కడికి వెళ్లడమూ ఆ పిల్లకు అలవాటులేదే?

నులకమంచం మీద మతిపోయినవాడిలా కూర్చున్నాడు కాసేపు.

ఏకూరో నారో తెచ్చుకోడానికైనా బజారుకు వెళ్లిందేమో అని మనసుకు సర్దిచెప్పుకున్నాడేగానీ, గంటలు గడిచేకొద్దీ వీరయ్యలోని ధైర్యం దిగజారిపోతోంది.

ఎక్కడికి వెళ్లినా ఈపాటికి తిరిగి వచ్చెయ్యాలికదా! ఎక్కడికి వెళ్లింది? ఇంకా రాలేదేమిటి?

వీరయ్యకు గాభరాపట్టుకుంది.

★ ★ ★

సాయంత్రమయ్యేసరికి వీరయ్య ఇహ ఆగలేకపోయాడు.

ఏం చేయాలో తోచక నారాయణ వద్దకు. వచ్చాడు.

"అయ్యగారూ... చుక్కమ్మ కనిపించడం లేదయ్యా!" వీరయ్య మాటలకు ఆశ్చర్యం కనిపించింది నారాయణలో.

"అదేమిటి... చుక్కమ్మ అత్తవారింటి నుండి ఎప్పుడు వచ్చింది?"

"నిన్ననే వచ్చింది బాబుగారూ! రాత్రి నేను పట్నం వెళ్లేసరికి ఇంటిలోనే వుంది. తిరిగి వచ్చాక నేను రాత్రి బంగళాలోనే వుండిపోయా

ను. పొద్దుట అక్కడకు పోయిచూస్తే చుక్కమ్మ ఇంట్లోలేదు. తలుపులు తీసివున్నాయి. పని మీద బైటకు వెళ్లిందేమోనని ఇప్పటివరకు చూశాను... రాలేదు. నాకేదో భయంగా వుంద య్యా!''

కళ్లమ్మట నీళ్లుపెట్టుకున్నాడు వీరయ్య.

''అయినా ఆడపిల్లను ఒక్కతినే ఒంటరిగా వదిలి ఎలా వెళ్లావయ్యా? ఏదో వంటరివాడివి కదా అని వెళ్లిరమ్మన్నాను. పోనీ అప్పుడైనా, ఇలా అమ్మాయి వచ్చిందని చెప్పవచ్చుగా! అయినా జరిగిన వాటి గురించి తర్జనభర్జన లెందుకుకానీ, ఒకవేళ మీ అల్లుడేమైనా వచ్చి రాత్రి తనతో తీసుకు వెళ్లాడేమో?'' ఆలోచనగా అన్నాడు నారాయణ.

వీరయ్య కళ్లలోకి వెలుగువచ్చింది. ''ని జంగా అలా జరిగివుంటుందా బాబుగారూ'' ఆశగా అడిగాడు.

''నువ్వేమీ కంగారుపడకు. పోలయ్యను పంపి కబురు తెలుసుకుందాం. ఈ కంగారులో నువ్వు ఒక్కడివి తోటలో ఎందుకు? పోలయ్య తిరిగి వచ్చేసరికి ఏటైమవుతుందో? కబురు తెలిసేవరకూ ఇక్కడే వుండు''

అయ్యగారి మంచి మనసుకి చేతులు జోడించాడు వీరయ్య.

చుక్కమ్మ అత్తవారింటికి వెళ్లిన పోలయ్య చుక్కమ్మ భర్త గోపయ్యను వెంటబెట్టుకుని రాత్రి పదిగంటల వేళ తిరిగివచ్చాడు.

''ఏమిటీ... చుక్కమ్మ అక్కడికి రాలేదా? మరెక్కడికి వెళ్లినట్లు? ఏమైనట్లు? సరే... ఈరా త్రి పనిజరగదు కాని, మీరిద్దరూ వసారాలో పడుకోండి. పోలయ్యా, నువ్వూ తెలవారుతూనే మనవాళ్లను పదిమందిని వెంటబెట్టుకుని వూరంతా వెతకండి. ఊళ్లోని వయసొచ్చిన కుర్రాళ్లెవరైనా వూరువిడిచి వెళ్లారేమో వాకబు చేయండి. ఆహా... చుక్కమ్మను అనుమానిస్తు న్నానని కాదు. కానీ అన్నివైపులా చూసుకో వడం మంచిదికదూ'' అన్నాడు నారాయణ.

''ఇంకెక్కడి చుక్కమ్మ బాబూ! ఏదొంగ నాకొ డుకో నాకూతురి బతుకుని బుగ్గిచేసి వుంటా డు'' గొల్లుమన్నాడు వీరయ్య.

''నువ్వు అనవసరంగా గాభరాపడకు. మన ప్రయత్నాలేవో మనం చేద్దాం'' లేచి తన గదిలోకి నడిచాడు నారాయణ.

మరునాడు ఉదయం నుండి వూరిలోని చెరువులూ, బావులూ గాలించిన నారాయణ మనుమలు సాయంత్రమయ్యే సరికి చుక్కమ్మ శవాన్ని తోటలోని దిగుడుబావిలో నుండి బైట కుతీసారు. శవాన్ని చూసి మామా, అల్లుడూ గొల్లుమన్నారు.

''జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడనవ సరంగా అల్లరిపడటం ఎవరికీ మంచిదికాదు. చుక్కమ్మ మనసుకే కష్టంతోచిందో దిగుడుబావి లోపడి ఆత్మహత్య చేసుకుంది. ఈ విషయం ఏమాత్రం బైటకు పొక్కినా పోలీసులు కల్పించుకుని ముందు మీ అల్లుణ్ని అతని అమ్మనాన్నలను పట్టుకుని జైల్లోపెడతారు. ఏక ట్నంకోసమో పీడిస్తే, అమ్మాయి ఆత్మహత్యచే సుకుందంటారు. దానివల్ల పోయిన చుక్కమ్మ బతికివస్తుందా? నీకూతురి అత్తగారు ఎంతో మంచిదని, అల్లుడుబుద్ధిమంతుడని, ఇన్నా ళ్లూ అందరకూ చెప్పుకుని ఎంతో మురిసిపో యావ్. ఇప్పుడు వాళ్ల ప్రాణాలమీదకు తీసుకు రావడం నీకుమాత్రం ఇష్టమా? మనసు సంభా ళించుకో. ఎవరికెప్పుడు చావు ఎలా రాసిపెట్టి వుందో మనకెలా తెలుస్తుంది. ముందు దహనా నికి ఏర్పాట్లుచేద్దాం. చుక్కమ్మ పోయిందంటే నాకుమాత్రం బాధగాలేదూ!'' కళ్లు తుడుచు కున్నాడు నారాయణ.

చుట్టూ మూగిన జనసమూహం నారాయణ లోని జాలిగుండెకు జోహార్లు అర్పించారు.

వీరయ్యా, గోపయ్యా నారాయణ మాటలకు బెదిరిపోయారు.

గోపయ్యకైతే మరీను. జైలు కటకటాలే కళ్ల ముందు కనిపించాయి.

''ఏంచెయ్యాలో మీరే చెప్పండి బాబుగా రూ! తండ్రిని చూడాలని కోరికగా ఉందంటే, నెలతప్పిన మనిషి కోరికను కాదనకూడదని, నేను తరువాత తీసుకెడతానని చెప్పినా విని పించుకోకుండా పంపించింది మా అమ్మ'' కళ్ళు తుడుచుకున్నాడు గోపయ్య.

చుక్కమ్మ గర్భవతి అని తెలుసుకున్న నారా యణ గతుక్కుమన్నాడు.

ఆ విషయం అప్పుడే తెలుసుకున్న వీరయ్య




మరొక్కసారి గొల్లుమన్నాడు.

తనతో చెప్పుకోవడానికి సిగ్గుపడిందేమో? ఆ శుభవార్త తన చెవిన వేద్దామని ఎంతో ఆశతో వచ్చిఉంటుంది. అది వచ్చిన దగ్గరనుండీ ఒక్కఘడియ సేపైనా దానితో మాట్లాడనేలేదు. అటువంటి పిల్లను ఇంట్లోవదిలి తప్పతాగి బంగళాలో ఉండిపోయాడు తాను! రాత్రి ఏజైములోనో ఏ దిక్కుమాలినవాడో తన ఇంట ప్రవేశించి తన కూతురు శీలాన్ని అపహరించి ఉంటాడు. దానితో అభిమానవంతురాలైన తన బిడ్డ దిగుడుబావిలోకి దూకి ప్రాణాలు తీసుకొని ఉంటుంది.

రాత్రి తనకోసం ఎంతగా అలమటించిపోయిందో తనబిడ్డ! కనీసం తను బంగళాలోనే ఉన్న విషయం కూడా దానికి తెలిసివుండదు.

కన్నబిడ్డను కసాయివాడికి అప్పగించి, సహాయానికై అది వేసిన కేకలు వినబడకుండా తప్పతాగి పడుకున్నాడు. తనకంటే నికృష్టుడు ఉంటాడా?

నారాయణ వాళ్ళకు వేరే ఆలోచించుకునే అవకాశం ఇవ్వకుండా, చుక్కమ్మ దహనానికి త్వరితంగా ఏర్పాట్లు కానిచ్చాడు.

తమ కులంలో పూడ్చడమే కానీ దహనం చేయరని వీరయ్య అభ్యంతరం చెప్పినా, ఆత్మహత్య చేసుకున్న చుక్కమ్మను దహనం చేయకపోతే మళ్ళీ పోలీసులు వచ్చి శవాన్ని బైటకు తీయించి పరీక్షనెపంతో, ఆ అమాయకురాలి శరీరాన్ని చిన్నాభిన్నం చేస్తారనీ, ఈ లోకంలో చుక్కమ్మ ఎటూ సుఖపడలేదు; ఈ చర్యవల్ల చుక్కమ్మకు పరలోకంలో కూడా ఆత్మశాంతి ఉండదనీ ఊదరగొట్టాడు నారాయణ.

దానితో బెదిరిపోయిన వీరయ్య నారాయణ వాదానికి తలవంచక తప్పలేదు.

ఆ రాత్రికి రాత్రే చుక్కమ్మ దహనం అయిపోయింది. శ్మశానం నుండి తిరిగి వచ్చిన నారాయణకు మనసులోని భారమంతా దిగిపోయినట్లుగా ఉంది. పరిస్థితిని బాగా 'మానేజ్' చేయగలిగినందుకు తనను తానే అభినందించుకున్నాడు.

కూతురుపోయిన దుఃఖంలో వీరయ్య తిండీ తిప్పలు చూసుకోలేదని, తోటలోని బంగళాకి మరొక మనిషిని ఏర్పాటుచేసి, వీరయ్యను తన ఇంటివద్దనే ఉండిపొమ్మన్నాడు నారాయణ.

నారాయణ మంచి మనసుకు వూరంతా జోహార్లు అర్పించింది.




నారాయణ తన గత చరిత్రను సవివరంగా చెప్పుకున్న అలసటలో నిస్త్రాణగా కళ్ళుమూసుకున్నాడు. అతని మనసంతా పశ్చాత్తాపంతో దహించుకుపోతోంది.

నారాయణ చరిత్రను అంతసేపూ మౌనంగా విన్నారు స్వామీజీ.

"స్వామీ... నన్ను అసహ్యించుకుంటున్నారు కదూ! నా పాపానికి నిష్కృతిలేదు కదూ!"

కళ్ళుతెరచి బేలగా అడిగాడు నారాయణ.

నిట్టూర్చారు స్వామీజీ.

"బుద్ధిః కర్మానుసారిణి" అన్నారు మెల్లిగా. అంతకుమించి ఇంకేమీ అనలేదు.

ఇంతలోనే పట్నంనుండి డాక్టరుగారు వచ్చారు.

స్వామీజీ తన అవసరం తీరిపోయింది కాబట్టి తనకు పాదాభి వందనంచేసిన భారతిని మౌనంగా ఆశీర్వదించి తన ఆశ్రమానికి చేరుకున్నారు.

* * *

నారాయణను పరీక్ష చేశారు పట్నం నుండి వచ్చిన డాక్టరుగారు. ఆచార్యులుగారు చెప్పిన కథనాన్నిబట్టి నారాయణ ముందు తెలివితప్పి పడిపోయినా, కొద్దిసేపటిలోనే తెలివిలోకి వచ్చాడు. అలా వచ్చినప్పుడు నాడి బలహీనంగానే ఉన్నా, ఆయుర్వేద వైద్యం ఫలితంగానో, మరే కారణంగానో స్పృహలోకివచ్చి ఉండాలనుకు

డాక్టరుగారు.

అయినా ఇంకా పరిస్థితి సంతృప్తికరంగాలేదు. తనతో తీసుకువెళ్ళి అన్ని పరీక్షలు చేస్తే కాని నిర్థారణగా ఏ విషయం చెప్పలేమన్నారు డాక్టరుగారు.

భారతి త్వరత్వరగా ఏర్పాట్లు చేసింది. తల్లిదండ్రుల కోసం పోలయ్యను ఊరికి పంపించింది. వారు వచ్చేవరకు ఇంటిని, పిల్లల్ని భద్రంగా చూస్తూ వుండమనీ, వచ్చిన వెంటనే తండ్రిని పట్నంలో హాస్పిటల్‌కు పంపమనీ రంగమ్మతో చెప్పి నారాయణతోపాటు టాక్సీ ఎక్కింది. వీరయ్యను వెనుక బస్సులో రమ్మని చెప్పింది భారతి.

తన నర్సింగ్ హోంలో టెస్టులన్నీ చేసిన డాక్టర్ 'పెప్టిక్ అల్సర్‌పెర్పరేట్' అయి ఉంటుందని నిర్థారణకు వచ్చాడు.

పెప్టిక్ అల్సర్ పెర్పరేట్ అయితే మరి పేషెంటు స్పృహ ఎందుకు కోల్పోయినట్టు? అయినా ఆ పరిస్థితిలో ఉన్న పేషెంటుకి తాను వైద్యంచేయడం ఎందుకని ప్రాథమిక చికిత్స అనంతరం హైదరాబాదుకి తరలించాడు డాక్టరు.

అక్కడ అడ్మిట్ అయిన వెంటనే టెస్టులన్నీ త్వరత్వరగా చేసి 'ఎమర్జెన్సీ' అని అప్పటికప్పుడు పేషెంటుని ఆపరేషన్ థియేటర్‌కి షిఫ్ట్ చేశారు.

నారాయణ పొత్తికడుపు ఓపెన్‌చేసేసరికి పెప్టిక్ అల్సర్‌పెర్పరేట్ అయి, అదృష్టవశాత్తు ఓమెంటమ్ వచ్చి ఆ పెర్పరేషన్‌ని సీల్ చేయడంతో తాత్కాలికంగా నారాయణకు ప్రమాదస్థితి దాటింది.

నారాయణకు ఎప్పటినుండో కడుపులో మంట, అప్పుడప్పుడు వాంతులు కావడం ఉంది. సోషల్‌హేబిట్స్ పేరిట అలవాటు చేసుకున్న ఆల్కహాలు దానిని మరింత పెంచుతోంది. వేళాపాళాలేని ఆహార నియమాలు, డబ్బు సంపాదించాలనే ఆరాటం- ఆ అనారోగ్యాన్ని మరింత పెంచింది.

అదే సమయంలో గర్భవతి అయిన వీరయ్య కూతురు మరణం నారాయణను మానసికంగా దెబ్బతీసింది. ఆరోజు బంగళాలో నమ్మలేనట్టుగా కొయ్యబారిపోయి తనవైపు అమాయక నేత్రాలతో ఆశ్చర్యంగా చూసిన చుక్కమ్మ చూపు రాత్రింబవళ్ళూ నారాయణను వెంటాడుతూనే ఉంది.

తన బతుకును కాలరాయవద్దని ఆ అమాయకురాలు తన కాళ్లమీద పడి విలపించడం, ఆమె ఘోష చెవుల్లో గింగురుమంటూనే ఉంది. చెయ్యివేసేసరికే స్పృహతప్పిపోయిన చుక్కమ్మను చూసి తమకడ్డులేదని గర్వించారే తప్ప, ఆమె మరణానికి తమలో ఎవరు కారకులో కూడా వారెవరికీ తెలియదు. చుక్కమ్మ శవాన్ని దహనం చేయడంవల్ల తమ దారుణం బైటకురాదని మొదట్లో సంతోషించిన నారాయణకు, రానురాను తన మనస్సుకు సమాధానం చెప్పుకోవటం కష్టమైంది. లోలోపలే ఎప్పుడూ లేని భీతి ఏదో పట్టుకుంది. పూర్వపు ధీమా, ధైర్యం ఉండటంలేదు. పైగా అనారోగ్యం. ఎవరితోనూ, ఆఖరికి కట్టుకున్న భార్యతో కూడా మనసువిప్పి చెప్పుకోలేని మూగబాధ.

అందువల్లనే మనసు ఎదురుతిరుగుతున్నా ఏదో తెలీని ప్రేరణతో, భారం వదిలించుకోవాలనే తపనతో తన గతం స్వామీజీతో చెప్పుకోకుండా ఉండలేకపోయాడు. చెప్పుకున్న తరువాత హృదయభారం తీరిపోయినట్లే అనిపించింది.

తరువాత హాస్పిటల్లో అడ్మిట్అవడం, ఆపరేషన్ జయప్రదంగా జరగటంతో నారాయణ బతికిబయటపడ్డాడు. హాస్పిటల్‌లో ఉన్నంతకాలం అతని మనసు ప్రశాంతంగానే ఉంది.

★ ★ ★

రెండు నెలలు గడిచిపోయాయి. ఆరోజు పట్నంలో రైలుదిగి టాక్సీలో స్వగ్రామం వస్తున్నారు- భారతి, నారాయణ.

కుట్లు త్వరగా మానకపోవటానా, జనరల్ కండిషన్ సంతృప్తిగాలేకా నారాయణను డిస్చార్జి చేయడానికి రెండు నెలలు పట్టింది. ఈ రెండు నెలలూ భారతి తల్లి పిల్లల్నీ, ఇంటినీ కనిపెట్టుకుని ఉంది. భారతి తండ్రి తన ఊరిలోనూ, ఇక్కడా ఉంటూ మధ్యమధ్య హైదరాబాదు వచ్చి కూతుర్నీ, అల్లుణ్నీ చూసి వెళ్ళేవాడు.

మొత్తంమీద పరిస్థితి చక్కబడినందుకు




సంతోషపడుతున్నారు అందరూ.

"డ్రైవర్... కారాపు"

భారతి మాటలతో కళ్ళువిప్పి చూశాడు నారాయణ.

కారు ఆశ్రమం గేటువద్ద ఆగివుంది. ఆశ్రమం ఊరి మొదట్లోనే ఉండటం నారాయణకు ఎందుకనో రుచించలేదు ఇప్పుడు.

"ఇప్పుడెందుకు భారతీ! తరువాత రావచ్చునులే" అయిష్టంగా అన్నాడు నారాయణ. ఈ రెండు నెలల్లోను బాగా నీరసించిపోయాడు అతను.

"ఒక్క నిముషం లోపలకువెళ్ళి స్వామీజీ ఆశీస్సులు తీసుకుని వచ్చేద్దామండీ! స్వామీజీ ఆశీస్సులతోనే కోలుకున్నారు మీరు. ఆశ్రమం ముందుగా వెడుతూ కూడా ఆయన ఆశీర్వాదం తీసుకోకుండా మన ఇంటికి వెళ్లడం మనకు శుభంకాదండీ"

భారతి మాటలు కాదనే శక్తి నారాయణకు లేదు.

"సరే... నువ్వెళ్ళిరా!" నీరసంగా కళ్ళుమూసుకుని వెనక్కి జారబడ్డాడు నారాయణ.

"అలాకాదండీ- ఒక్కసారి ఓపిక చేసుకుని లోపలకు రండి! స్వామీజీ ఆశీర్వాదం తీసుకుంటే అదే కొండంతబలం మీకు"

భారతితో వాదించలేని నారాయణ టాక్సీ దిగాడు.

"నీవల్ల ఏ ప్రయోజనాన్ని ఆశించి నీకు పునర్జన్మనిచ్చాడో ఆ పరమేశ్వరుడు శుభం!" అని ఆశీర్వదించిన స్వామీజీ మాటలకు నారాయణ అంతరంగం రోషంతో మండిపడింది.

తలఎత్తి స్వామీజీని చూడలేకపోయాడు.

నమస్కరించి వెనుదిరిగింది భారతి.

హాస్పిటల్‌నుండి తిరిగి వచ్చిన దగ్గరి నుండి నారాయణ మనస్తత్వం విచిత్రంగా మారిపోయింది. ఇదివరకులా ఎవరితోనూ సంతోషంగా మాట్లాడలేకపోతున్నాడు. పిల్లల్ని పలకరించడంలేదు. భార్యతోనూ మనసు విప్పి మాట్లాడలేకపోతున్నాడు. అదంతా నీరసంవల్లనే అని సరిపెట్టుకుంది భారతి.

"భారతి ఏదీ?" ఆరోజు పొలంనుండి వచ్చిన నారాయణ భార్య కనబడకపోయేసరికి రంగమ్మను అడిగాడు.

"ఈ రోజు ఆశ్రమంలో ఏదో భజతేందట. తొందరగానే వచ్చేస్తానని చె-"

రంగమ్మ సమాధానం విని తన గదిలోకి ఒళ్ల మంచంమీద వాలాడు నారాయణ.

ఈమధ్య ఇలాంటి జవాబు తరచూ వస్తూనే వుంది నారాయణకు. అంతకుపూర్వం ఏనాడూ లేనిది భారతికి ఆశ్రమంమీద ప్రత్యేక శ్రద్ధ కుదిరింది. రోజూ ఆశ్రమానికి వెళ్లి వస్తూనే వుంటోంది. భారతి అక్కడకు వెళ్తోందని తెలిసిన నారాయణ మనసు పరిపరివిధాలా పోతోంది. తిరిగి వచ్చిన భారతి నిర్మలంగా పలకరించేదాకా మనసుకు స్థిమితం వుండదు. తిరిగి వచ్చాక గండం గడిచినట్లు నిశ్చింతగా నిట్టూరుస్తున్నాడు నారాయణ.

ఇలా ఎంతకాలం సాగుతుంది?

తన ముఖం చూసి భారతే తనంతటతానుగా ఆశ్రమానికి రాకపోకలు తగ్గిస్తుందని ఆశించాడు నారాయణ. కాని అలా జరగడంలేదు. ఆమెకి ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? ఆశ్రమానికి వెళ్లకుండా చెయ్యడం ఎలా?

అసహనంతో కణతలు రుద్దుకున్నాడు నారాయణ.

"అరే... ఎంతసేపైంది మీరు వచ్చి? రంగమ్మగారు కాఫీ ఇచ్చారా? త్వరగానే వచ్చేద్దామనుకుని వెళ్లానుగాని, స్వామీజీ ఉపన్యాసం వింటూ వుంటే లేవబుద్ధి కాలేదనుకోండి. అదేం అలా వున్నారు?" ఆరాటంగా అడిగింది భారతి.

"అబ్బే... ఏంలేదులే- బాగానే వున్నాను. అయినా వూరికే అటూఇటూ పెత్తనాలకు వెళ్లకపోతే కాస్త పిల్లల చదువుసంధ్యలు చూడకూడదూ?"

చిన్నబుచ్చుకుంది భారతి.

"అదేమిటండి అలాగంటారు? ఒకట్లోక్లాసు చదువుకున్న పసివాడికీ, ఇంకా స్కూల్లోనే చేర్చని అమ్మాయికి ఏంచదువుసంధ్య చూడమంటారు. మీరు కూడా కాస్త అటువైపు వస్తూ వుంటే మనశ్శాంతి చిక్కి ఆరోగ్యం బాగుపడుతుంది. చెబుతుంటే వినిపించుకోరు"

''సరేలే... అసలే తలనొప్పిగా వుంది. భోజనం వడ్డించు'' చిరాగ్గా అన్నాడు నారాయణ.

మొహం చిన్నబుచ్చుకుని లోపలకు నడిచింది భారతి.

నారాయణ అసలు బాధ తన గతచరిత్రను స్వామీజీ భార్యతోగానీ చెప్పడుగదా... అని.

ఓవేళ సమావేశాల్లో పాపాలకు ప్రాయశ్చిత్తాలకు ఉదాహరణగా తన కథనే చెప్పేస్తే...?

★ ★ ★

''ఏమండీ... నాదొక్క కోరిక... కాదనరుగా'' ఒకనాడు భోజనం తరువాత చికాకులు మరచి ప్రశాంతంగా కనిపిస్తున్న భర్తను ప్రాధేయపూర్వకంగా అడిగింది భారతి.

''ఏమిటి... నీ కోరిక కాదనడమా? అలనాటి సావిత్రిలా యమునితో పోట్లాడి మరి నన్ను బతికించుకుని తీసుకువచ్చావు ఇంటికి. ఏంకావాలి? వజ్రాల హారమా లేక నవరత్నమాలా?'' సరసంగానే అడిగాడు నారాయణ. నిజానికి నారాయణకు జబ్బు చేసిన దగ్గరనుండి భార్యపై ప్రేమాభిమానాలు మరింత పెరిగాయి.

''చాల్లెండి... నాకే హారాలూ వద్దు కానీ, స్వామీజీని ప్రతి శనివారం మన ఇంటికి భిక్షకు రమ్మని వేడుకున్నానండీ! ముందు మీ అనుమతి తీసుకునే అడుగుదామనుకున్నాను. కాని, అక్కడ స్వామీజీని భిక్షకు పిలవడానికి అందరూ పోటీలమీద వున్నారు. ఆలస్యం చేస్తే మనకా అదృష్టం దక్కదని తొందరపడి అడిగేశానండి. అయినా ఆయన మన ఇంటికి వస్తానని అంగీకరించడం కేవలం మన అదృష్టమండీ'' ఏదో తన్మయత్వంలో వుంది భారతి.

నారాయణ మాత్రం గతుక్కుమన్నాడు.

ప్రతి శనివారం స్వామీజీకి తన ఇంట్లో భిక్ష? ఎందుకిలా జరుగుతోంది? తను కళ్లెదుట కనిపిస్తూవుంటే స్వామీజీకి తన గతచరిత్ర మనసులో మెదలకపోతుందా? ఏ బలహీనమైన క్షణంలోనో తను చెప్పిన కథ ఆయన ఎవరితోనైనా అంటే- తన గతేమిటి?

ఇన్నాళ్లు పెద్దమనిషిగా పేరు పొందిన తను నలుగురూ తన గుట్టు తెలిసి నిందిస్తుంటే భరించగలడా?

''ఏమండీ... మాట్లాడరు'' భారతి కుదిపి కుదిపి అడుగుతుంటే తన ఆలోచనల్లోనుండి బైటకు వచ్చాడు నారాయణ.

''నువ్వు పిలిచి వచ్చాక ఇహ నేనేం మాట్లాడేది... నీఇష్టం'' ముభావంగా అని పక్కకి తిరిగి పడుకున్నాడు నారాయణ.

భర్త ఆ మాత్రం అంగీకరించినందుకు సంతోషపడిపోయింది భారతి.

శనివారం లేచిన దగ్గరనుండి హడావుడి పడుతూనే వుంది భారతి. తను తలారా స్నానంచేసి, పూజపూర్తి చేసుకుని దగ్గరవుండి ఇల్లంతా కడిగించి ముగ్గులు పెట్టింది.

హాల్లో తివాచి పరచి స్వామీజీ కూర్చోడానికి సోఫా, దానిమీద పట్టుపంచె కప్పింది. హాల్లో మిగిలిన కుర్చీలు, బల్లలూ అన్నీ తీయించివేసింది. సోఫా పక్కనే చిన్న స్టూలు పెట్టి దానిమీద త్రిమూర్తులపటం పెట్టింది. దానికి ముందు భగవద్గీత. అగరువత్తులు వెలిగించి, హాలంతా జంబుఖానాలు పరచింది వచ్చినవారు కూర్చోడానికి.

''అమ్మా... స్వామీజీ వస్తున్నారు'' కబురుచెప్పి వెళ్లిపోయాడు పోలయ్య

భారతి హడావుడిగా భర్త గదిలోకి వెళ్లింది. ''ఇదేమిటి... మీరింకా ఇక్కడే వున్నారు? త్వరగా రండి స్వామీజీ వచ్చేస్తున్నారు''

''నేనెందుకు?''

భర్త ప్రశ్నకు తెల్లబోయింది భారతి.

''అదేమిటి... స్వామీజీకి పాదపూజ అంటే భార్యాభర్తలు ఇద్దరూ కలిసి చేస్తేనే బాగుంటుంది. రండి రండి... మన అదృష్టం బాగుండి ఆయన మన ఇల్లు పావనం చేస్తున్నారు'' అంది.

''అబ్బ... నీకీ చాదస్తం ఏమిటి భారతి? ఏదో భిక్షకు పిలుస్తానన్నావు- సరే అన్నాను. ఆయన వచ్చిన తరువాత ఏదో పళ్లూ, పాలూ సమర్పించుకో. ఆయన స్వీకరించి నీకు సద్గతులు కలగజేస్తాడు'' వ్యంగ్యంగా అన్నాడు నారాయణ.

''అవ్వ!'' నోరు నొక్కుకుంది భారతి. భిక్షకు రావడమంటే ఏదో మనం పెట్టిన తిండికోసమనుకున్నారేమిటి? సరే సరే... అవన్నీ మీకు ఇప్పుడు విడమర్చి చెప్పే తీరిక నాకు లేదు-




కాని రండి రండి'' బలవంతంగా భర్త చెయ్యి పుచ్చుకుని కిందికి లాక్కుని వచ్చింది భారతి.

సరిగ్గా ఆ సమయంలోనే స్వామీజీ ఇంటిని సమీపిస్తున్నారు.

నారాయణ చేతిని వదలకుండా, ఎవరైనా పరిహసిస్తారేమోననే విషయం కూడా విస్మరించి గబగబా వీధి గుమ్మం దగ్గరకు నడిచింది భారతి.

నారాయణకు అనుసరించక తప్పలేదు.

సింహద్వారంలో అడుగుపెట్టిన స్వామీజీకి పాదాభివందనం చేసింది భారతి. నారాయణకు భార్యను అనుసరించక తప్పలేదు.

స్వామీజీ సోఫాలో కూర్చున్న తరువాత వెండిపళ్లెం స్వామీజీ పాదాలముందు పెట్టింది భారతి. స్వామి పాదాలు అందులో పెట్టగానే భారతి ఆదేశంమేరకు ఆమె నీళ్లు పోస్తూవుంటే స్వామీజీ పాదాలు కడిగాడు నారాయణ.

ఆ నీళ్లు తలపై చల్లుకుంది భారతి.

దోసిళ్లతో పూలు తీసుకుని స్వామీజీ పాదాలకు పూజచేసింది. తన పాదాలను కళ్లకద్దుకుంటున్న భారతి శిరస్సుపై చెయ్యి వుంచి మౌనంగా ఆశీర్వదించారు స్వామీజీ.

భారతి సమర్పించిన ఫలాలూ, పాలూ స్వీకరించి తన అనుచరులు వెంటరాగా తన ఆశ్రమానికి వెళ్లిపోయారు స్వామీజీ.

నారాయణకు గుండెలపై భారం దిగిపోయి నట్లయింది.

★ ★ ★

అలా రెండుమూడుసార్లు స్వామీజీ పాదపూజ చేసిన నారాయణ ఆ నాలుగో శనివారం సరిగ్గా స్వామీజీ వచ్చే సమయానికే మనిషి కనిపించకుండాపోయాడు. భర్త ఎటు వెళ్లాడో తెలియక బిత్తరపోయింది భారతి.

''అనుకోని అవాంతరం వచ్చి వారు బైటకు వెళ్లారు స్వామీ'' చిన్నబుచ్చుకున్న మొహంతో చెబుతున్న భారతిని చూసి చిరునవ్వు నవ్వారు స్వామీజీ.

''ఎందుకమ్మా... నీకంత ఆవేదన! ఎవరి కర్తవ్యం వారిది'' అన్నారు స్వామీజీ.

అయినా ఏదో కొరత అనిపించి అపరాధం చేసినట్లే తలవంచుకుంది భారతి.

తరువాత, ఆ తరువాత కూడా శనివారం వచ్చేసరికి ఉదయమే బైటికి వెళ్లిపోతున్నాడు నారాయణ. భారతి ఎంత నచ్చజెబుతున్నా ప్రయోజనం లేకపోతోంది.

రానురానూ నారాయణలో ముభావం ఎక్కువ అవుతోంది. రాత్రిళ్లు సరిగా నిద్రపోవడంలేదు. జబ్బు పూర్తిగా నయంకాలేదేమోనని భారతి అనుమానం. ఏం చెయ్యాలో ఆమెకు పాలుపోవడంలేదు. ఇప్పటికైనా స్వామీజీ పాదాలను శరణు వేడితే భర్త అనారోగ్యం మటుమాయమైపోతుందని భారతి నమ్మకం. కానీ స్వామీజీ వద్దకు రమ్మంటేనే నారాయణ మండిపడుతున్నాడు.

పోని రావడానికి కష్టమైతే, ఆయన తన ఇంటికి వచ్చిన రోజైనా ఆయన ఆశీర్వాదం తీసుకోవచ్చుగా- ఊహూ... ఆరోజు ఏకంగా ఇంట్లోనుండే వెళ్లిపోతున్నాడు.

ఏం చెయ్యాలో తోచని భారతి దైవంమీద భారంవేసి భర్త బదులు తనే స్వామీజీకి సేవలు చేస్తోంది. తరచుగా భజనకు ఆశ్రమానికి వెడుతోంది. ఆశ్రమానికి పెద్ద మొత్తంలో చందాలు ముట్టచెబుతున్నది.

నారాయణ ఆరోజు అలవాటు ప్రకారం ఉదయమే పొలంవైపు బయలుదేరాడు. ఆశ్రమం దాటిన తరువాత తనకు కొంత పొలం, ఆ ప్రక్కనే సరోజ ఆస్తిని స్వాధీనం చేసుకున్న పొలం వున్నది.

ఆశ్రమాన్ని సమీపిస్తూనే ఏదో అపరాధ భావంతో కుంచించుకుపోయే నారాయణకు, ఆ పొలం గట్లపై నిలుచుంటే ఒక్కోసారి తన మేనల్లుడు, ఆ రెండేళ్ల పసివాడు కళ్లలో మెదులుతున్నాడు. మనసు భీతిల్లిపోతోంది. అటువైపు వెళ్లడమంటేనే నారాయణకు అయిష్టంగా వుంటోంది. కానీ తప్పడంలేదు.

ఆ రోజూ అలాగే అటువైపు బయలుదేరిన నారాయణ ఆశ్రమం సమీపించేసరికి, ఆశ్రమం గేటుతీసుకుని లోపలికి వెడుతున్న వీరయ్య కనిపించే సరికి గతుక్కుమన్నాడు.

వీరయ్యకు ఇప్పుడు ఇక్కడేం పని?

స్వామీజీ దగ్గరకు ఎందుకు వెడుతున్నాడు?

ఏం మాట్లాడతాడు?

అసలెన్నాళ్లనుండి ఇలాగ వస్తున్నాడు?

స్వామీజీ చుక్కమ్మ విషయమేమైనా వీరయ్యతో చెప్పారా?

తన కూతురి మరణానికి గల కారణాలేమైనా వీరయ్య ఆచూకీ తీస్తున్నాడా?

లోపల ఏం జరుగుతోంది? వీరయ్య, స్వామీజీ ఏం మాట్లాడుకుంటున్నారు?

కానీ, ఆశ్రమం లోపలకు వెళ్లిన వీరయ్య ఏంచేస్తున్నాడో తెలుసుకునే సాహసం నారాయణకు లేకపోయింది. కాళ్లూ,చేతులూ ఆడలేదు.

ఇక ముందుకు సాగలేక, పొలం వెళ్లకుండా గిరుక్కున వెనుదిరిగి ఇంటిదారి పట్టాడు నారాయణ.

మానవ మనస్తత్వం విచిత్రమైంది. తనకున్న సంస్కారంతోనే మనిషి ఎదటివారి మాటలను, ప్రవర్తననూ అర్థంచేసుకుంటాడు.

కూతురుపోయిన దుఃఖం మరచిపోవడానికి వీరయ్య స్వామీజీ భజనలో సాంత్వనం పొందుతున్నాడు. ఇది అప్పటినుండీ జరుగుతున్నదే.

కూతుర్ని పోగొట్టుకున్న ఆ తండ్రికి వేళకు దగ్గరవుండి భోజనంపెట్టి ధైర్యం చెబుతూ వుండేది భారతి. ఆశ్రమానికి వెళ్లి వస్తూవుంటే, స్వామీజీ బోధనలు వింటూవుంటే మనశ్శాంతి ఉంటుందని వీరయ్యను తనే ప్రోత్సహించింది.

నారాయణ తన వ్యవహారాలలో తానువుండి వీరయ్య విషయం పట్టించుకోలేదు. తరువాత నారాయణ జబ్బుపడ్డాడు. ఊరువదలి వెళ్లడం, తిరిగి వచ్చిన తరువాత ఏర్పడిన నిర్లిప్తతవలన నారాయణకు అసలు వీరయ్య విషయమే గుర్తుకురాలేదు. మధ్యలో ఒకటి రెండుసార్లు వీరయ్యను చూసినా నారాయణ పట్టించుకోలేదు.

ఆ నాటికి ఈనాడే మళ్లీ వీరయ్యను గూర్చి ఆలోచిస్తున్నాడు నారాయణ.

ఇల్లుచేరి తన మంచంమీద వాలిపోయిన నారాయణ మనసు పరిపరి విధాలుగా పోతోంది.

ప్రాణం పోతోందన్న భీతితో స్వామీజీకి తన రహస్యాలన్నీ పూసగుచ్చి చెప్పుకున్న తెలివితక్కువతనం తనకిప్పుడు ముప్పు కలిగించేలా వుంది.

స్వామీజీ ఏం మాయచేశాడో ఏమోగానీ తన నేరాలను తాను స్వయంగా స్వామీజీకి చెప్పేశాడు. తెలివితక్కువగా స్వామీజీకి అలా తనచేత నేరాలను చెప్పించడంలో ఏదో ఉద్దేశం వుండే వుంటుంది. మిగిలిన నేరాలమాట ఎలా వున్నా చుక్కమ్మ చావు ఇంకా అందరిలోనూ పచ్చిగానే వుంది. ఇప్పుడు తన జుట్టు పూర్తిగా స్వామీజీ చేతిలో వుంది.

స్వామీజీ కూడా మానవమాత్రుడే. మరి తాను చెప్పిన రహస్యాలను ఎలా ఉపయోగించుకోవాలనుకుంటున్నాడో?

భారతినీ, వీరయ్యను ఆకర్షించి ఏమి చేయాలని ప్లాను వేస్తున్నాడో?

ఏనాడూ తన మాటకు ఎదురుచెప్పని భారతి, తనకు ఇష్టంలేదని తెలిసి కూడా స్వామీజీని ప్రతి శనివారం ఇంటికి పిలుస్తూ వుండటం మానలేదు.

తన రహస్యం భారతికి తెలిసిపోయిందా?

వీరయ్యకూ తెలిసిపోతుందా?

స్వామీజీ వాళ్లిద్దరిని ఎలా గుప్పెటలో పెట్టుకుంటున్నాడు?

అసలు స్వామీజీ వీళ్లను దగ్గరకు తీయడంలో ఉద్దేశం ఏమిటి?

తన ఆస్తిపాస్తులను బెదిరించి కాజేయడమా?

ఇంకా ఏ సమయంకోసం ఎదురుచూస్తున్నాడు స్వామీజీ?

తనమీద కేసుపెట్టడానికి తగిన సాక్ష్యాధారాలు ఏమీలేవనీ, స్వామీజీ సాక్ష్యం ఒక్కటే తనమీద కేసుపెట్టడానికి సరిపోదనీ నారాయణకు తెలుసు.

కానీ, ఊళ్లో స్వామీజీకి వున్న పలుకుబడీ దృష్ట్యా ఆయన తలచుకుంటే తనని సర్వనాశనం చెయ్యగలడు.

ఆస్తిపాస్తులకోసమే తనను లొంగదీసుకునే ప్రయత్నాలు స్వామీజీ చేస్తున్నాడని నారాయణకు నమ్మకం కుదిరింది.

తన ఆస్తిపాస్తులన్నీ స్వామీజీ ఆశ్రమానికే

 

కట్టబెట్టినా, అప్పటికి తనని బికారివాడినిచేసి ఆశ్రమంలో సేవకుడిగా మార్చిగానీ స్వామీజీ తనని వదలిపెట్టడని తోచింది నారాయణకు.

ఆ నమ్మకంతో అతని పరిస్థితి మరింత దుర్భరంగా తయారైంది. ఎన్నాళ్లని స్వామీజీ కుట్రలను చూస్తూ ఊరుకోవాలి?

స్వామీజీపై విపరీతమైన ద్వేషం పెరగసాగింది నారాయణకు.

అసలు పూర్వాశ్రమంలో స్వామీజీ బతుకు ఎటువంటిదో ఎవరికి తెలుసు? ఏ నేరాన్ని తప్పించుకోడానికి ఇంతదూరం వచ్చాడో? ఈ అవతారం ఎత్తాడో?

ఎంత పలుకుబడి, ఆస్తీ సంపాదించగలిగాడు ఈ గ్రామంలో? గొర్రెలమందవంటి ఈ జనం, 'స్వామీజీ' అంటూ వెంటబడేసరికి ఇదే లాభసాటిగా కనబడి ఇక్కడే స్థిరపడిపోయాడేమో?

ఎదుటివారి రహస్యాలను గుప్పెటలో పెట్టుకుంటే, ఆ వ్యక్తులను బానిసలుగా ఆధీనంలో పెట్టుకోవచ్చు అనే సూత్రం స్వామీజీ ఉపయోగిస్తున్నాడు. ఎవరూ స్వామీజీ మాటకు ఎదురు చెప్పలేని పరిస్థితి గ్రామంలో సృష్టించాడు.

'స్వామీజీ పెద్ద బ్లాక్‌మెయిలర్'గా కనిపిస్తున్నాడు నారాయణకు.

లేకపోతే ఇంత ఆ ఆశ్రమం ఆస్తీ, పలుకుబడి ఎలా సంపాదించాడు ఆ బికారివాడు.

ఎక్కడైనా నలుగురు మనుషులు గుంపుగా జేరి మాట్లాడుకుంటూ వుంటే నారాయణకు అనుమానం కలుగుతోంది.

తనకు ఎదురుపడిన వ్యక్తి తనను పలకరించకుండా వెళ్లిపోతే, తన సంగతి అతనికి తెలిసిపోయిందేమోననే భయం.

ఎవరైనా పలకరిస్తే వారి మాటలో, నవ్వులో తనను హేళనచేస్తున్న భావన.

మనషులనుంచీ వేరుపడి తాను ఒంటరివాడైపోతున్నట్లుగా తోచింది నారాయణకు.

ఆరోజు సాయంత్రం ఆశ్రమంవైపు ఉన్న పొలంలో పని పూర్తిచేసుకుని తొందరగా ఇంటి మొహంపట్టాడు నారాయణ.

ఆశ్రమం సమీపించేసరికి ఆశ్రమం గేటువద్ద ఆగివున్న పోలీసు జీపునుచూసి మొహం చిట్లించుకున్నాడు!

పోలీసు జీపు ఇక్కడికెందుకు వచ్చింది?

ఎవరు వచ్చారు?

నారాయణకు అరచేతుల్లో చెమటలుపట్టాయి. అడుగుతీసి అడుగు వేయడమే భారంగా తోచింది.

"హలో!"

ఎదురుగా పోలీసు సి.ఐ. యూనిఫారంలో నిలబడి వున్నాడు.

"ఏమిటిసార్.... అలా చూస్తున్నారు. నన్ను గుర్తుపట్టలేదా? పక్క ఊరికి డ్యూటీమీద వచ్చాను. స్వామీజీని దర్శించుకుని వెళ్లవచ్చని ఇటు వచ్చాను!"

సి.ఐ. మాటలకు నారాయణ గుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయాడు. గొంతు తడారిపోయింది. తల పంకిస్తున్నాడు వెర్రిగా చూస్తూ.

"ఏమిటిసార్.... మాట్లాడరు? ఈమధ్య మీ గురించి విన్నానులెండి. ఆరోగ్యం పాడయిందటగా. ఇంకా తేరుకున్నట్లు లేరు! సరే వస్తాను...." నారాయణ తలాడిస్తుండగానే సి.ఐ. జీపు ఎక్కడం, అది దుమ్ము రేపుకుంటూ వెళ్లిపోవడం జరిగింది.

అలాగే చూస్తూ నిలబడిపోయాడు నారాయణ.

"మీ గురించి విన్నానులెండి" అన్న ఆ పోలీసు ఆఫీసరు మాటే చెవుల్లో మార్మోగింది.

తన గురించి ఏమిటి అదేనా? ఆ వినడం వెంటనే ఆశ్రమానికి వచ్చి దర్యాప్తు చేస్తూ రుజువులకోసం చూస్తున్నారా?

ఏం రుజువులు?

ఏమో.... నారాయణ గుండె దడదడలాడింది.

"అదేమిటి.... అలావున్నారు? ఏమైంది?" ఆరాటంగా అడిగింది భారతి ఇంట్లో అడుగు పెట్టిన నారాయణను.

మనిషి స్నానంచేసినట్లు వళ్లంతా చెమటపట్టి తడిసి ముద్ద అయివున్నాడు. ఎటోచూస్తూ, అడుగులు తడబడతుండగా గదిలోకి నడిచి మంచంమీద వాలిపోయాడు.



నైనా పట్నం పంపించమంటారా?'' నారాయణ నుదిటమీద చెయ్యివేస్తూ ఆదుర్దాగా అడిగింది భారతి.

''భారతీ... దయచేసి నన్ను కాసేపు ఒంటరిగా వుండనివ్వు! వెళ్లు''

అలసటగా అంటున్న నారాయణకు దుప్పటి కప్పి తలుపులు దగ్గరకువేసి అవతలకు నడిచింది భారతి. నారాయణ ఒళ్లు చల్లగా తగలడంతో కాస్త ఆరాటం తగ్గింది ఆమెకు.

''ఏమండీ..., భోజనానికి లేవరూ? పోనీ కాస్త ఈ పాలైనా తాగండి'' భారతి మేలుకొలుపుతో కలత నిద్రలో వున్న నారాయణ చివాలున లేచి కూర్చున్నాడు.

ఆ కలతనిద్రలో పోలీసుజీపు, ఆ జీపులో స్వప్న చుక్కమ్మ కలసి తనని వెంటాడుతున్నారు.

తను పరుగెడుతున్నాడు. పరుగెత్తి పరుగెత్తి అలసిపోతున్నాడు.

ఒళ్ళంతా చెమటలు.

''టవలు తీసుకురా?'' అన్నాడు నారాయణ.

భారతి తెచ్చింది.

''ఏమిటండీ! ఎందుకిలా నీరసపడిపోతున్నారు? ఈ చెమటలు ఏమిటి? ఈ అలసట ఏమిటి? జ్వరం కూడాలేదే? రేపొక్కసారి పట్నం వెళ్ళి పరీక్షలు అన్నీ చేయించుకుని వద్దామండి- ముందాపాలు తీసుకోండి''

సమాధానం చెప్పకుండా భారతి చేతిలోని పాలు తీసుకుని గటగటతాగి గ్లాసు తిరిగి ఇచ్చేశాడు.

తిరిగి పడకమీద వాలిపోయాడు నారాయణ.

''ఈ ఆపిల్ ముక్కనైనా తీసుకోండి'' భారతి చాకుతో కోసి ఇస్తుంటే మౌనంగా కొన్ని ముక్కలు అందుకున్నాడు.

''ఇకచాలు భారతీ! ఆకలేస్తే తరవాత తింటాను. కాస్త నన్ను విశ్రాంతి తీసుకోనియ్యి- నిద్రవస్తోంది''

అలసటగా అంటున్న భర్త మాటలకు యాపిల్ ... టీపాయ్ మీద వుంచి తాను బయటకు నడిచింది భారతి.

కానీ ఎక్కడ విశ్రాంతి? ఆరాత్రి తెల్లవార్లూ సరిగా నిద్రపట్టలేదు నారాయణకు. మగతగా వుంది. కన్ను మూస్తే పోలీసు ఇన్స్పెక్టరూ, పోలీసు జీపే కళ్ళముందు కనిపిస్తున్నాయి.

నారాయణకు విపరీతమైన భయం, ఆరాటం పట్టుకున్నాయి.

స్వామీజీ వేస్తున్న పథకం తాను వూహించిన దానికంటే పెద్దదిగానూ, తీవ్రంగానూ తోచింది.

తన ఆస్తిపాస్తులు కాజెయ్యడం ఒక్కటే కాదు-

తనని ముందు జైలుకి పంపి, తర్వాత తన కుటుంబాన్ని, ఆస్తుల్ని స్వాధీనం చేసుకుంటాడు స్వామీజీ- అని తోచింది నారాయణకు.

ఆలోచనలతో నారాయణ తలపగిలిపోతోంది. ఏంచెయ్యాలి? ఎలా చెయ్యాలి? ఏదోవిధంగా స్వామీజీని ఓడించాలి.

స్వామీజీ రుజువులేవీ పోలీసులకు అందించకుండా చూడాలి.

రుజువులు ఏమి వున్నాయి. ఏమో... తనకు తెలియనివి ఏమేం పోగుచేశాడో ఎలా తెలుస్తుంది?

ఎక్కడో కోడికూత వినిపించింది.

నారాయణ ఉలిక్కిపడ్డాడు.

అనాలోచితంగా లేచిన నారాయణకు ఎదురుగా ఆపిల్‌పళ్ళూ, చాకూ కనిపించాయి. కడుపులో ఆకలి తెలిసివచ్చింది.

అవి జేబులో వేసుకుని, పొలం వైపు బయలుదేరాడు.

పొలంలో పంపుదగ్గర మొహం కడుక్కుని ఇంటికి తిరిగివస్తూ, ఆపిల్ పండు చేతిలోకి తీసుకుని చాకుతో చిన్నచిన్న ముక్కలు కోసుకుని నోటిలోకి ఎగరవేసుకుంటూ తినసాగాడు.

ఆశ్రమం సమీపించేసరికి, ఎదురుగా ఆశ్రమం గేటు అవతల పూజకోసం, స్వయంగా పూలు కోసుకుంటున్న స్వామీజీ కనిపించారు.

అటువేపు తిరిగి వున్న స్వామీజీ, నారాయణను చూడలేదు. గేటుదగ్గరే నిలబడిపోయా




తూరుపు తెలతెలవారుతోంది.

పూలుకోసుకుని ఇటుతిరిగిన స్వామీజీకి గేటు సమీపంలో నారాయణ కనిపించాడు.

"ఏం నారాయణా! ఎలా వున్నావు?" గేటును సమీపించారు స్వామీజీ.

తను ఎలావున్నాడు? ఆ ప్రశ్నకు నారాయణకు విపరీతమైన కోపం వచ్చింది.

స్వామీజీ నోరుమూతపడేవరకూ తనకు శాంతిలేదు! ఆరోగ్యంలేదు!! బతుకులేదు!!!

అటూ ఇటూ చూశాడు నారాయణ. ఆశ్రమంలోని స్వామి అనుచరులు తమతమ పనులలో నిమగ్నమైనట్టున్నారు. కను చూపుమేరలో ఎవరూ కనుపించటం లేదు.

"ఏంకావాలి నారాయణా?" అంటూ దగ్గరకు వచ్చారు స్వామీజీ.

అంతే! నారాయణ మనసులోని అనుమానం, ద్వేషం పెల్లుబికాయి... విజృంభించాయి. అతని చేతిలోని కత్తి అనాలోచితంగానే స్వామీజీ గుండెల్లో బలంగా దిగబడింది.

"హరేరామ్" అదే స్వామీజీ చివరి మాట.

కుప్పకూలిన స్వామీజీ గుండెల్లోంచి కత్తిని లాగుతున్న నారాయణను వెనుకనుండి గట్టిగా వాటేసుకున్నాడు- అప్పుడే ఆశ్రమం గేటు దాటి లోనికి అడుగుపెట్టిన రామస్వామి అనే అనుచరుడు.

నారాయణ ప్రతిఘటించలేదు. వణికిపోతూ వెంటనే లొంగిపోయాడు.

తన చేతిలోని రక్తసిక్తమైన కత్తిని, కింద రక్తపుమడుగులో పడివున్న స్వామీజీని చూస్తున్నాడు.

పారిపోవాలని కూడా అతనికి తోచలేదు. అతనిలో ఉన్నట్టుండి శక్తి అంతా హరించుకుపోయింది. నిర్వీర్యుడైపోయాడు. తన ప్రాణమే ఎటో ఎగిరిపోయిన భావన కలిగింది.

నారాయణను పెడరెక్కలు విరిచి పట్టుకున్న రామస్వామి "హత్య... హత్య" అంటూ కేకలు వేయనారంభించాడు.

ఆశ్రమంలోనుండి శిష్యులు ఆ కేకలు విని బైటకు వచ్చారు. అప్రతిభులై నిర్జీవ ప్రతిమలావున్న నారాయణను పట్టుకువెళ్ళి గదిలో బంధించారు.

పోలీసులకు కబురు వెళ్ళింది.

★ ★ ★

కేసువిన్న జడ్జిగారికి అంతా అయోమయంగా అనిపించింది. డబ్బు లావాదేవీలలోనూ, స్త్రీసంబంధమైన విషయాలలోనూ హత్యలు జరగడం సర్వసాధారణం.

క్రిమినల్ కేసుల్లో సాక్ష్యులను మట్టుపెట్టడం మామూలు విషయం. అలా ప్రతి హత్యకూ ఏదో ఒక కారణం వుంటుంది.

కానీ ఇదేమిటి?

స్వామీజీని ఎందుకు హత్య చేశాడో చెప్పకుండా ముద్దాయి నారాయణ మూగనోము పట్టాడు.

మొదటినుంచి చివరివరకూ అంతా మౌనమే.

షాక్‌వల్ల నారాయణ మాటపడిపోయిందని డాక్టర్లు ధృవపరిచారు.

ప్రాసిక్యూషన్‌వారు మాత్రం ముద్దాయి ఏ బలవత్తర కారణంవల్ల ఆ హత్య చేశాడో నిరూపించలేకపోయారు.

ముద్దాయి ఇష్టానికి వ్యతిరేకంగా స్వామీజీ అతని భార్య సేవలు పొందుతున్నాడనీ, ఆమె డబ్బు ముట్టచెబుతున్నదనీ, ఆ కోపంతో తన భార్యను అదుపులో పెట్టుకోలేని నారాయణ స్వామీజీని అసూయతో హత్య చేశాడని మాత్రం వాదించగలిగారు.

నారాయణ తరపు వకీలు, నారాయణకు కొన్నాళ్ళక్రితం ఆరోగ్యం క్షీణించి, తర్వాత మతిచలించిందని, ఆ స్థితిలో అతను చేసిన కారణంలేని హత్య 'పిచ్చివాని చేష్టగా' పరిగణించి విడిచిపెట్టాలని వాదించాడు.

తాత్కాలిక మతిభ్రమణం తప్ప వేరే ఏకారణమూ రుజువు కానందున జడ్జి నారాయణకు అయిదేళ్ళు కారాగార శిక్ష విధించాడు.

శిక్షాకాలంలోనూ, తరువాతా కూడా నారాయణ మళ్ళీ నోరు విప్పి మాట్లాడనేలేదు. లోలోన అతనేం ఆలోచించుకున్నాడో, జరిగిన దానికి పశ్చాత్తాపపడ్డాడో లేదో కూడా ఎవరికీ తెలియదు. 

# రచయితలకు సూచనలు




★ "చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారి వారి దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లానువేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.




దొంగలు జైలు గోడలు బ్రద్దలు
కొట్టుకొని పారిపోయింది కాక
"నాగార్జున సిమెంటు తో
రిపేరు చేయించుకోమని
సలహా రాసిపెడతారా!
MAN 121




## గాలిపటాల గారడీలు

మే5వ తేదీన జపాన్లో బాలల దినో గా పరిగణిస్తారు. అక్కడి పిల్లలంతా న ఉత్సాహంగా చేప ఆకారంలో ఉన్న టా లు ఎగురవేస్తారు. జపనీయులు ను ంవ త్సరంరోజున కూడా గాలిపటాలు రవేస్తా రు.

'స్ప్రింగ్ ఫెస్టివల్'ను పుర చుకుని అమెరికాలో గాలిపటాలు ఎగు రు.

న్యూజిలాండ్‌కి చెందిన అ న్ మోరిస్ గాలిపటానికి రంధ్రాలు చేసి లో సన్నటి లోహపు గొట్టాల్ని అమర్చాడు తర్వాత గాలి పటాన్ని ఎగురవేసినపుడు గుండా గాలి పయనించటంతో ఈలల శబ్దాలు విని పించేయి.

చైనాలో గాలిపటాల పండుగను సంవత్స రంలోని తొమ్మిదో నెల తొమ్మిదో తేదీన చేసు కుంటారు.

థాయ్‌లాండ్‌లో గాలి పటాల సమరం ఆసక్తి కరంగా వుంటుంది ప్రతి ఏడూ ఫిబ్రవరి నుండి జూన్ వరకు ఛాంపియన్‌షిప్ కోసం జపాన్లో కూడా గాలి పటాల యుద్ధాలు జరుగు తూనే ఉంటాయి. చదరపు అడుగుల వైశాల్యం గల గాలిపటాల్ని సైతం ఎగురవేసి ఆనందిస్తారు అక్కడి వారు.

మనదేశంలో నవాబుల కాలంలోనే గాలిప టాల సంబరాలు ఆరంభమైనాయి. పతంగ్, గుడ్డి, చుంగ్, కన్‌కవా... ఇలా గాలిపటాల్ని రకరకాలుగా పిలుచుకుంటారు. ఆస్ట్రేలి యాకు చెందిన లారెన్స్ హార్‌గ్రీవ్ రూ పొందించిన ఓ గాలిపటం డబ్బాలా చతుర స్రాకారంలో ఉంటుంది. దీనిని లక్నోలో, కలక త్తాలో ఎగురవేశారు.

కలకత్తాలో గాలిపటాలాడుతూ సరదాగా బెంగాలీ బాబులు 5, 10, 100 రూపా యల నోట్లని గాలిపటాలకి కట్టి ఎగురవేస్తారు.

పూర్వం గాలిపటాలు వార్తాహరుల్లా కూడా పనిచేసాయి. సంగ్రామ సమయాల్లో శత్రు రహ స్యాలని తెలుసుకోవటానికి, సమాచారాలు చేర వేసుకోవటానికి కూడా గాలిపటాల్ని ఎగురవేసే వారు. చైనీయులు తమ గాలిపటాలకి ఒకపు డు బైంపుప్యాజులని కట్టేవారు. అవి శత్రువుల పడవల్ని, స్థావరాల్ని ధ్వంసంచేసేందుకు రాకె ట్లలా ఉపయోగపడేవి.

1749లో స్కాట్లాండుకు చెందిన వెల్సన్, మెల్విన్‌లు ఒకదాని వెనుక ఒకటిగా రైలుపెట్టె ల్లా ఉండే గాలిపటాల్ని ఎగురవేశారు. ఒక్కొ క్క గాలిపటానికి ఒక్కొక్క థర్మామీటరును అతికించారు. ఇది ఆకాశంలో ఉష్ణోగ్రతను గుర్తించటానికి సాయపడింది. దీని తర్వాత 1752 లో బెంజమిన్ ఫ్రాంక్లిన్ చేసిన గాలి




వటం ప్రయోగం మెరుపు కూడా ఒక రకమైన విద్యుచ్ఛక్తేనని నిరూపించింది. ఇంగ్లండుకు చెందిన డాగ్లాస్‌ఆర్చిఫండ్ 1883 లో గాలిప టానికి యాంటిమీటరును కట్టి 1200 అడు గుల ఎత్తులో ఉన్న గాలి వేగాన్ని కొలిచాడు. 1898 లో జరిగిన స్పానిష్ అమెరికన్ యు

గంటలపాటు ఎడతెరిపిలేకుండా గాలిపటా ల్ని ఎగరేసి రికార్డు నెలకొల్పాడు. 1936 లో జపాన్లో నరుటో పట్టణంలో $9^{1}/_{2}$ టన్నుల బరువు తూగిన గాలిపటాన్ని తయారుచేశారు. దీనిని తయారుచేసేందుకు 3100 కాగితపు చుట్టలవసరమయ్యాయి.



ద్ధంలో గాలిపటాలకు కెమేరాలనమర్చి రెండు దేశాలవారూ తమ తమ శతృవీరుల్ని శిబిరా ల్ని ఫొటోలు తీసుకున్నారు. రెండవ ప్రపంచ యుద్ధంలో గాలిపటం సాయంతో రేడియో, అంటీనాని పైకి పంపించి సిగ్నల్స్‌ని చేరవేసు కున్నారు. విమానాల్ని రైట్ సోదరులు కనిపెట్ట కముందు వారి ప్రయోగాల ఫలితాల్ని గాలిప టాలను చేరేసే పెట్టెల్లోనే పంపించుకునేవారు.

1977 లో అమెరికాలోని ఫ్లోరిడా, ఫోర్ట్‌లా దర్‌డేల్ క్లబ్బు తరపున 'సన్‌రైజ్ జాన్ 169

1967లో 28 వేల అడుగుల ఎత్తుపైకి ప్రొఫెసర్ ఫిలిప్‌కుంజ్, జె.పి. కుంజ్ గాలి పటం ఎగురవేసి రికార్డు నెలకొల్పారు. 19-19 లో తూర్పుజర్మనీలోని లిండిన్‌ఫర్గ్‌నుండి 8 గాలిపటాలను వరుసగా 31965 అడు గుల ఎత్తువరకు పంపించారు. జపాన్‌కి చెందిన 'కామకురక జూహికో అనబ' ఒకే దారం పైన 1050 గాలిపటాల్ని ఎగరేసి రికార్డు బ్రేక్‌చేయటం జరిగింది.

## ఆ కవలలు

సాధారణంగా అన్ని దేశాల్లోనూ కవలపిల్లలు జన్మిస్తూనే ఉన్నా సియామిస్ కవలల జననా లు మాత్రం సదా చరిత్ర సృష్టిస్తూనే ఉన్నాయి. సియామి కవలలు ఎక్కువకాలం జీవించరు. కాని ఇరాన్‌లో పుట్టిన తలలు మాత్రం అంటు కుని వుండి మిగతా శరీరాలు విడివిడిగా వున్న కవలపిల్లల ఉదంతం ఆసక్తికరంగా ఉంది.

పధ్నాలుగేళ్ళక్రితం అంటే 1974లో అలీ రెజా అనే ఓ యువకుడు ఇరాన్‌లోని షిరాజ్ నగరపు వీధుల్లో నడచివెళ్తున్నాడు. దగ్గర్లోనే పసిపాప రోదన విన్పించగానే అతను అటు వైపు వెళ్ళిచూశాడు. ఇద్దరు కవలపిల్లలు కన్పించారు. వాలకం చూస్తే కేవలం కొన్ని గంటలక్రితమే పుట్టినట్లు తెలుస్తోంది. పైగా ఇద్దరి తలలూ అంటుకుని వున్నాయి. ఏ తల్లి



కన్నబిడ్డలోగాని తల్లిదండ్రుల పాషాణ హృదయాలకి నిదర్శనంగా వీధుల్లోని పాషాణాలపై పడి వున్నారు. అలీరెజాకి గుండెతరుక్కుపోయింది. అటూఇటూ చూశాడు. ఎంతకీ ఎవరూ రాకపోవటంతో వాళ్ళనెత్తుకుని ఇంటిదారి పట్టాడు. వాళ్ళకి లాలీ, లాడేఁలని పేర్లు పెట్టాడు.

ప్రస్తుతం ఆ పాపలకి పదునాలుగేండ్లు. హాయిగా ఉల్లాసంగా పెరుగుతున్నారు. వారిద్దరి మధ్య ఎంతో అవగాహన ఉంది. ఒకరిపట్ల ఒకరికి అవమానానురాగాలూ అధికంగానే వున్నాయి. వాళ్ళిద్దరూ పోట్లాడుకోవటం ఎవరూ చూళ్ళేదు- ఒకరికొకరు బాగా సహకరించుకుంటారు. నిద్రపోయినా, లేచినా, స్నానం చేసినా, భోంచేసినా, వాళ్ళిద్దరూ కలిసే చేయవలసివుంటుంది. లాడేఁ మరో పనిలో వున్నా లాలీ పడుకుందామంటే తనూ నిద్రకుపక్రమిస్తుంది. అలాగే లాడేఁ సైకిల్ తొక్కుదామనో, సినిమా కెళ్దామనో అంటే లాలీ తనకు ఇష్టమున్నా లేకపోయినా లాడేఁ కోసం తనూ సిద్ధపడుతుంది. వాళ్ళ అన్యోన్యత చూసి వారి పెంపుడు తండ్రి అలీరెజా కూడా ఆశ్చర్యపోతుంటాడు. అతను ఎవరైనా సిద్ధహస్తుడైన సర్జన్ తారసపడితే ఆపరేషన్‌తో వారి తలలను వేరు చేయించాలని ప్రయత్నిస్తున్నాడు. మరో నాలుగయిదేళ్ళుపోయాక వారికి వివాహాలు చేయటం ఎలాగా అని మధనపడే ఆ తండ్రి అమెరికాలో ప్రముఖ సర్జన్లు ఉచితంగా శస్త్రచికిత్స చేస్తామన్నా అంగీకరించలేదు. ఎన్నో సంస్థలు ఖర్చులనిమిత్తమై ధనసాయం చేయడానికి ముందుకువచ్చినా అతను మృదువుగా నిరాకరిస్తాడు. ఎందుకంటే ఆపరేషన్‌కోసం అమెరికాకే వెళ్ళక్కరలేదని అతని అభిప్రాయం. ప్రస్తుతం ఇరాన్‌లో రాజకీయాలు అల్లకల్లోలంగా వున్నందున అంతా సద్దుమణిగాక ప్రశాంత శాంత వాతావరణంలో ఇరానియన్ డాక్టర్లతోటే ఆపరేషన్ చేయిస్తానంటున్నాడు.

## పిస్తోలు పురాణం

'పిస్తోలు' అనే పదం ఇటాలియన్ 'పిస్తోలియా' నుండీ ఉద్భవించింది. పూర్వకాలంలో తయారైన పిస్తోళ్ళు రెండున్నర అడుగుల పొడుగుండేవి. మొయ్యటానికి బలశాలురే పనికొచ్చేవారు. అందరికీ అందుబాటులో లేనందువలన, సులువుగా ప్రయోగించటానికి అనువుగా కూడా లేనందున పిస్తోలును ఆధునీకరించటానికి ప్రయత్నాలు జరిగాయి. ఫలితంగా 1540లో చేతిలో సులువుగా ఇమిడేపో

గల చిన్నసైజు పిస్తోలును 'కామెన్‌లియో విల్లాటియో' రూపొందించాడు. అవి ఎన్నో ప్రయోగాలకు గురై గుణవిశ్లేషణ జరిగాక 1550 నుండి విస్తృతంగా వాడుకలోకి వచ్చాయి. 1600లో దానినే మరింత ఆధునీకరించి బుల్లెట్లను ప్రయోగించేందుకు సులువుగా తీర్చిదిద్దారు. క్రీ.శ. 1600 నుండి 1700 వరకు పిస్తోలు ఆకృతుల్లో ఎన్నో మార్పులు జరిగాయి.

అమెరికాలో జరిగిన అంతర్యుద్ధాలలో ఆ రోజుల్లో ఫ్రాన్స్‌లో తయారైన పిస్తోళ్లను పరస్పరం ప్రయోగించుకున్నారు. కానీ ఈ పిస్తోళ్ళన్నీ ఒకసారి పేలిస్తే ఒకే ఒక బుల్లెట్ మాత్రమే వెలువడే విధంగా వుండేది. ఒకే తడవకు ఎన్నో బుల్లెట్లను కాల్చగల రివాల్వరును బ్రిటన్‌కు చెందిన సామ్యూల్ కోల్ట్ తొలిసారిగా 18-35లో తయారుచేశాడు. కాని దట్టమైన పొగలు కమ్ముతున్నాయని వాటి వాడకం ప్రాచుర్యం పొందలేదు. దాంతో సామ్యూల్ ఎంతో కృషిచేసి ఆరుబుల్లెట్లు పేల్చగల పిస్తోలును రూపొందించాడు. ఈ కొత్త మోడలు పిస్తోలును 'డెరిన్‌గర్'లంటారు. ఆ తరువాత స్మిత్ వేసన్ ఆటోమేటిక్ పిస్తోలును తయారుచేసినా ఇది జనాదరణకి నోచుకోలేదు.

1898లో 'హుకోపోర్చరిడ్' అనే అమెరికా దేశస్థుడు పూర్తి ఆటోమెటిక్ పిస్తోలును రూపొందించాడు. దీన్నే మనం ప్రస్తుతం 'రివాల్వరు'గా పిల్చుకుంటున్నాం. 1911లో తొలిసారిగా 'అమెరికన్ సైన్యం' ఈ ఆటోమేటిక్ రివాల్వర్లను వాడటం జరిగింది.

ప్రస్తుతం రివాల్వర్ విజ్ఞానం ఎంతో పురోగమించింది. సూపర్ సెన్సిటివ్, ఇన్‌ఫ్రారెడ్, సైలెన్సర్ రివాల్వర్లు అందుబాటులోకి వచ్చాయి. బుల్లెట్లకు సైనైడ్ పూసి అమ్ముతుంటారు. బుల్లెట్‌కు సైనైడ్ కోటింగ్ వున్నందున బుల్లెట్ దేహంలోకి దూసుకువెళ్ళకున్నా గుచ్చుకుంటే చాలు. మరణం తథ్యం.

పిస్తోలును ఇటాలియన్లే కనుగొన్నా దాన్ని ఆధునీకరించిన ఘనత అమెరికా, బ్రిటన్‌లకే దక్కుతుంది.




## జెంట్స్ ఫస్ట్

ఆడవాళ్ళు అలక వస్తే ధారాపాతంగా అశ్రువర్షం కురిపిస్తారని నవ్వే వాళ్ళకి అదే వారి దీర్ఘాయువుకి మూలకారణమని తెలీదు. పాపం!

మానవశరీరంలోని హార్మోనుల్లో కొన్ని స్త్రీలకే పరిమితం కాగా కొన్ని పురుషులకి పరిమితమైనవి. మరికొన్ని ఉభయుల్లోనూ సమానంగా వున్నవి.

సంబంధించిన వ్యాధులు స్త్రీలకే వస్తాయి. అలాగే కొన్ని వ్యాధులు పురుషులకి మాత్రమే సోకుతాయి.

ఎక్కువగా రోడ్లమీద తిరిగేది పురుషుడేగనుక చాలావరకు యాక్సిడెంట్లద్వారా ప్రాణాలు కోల్పోవటం జరుగుతుంది. పొగపీల్చటం, మద్యం పుచ్చుకోవటం కూడా ఆయుఃపరిమితిని తగ్గిస్తుంది. స్త్రీలకి ఈ సమస్య అంతగా లేదు గనుక వారు దీర్ఘకాలం జీవిస్తుంటారు.

ఇలాంటి ఎన్నో కేసులు పరిశీలించి పరిశోధించిన సైంటిస్ట్ డాక్టర్ ఒస్లేమాడ్రిక్ పురుషులకంటే స్త్రీలే ఎక్కువకాలం జీవిస్తారని వెల్లడించాడు. జన్యుశాస్త్రం ప్రకారం స్త్రీలో 'XX' క్రోమోజోములుండగా, పురుషుడిలో 'XY' క్రోమోజోములుంటాయి. ఈ 'XX' (రెండుసార్లు) రెండూ ఉండటంవల్ల స్త్రీలలో రోగనిరోధక శక్తి ఎక్కువ. అల్సర్, గుండెజబ్బులూ లాంటి వ్యాధులు కూడా మగవాళ్ళనే వరించటం బోలు అవి వాళ్ళదరిదాపులకి చేరవు.

దిగుళ్ళూ, బాధలూ, కష్టాలూ సమస్యలు ఎక్కువైతే ఓర్చుకోలేక స్త్రీలు పడే బాధ కన్నీళ్ళ రూపంలో కరిగిపోతుంది. గుండెభారం పెరుగదు. కాని మగవాళ్ళు కష్టాల్ని భరించి గుండెదిటువు చేసుకుంటారు. అందుకే ఎదభారమై గుండె జబ్బులకి దారితీస్తుంది. రక్తపోటు, గుండెనొప్పి, మధుమేహం వంటి వ్యాధులు సైతం ఎక్కువగా మగవాళ్ళకే వస్తాయి. అందుకే వీరి ఆయుర్దాయం తక్కువ. 15 శాతానికి పైగా స్త్రీలకు దీర్ఘాయువుకి అవకాశాలెక్కువగా ఉన్నట్లు పరిశోధనలు వెల్లడించాయి.

అంతటా 'లేడీస్ ఫస్ట్' అనే మాట విని భరించలేకే కాబోలు జెంట్స్‌మాత్రం ఒక్క విషయంలోనైనా ఫస్టుండాలని కనీసం 'మరణం'లోనైనా తమ ఆధిక్యత నిలబెట్టుకుంటున్నారు కొందరు వీరపురుషులు. ★

# నాటి వైభవ ప్రాంగణాలు



ఫొటో ఫీచర్

వ్యాఖ్యలు: జ్యోతిరాణి

కళలకాణాచియై నిలిచిన మహాభవనం!
సరసనే సరసులో సాగేను నావల పయనం!!

ఫొటో:
సూరజ్ యన్. శర్మ



చాంద్‌మినార్ దౌల్తాబాద్ కీర్తిపతాక!
పాదుషా అభిరుచులకు అతిచక్కని ప్రతీక!!

ఫొటో: గీతాదత్త



మైసూరు మహారాజ భవనం!
అభినవమయుల అపురూప నిర్మాణం!!

ఫొటో: కె.విజయకుమార్



మైసూరు చాముండేశ్వరి ఆలయం!
శిల్పి ప్రతిభకు పట్టిన దర్పణం!!

ఫొటో: కె. విజయకుమార్



ధాన్యంతో పిక్కటిల్లే ఈ గోల్‌ఘర్!
నిలువలతో శోభించెను పాట్నానగరు!!

ఫోటో: కె.యన్. మహరోత్ర



లక్నోలోని బారా ఇమాంబార!
చాటుతోంది మతవిశ్వాస పరంపర!!

ఫొటో: గీతాదత్త



కళారాధకుల కనులపంట
కేరళ మనోహర దృశ్యాలేనంట!!

ఫొటో: యస్.జి. శేషగిరి



ప్రశాంతశాంతుల నిలయం!
సారనాథ్ దేవాలయం!!

ఫొటో: కె.యన్. మహరోత్ర



శిల్ప ప్రతిభ విరబూసిన నందనం!
మహాబలిపుర మహాదేవుని రసమనోజ్ఞ మందిరం!!

ఫొటో: వి. తీతు



సాగరజలాల ప్రతిఫలించె!
ఆలయశిఖరాలు నింగిసోయగాలు!!

ఫొటో: వి. ముత్తురామన్



విశ్వనాథునికి విశ్వమంతా గుడులే!
అన్ని హృదయాలయాలు కైలాస గిరులే!!

ఫొటో: కె.యన్. మహరోత్రా



శిథిలాలై మిగిలిన వేలూరు కోట!
గతకాలపు వైభవాల జ్ఞాపకాల ఊట!!

ఫొటో: టి.యస్. ఈశ్వరరావు



తిరుచెందూరు సాగరతీరాలు!
కాలుష్యాలకు బహుదూరాలు!!

ఫొటో: మహంతేష్



అమరశిల్పుల అద్భుత కళాచాతుర్యాలు!
ఖజురహో దేవాలయ ప్రాభవాలు! ప్రాంగణాలు!

ఫోటో: పి.యం. వరప్రసాదరావు



తంజావూరు యశోవైభవం!
మాహేశ్వరుని బృహదీశ్వరాలయం!!

ఫోటో: మహంతేష్



రసహృదయ స్పందనం!
ఈ తిరుచ్చి మందిరం!!

ఫొటో: వి. ముత్తురామన్



లడఖ్ పరిసరాలు మనోహరంగా వున్నా!
వసుంధర ఉదరాన రాళ్లు మోసేనన్నా!!

ఫొటో: అజయ్.యస్.యన్.

N నారాయణ కోచింగ్ సెంటర్, నెల్లూరువారి ఆధ్వర్యంలో

N నారాయణ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీ

నారాయణనగర్, బ్రహ్మదేవం, నెల్లూరు.



# సీనియర్ ఇంటర్ క్లాసులు

# 27-4-88 నుండి ప్రారంభమైనవి

ఇతర కళాశాలల్లో మొదటి సంవత్సరం ఇంటర్ (M.P./Bi.P.) చదివిన విద్యార్థులు మా కళాశాలలో రెండవ సంవత్సరం ఇంటర్ చేరవచ్చును. జూనియర్ ఇంటర్‌లో ప్రవేశం కోరువారు రూ. 10/- M.O/D.D. ద్వారా పంపి అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టస్ పొందవచ్చును.

N నారాయణ రెసిడెన్షియల్ స్కూల్

నారాయణ నగర్, బ్రహ్మదేవం, నెల్లూరు.

8, 9, 10 తరగతులకు అడ్మిషన్లు కోరువారు రూ. 10/- M.O/D.D. ద్వారా పంపి అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టస్ పొందవచ్చును.

కరస్పాండెంట్

# చతుర ఫీచర్

మల్లెలు, మామిళ్ళు, కోకిలగానం, వేడిగాలుల పొగలు, చల్లటి సాయంకాలం వేసవి కాలానికి గుర్తులు.

వేసవి వచ్చిందంటే గొంతు చల్లదనం కోసం తహతహలాడుతుంది. ఆ సమయంలో చప్పున గుర్తుకొచ్చేది చల్లటి పానీయం. ఆ వెంటనే కూల్‌డ్రింకు వైపు దృష్టి మళ్లడం సహజం. మన ప్రబంధాలు, ప్రాచీన కావ్యాల లోని శీతల పానీయాల ప్రస్తావనలు ఆహ్లాదం కలిగిస్తూ, నోరూరిస్తాయి. అలాగే ఈనాటి వత్రికలు, టి.వి. వంటి ప్రచార సాధనాలలో అత్యంతా కర్షణీయంగా కన్పించే కూల్‌డ్రింకుల ప్రకటనలు మన దాహాన్ని మరింత హెచ్చిస్తాయి.

సీసాలలో కూల్‌డ్రింకును సరఫరా చేసే పద్ధతి యూరప్‌లో 16వ శతాబ్దంలోనే ప్రారంభమైంది. 1757లో డాక్టర్ విలియమ్ కోవెన్ నీటిని ఐస్‌గా మార్చే యంత్రాన్ని రూపొందించాడు. ఆ తరువాత మిస్ రాలెండిల్ హర్మన్, థామస్ హెన్రీ మొదలైన వారు సోడావాటర్ కనుగొన్నారు. సోడా నీటిలో ఎసెన్స్ కలిపి రుచికరమైన పానీయంగా మార్చిన ఘనత జర్మనీకి చెందిన స్పిక్‌మెన్‌కి దక్కింది. అలా కూల్‌డ్రింకు పుట్టుక జరిగిందని చెప్పవచ్చు.

మనదేశంలో ఈనాటి కూల్‌డ్రింక్స్ చలామణిలోకి రాకముందు గోలీసోడా ఎక్కువగా వాడకంలో వుండేది. లెమన్‌సోడా, జింజిర్‌సోడా, ఆరెంజ్ సోడాను ఇష్టపడి తాగేవాళ్ళు. తోపుడు బళ్లలో అడుగున బాగా ఎండుగడ్డి పేర్చి చుట్టూ గోనె సంచుల్ని మడిల్‌గా పెట్టి, సీసాల పైన కూడా ఈ సంచుల్ని పరుస్తారు. మధ్య మధ్య సంచుల్ని నీటితో తడపడం వల్ల సీసాలు, వాటిలోపలున్న ద్రవం కూడా చల్లపడు





తుంది. ఎండలతో తడారిపోతున్న గొంతుల్ని చల్లబరిచి సేదతీర్చే గుణం వీటికుండటం వలన తరువాతికాలంలో ఎంత చల్లని ఆకర్ష ణలు వచ్చినా ఇప్పటికీ ఇవి వాడకంలో వున్నాయి.

ఈనాటి కూల్‌డ్రింక్సు మార్కెట్‌లోకి వచ్చాక సోడాల గిరాకీ కొంత సన్నగిల్లిందిగానీ ప్రా రంభంనుంచి కూడా మనదేశంలో శీతలపానీ యాల అమ్మకాలు చెప్పుకోదగ్గవిగానే వున్నాయి. కూల్‌డ్రింకు మార్కెట్లోకి మొట్టమొ దట అడుగుపెట్టింది కోకాకోలా. కూల్‌డ్రింకు అనగానే కోకాకోలాయే అన్నంతగా గతంలో ఆ డ్రింకు ప్రచారంలో వుండేది. కోకాకోలా రుచి వేరే ఇతర శీతలపానీయానికి లేకపోవడం వల్లనే అంతగా అది ప్రజాదరణ పొందింది.

కోకాకోలా రుచి ఎంత ప్రసిద్ధో దాని వెనకను న్న చరిత్ర కూడా అంత ప్రసిద్ధిగాంచింది.

1885లో జాన్‌స్మిత్ పెంబర్టన్ కోకో ఆపిలు, కోలాగింజలు, సుగంధ ద్రవ్యాలు మొదలైనవి కలిపి ఓ పానీయం తయారుచేశా డు. ఉత్తేజాన్ని ఆహ్లాదాన్ని కలిగించే పానీ యంగా కోకాకోలా అప్పట్లో ప్రఖ్యాతిగాంచింది.

అందులో వైన్‌శాతం హెచ్చుగా వుండటాన మొదట్లో దానిని ఫ్రెంచ్‌వైన్ అని కూడా అనే వారు. కాని ప్రజలు దానిని ఇష్టపడకపోవ డంతో కోకాకోలా ఫార్ములా నుంచి వైన్‌ను తొలగించారు. కోకో ఆకుల రసాన్ని మరింత పలుచగా మార్చి, ఆఫ్రికా ''హెల్‌సీడ్'' నుంచి కోలా ద్రవాన్ని ఉత్పత్తి చేసి కోకో ద్రవాన్ని కోలా ద్రవాన్ని కలగలిపి ఒక కొత్తపానీయాన్ని తయారుచేశారు. అయితే ఈ రెండింటి మి శ్రమం చేదుగా ఉండటాన చక్కెర, కొన్నిర కాల ఫ్లేవర్లు కలిపి ఆ పానీయానికి కోకాకోలా

అని నామకరణం చేశారు. కూల్‌డ్రింకుగా కాక మొదట్లో ఇది ఔషధంగా అమ్ముడుపోయేది. ఆ తరువాత కోకాకోలా ఆరోగ్యకరమైన, రుచికరమైన పానీయంగా పరిగణనపొందుతూ వచ్చింది. ఇప్పటికీ చైనాలో కోకాకోలా వంటి పానీయాన్ని నిమ్మరసంతో కలిపి వేడిచేసి దగ్గుకు మందుగా వాడుతున్నారు.

కోకాకోలా ఫార్ములాను వ్యాపార దృష్టిలో అత్యంత రహస్యంగా కాపాడేవారు. దాని అధినేత అయిన పెంబర్టన్ కోకాకోలా ఫార్ములాను తన భాగస్తుడైన ఫ్రాంక్‌రాబిన్‌సన్ కుమారుడు ఛార్లెస్‌కి మాత్రమే వెల్లడిచేశాడట. తరువాత ఆ ఇద్దరి నుంచీ మరో ముగ్గురు కొనుగోలు చేశారు. చివరికి **1888**లో ఆ ఫార్ములా వీరి నుంచి జి.కాండ్లర్ అనే వ్యక్తికి చేరింది. అదే సంవత్సరం పెంబర్టన్ మరణించాడు. కాండ్లర్ కోకాకోలా ఫార్ములాకున్న విలువను గ్రహించి, దానిని రహస్యంగా వుంచాలని నిర్ణయించుకున్నాడు. అప్పటికే ఆ ఫార్ములా గురించి ఏడుగురికి తెలిసిపోవటంవల్ల దాని రహస్యం కాపాడటం కోసం ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఫ్రాంక్ రాబిన్‌సన్‌ను వ్యాపార భాగస్తుడిగా చేసుకొని తన శక్తి యుక్తులను ఉపయోగించి ఆ ఫార్ములాలో మరికొన్ని ప్రయోజనకరమైన మార్పులు తెచ్చాడు. దానివల్ల పెంబర్టన్ ఫార్ములా తెలిసినవారికి కూడా ఈ కోకాకోలా రహస్యం అంతుచిక్కకుండాపోయింది.

**1892**లో కాండ్లర్, రాబిన్‌సన్ మరో ముగ్గురు కలిసి కంపెనీ ప్రారంభించారు. అసలు డ్రింకు తయారుచేయడానికి కావలసిన మూలద్రవాన్ని మాత్రం వీరిద్దరే తయారుచేసేవారు. ఆ రహస్యం మూడోవారికి తెలీదు. అయితే కంపెనీ అభివృద్ధి చెందుతున్నకొద్దీ .వారిద్దరే ఆ పని చేస్తుండటం కష్టతరమై పోయింది. అందువల్ల లాబ్‌లో కొంతమందిని నియమించి, ముడి పదార్థాల పేర్లు వారెవరికీ తెలియకుండా వాటిపైన కోడ్ నంబర్లు వేసి, లాబరేటరీకి తాళాలు బిగించి ఆ ఫార్ములా రహస్యాన్ని పకడ్బందీగా దాచేశారు. లాబరేటరీ సిబ్బందికి అదెలా తయారయిందీ తెలిసేది కాదు.

తెలునుకోవడానికి, తెలియకపోయినా తెలిసిన ట్టు ప్రపంచాన్ని నమ్మించడానికి చాలామంది ప్రయత్నించారు. అయినా ఎన్నో అడ్డంకులె దుర్కొని తనదే పైచేయిగా నిలిచింది కోకా కోలా.

కోకాకోలా ఫార్ములాను అంత రహస్యంగా వుంచడంవల్ల చాలా దేశాలలో దీనిని గురించి అనుమానాలు రేకెత్తాయి. ఇది అనారోగ్యహేతు వని ఎంతోమంది గొడవపెట్టారు. ఫలితంగా అప్పుడప్పుడే వృద్ధిలోకి వస్తున్న పెప్సికోలా బలం పుంజుకోసాగింది.

కోకాకోలాకు దీర్ఘకాలం ప్రత్యర్థిగా మారిన పానీయం పెప్సికోలా. దీనిని **1898**లో నార్త్ కెరోలినాలోని న్యూజెర్న్ నివాసి కాలర్ బ్రథమ్ తయారుచేశాడు. కోలా గింజలు తక్కువ పాళ్లలో వుండటాన కోకాకోలా, పెప్సీకోలాల రుచిలో చాలా దగ్గరి సంబంధం ఉందంటారు.

**1980**లో జరిగిన మాస్కో ఒలింపిక్స్ పెప్సికోలా అభివృద్ధికి ఎంతో దోహదపడింది. అప్పటివరకూ అన్ని ఒలింపిక్స్‌ల్లోనూ కోకాకోలా ఒలింపిక్స్ పానీయంగా నిర్ణయించబడేది. అలా ఎన్నికయిన ఒలింపిక్స్ పానీయానికి దాదాపు **1600** కోట్ల రూపాయల అమ్మకాలు వుంటాయి. పైగా ఒలింపిక్స్ పానీయంగా గుర్తించబడిన కూల్‌డ్రింకుకి విశేష ప్రచారం లభిస్తుంది. మాస్కో ఒలింపిక్స్‌లో కూడా కోకాకోలాకు గుర్తింపుపొందడానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. కానీ రష్యన్లు పెప్సీకోలానే ఎన్నుకొన్నారు.

అప్పటికే కోకాకోలాను మన దేశంతోపాటు ఫ్రాన్స్, స్పెయిన్, క్యూబా, పోలాండ్, హంగరి, యుగొస్లావియా మొదలైన దేశాలు నిషేధించాయి. ఫలితంగా కమ్యూనిస్టు దేశాలలో కోకాకోలా స్థానంలో పెప్సీకోలా వృద్ధి చెందనారంభించింది.

కోకాకోలా లాటిన్ అమెరికాలో అగ్రస్థానంలో వుంటే, పెప్సీకోలా వెనిజులాలో ప్రథమస్థానంలో వుంది. **1960**లో ఇజ్రాయెల్‌లో కోకా



కోలా కంపెనీ బాట్లింగ్ హక్కు సంపాదించింది. పెప్సీకోలా మధ్యప్రాచ్య దేశాలలో చోటుచేసుకొంది. కోకాకోలా మొదట్లోనే పశ్చిమ యూరప్‌లో స్థానం సంపాదిస్తే, పెప్సీకోలా తూర్పుయూరప్‌లో తిరుగులేని విజయం సాధించింది. **1959**లో పెప్సీ కంపెనీవారు రష్యాతో, **1978**లో కోకాకోలావారు చైనాతో ఒప్పందం కుదుర్చుకున్నారు. **1981** నాటికే రష్యాలో ఆరు పెప్సీకోలా ప్లాంట్లు పనిచేస్తున్నాయి. ఆహారోత్పత్తి, దీర్ఘకాలిక సాంకేతిక సహాయం మొదలైనవాటిల్లో తన సహాయం అందజేస్తానని ఒప్పందం కుదుర్చుకొని చైనా మార్కెట్లో ప్రవేశించింది కోకాకోలా.

ఈ విధంగా ప్రపంచదేశాలలో నగం దేశాలు కోకాకోలాను, నగం పెప్సీకోలాను ఆదరిస్తున్నాయి.

ఇదివరలో మనదేశంలో కోకాకోలా బాట్లింగ్ కంపెనీలు **22** వుండేవి. వాటి అమ్మకాల వల్ల వచ్చే విపరీతమైన లాభాలు అమెరికాకు తరలిపోతున్నాయనే దృష్టితో **1977**లో అప్పటి జనతా ప్రభుత్వం మనదేశంలో కోకాకోలా అమ్మకాలను నిషేధించింది.

రుచిలోనే కాకుండా సీసా ఆకారం, నాణ్యతలో కూడా తన ప్రత్యేకత నిలబెట్టుకోవాలనే ఉద్దేశంతో కోకాకోలాపై నిషేధాజ్ఞలు రాగానే మనదేశంలో వాడుతున్న సీసాలన్నింటినీ ఆ కంపెనీ ధ్వంసంచేయించింది. దానివల్ల ఎదురయ్యే నష్టాన్ని కూడా లెక్కచేయలేదు. తరువాత మనదేశంలో కోకాకోలా స్థానంలో "డబుల్ సెవెన్"ను ప్రవేశపెట్టారు. కానీ అది అంతగా ప్రజాదరణ పొందలేదు.

ప్రస్తుతం మనదేశంలో ఎన్నో కూల్‌డ్రింకు కంపెనీలున్నాయి. వాటిలో కాంపాకోలా, పార్లే గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్, మాక్‌డోవెల్, డక్కన్ బాటిలింగ్ చెప్పుకోదగ్గవి.

కోకాకోలాను నిషేధించిన తరువాత పార్లేకంపెనీవారి గోల్డ్‌స్పాట్, థమ్స్అప్ ప్రజాదరణ పొందాయి. ఇవేకాక చాలారకాల కూల్‌డ్రింక్స్ పుట్టుకొచ్చాయి. ఇదే మంచి అవకాశంగా ఛోటా మోటా సంస్థలెన్నో విపరీతమైన లాభాలను ఆర్జించడం ప్రారంభించాయి.

కేవలం వేసవికాలంలోనే కాకుండా అన్ని కాలాల్లోనూ వీటి ఉపయోగం అధికమవుతూ వచ్చింది. ధరల పెరుగుదలతోపాటు వీటి అమ్మకాలు కూడా దినదినాభివృద్ధి చెందుతూ వచ్చాయి. తెల్లారేసరికల్లా మార్కెట్‌లో రూపంలోనూ, రుచుల్లోనూ, రంగుల్లోనూ రకరకాల కూల్‌డ్రింకులు మనముందు ప్రత్యక్షమవుతున్నాయి. దేనిని ఎన్నిక చేసుకోవాలో తెలియక కొట్టుమిట్టాడుతున్నాడు వినియోగదారుడు.

1978 నుండీ కూల్‌డ్రింక్స్ అమ్మకాల్ని పరిశీలించినట్లయితే ఇప్పటివరకూ వాటి ఉత్పత్తి ఎంతగా అభివృద్ధి చెందిందో అవగతమవుతుంది. 1978లో 575 మిలియన్ బాటిల్స్ వినియోగం అయ్యాయి. 1979లో 810 మిలియన్ బాటిల్స్, 1980లో 960 మిలియన్ బాటిల్స్, 1981లో 1,150 మిలియన్ బాటిల్స్, 1982లో 1,310 మిలియన్ బాటిల్స్, 1983లో 1,500 మిలియన్ బాటిల్స్ అమ్ముడవుతూ వచ్చాయి. 1985 కల్లా ఈ అమ్మకాలు కాస్తా వేగం పుంజుకుని ఈ సంవత్సరంలో 2,050 మిలియన్ బాటిల్స్ అమ్ముడయ్యాయి. 1986లో 2,300 మిలియన్ బాటిల్స్, 1987లో 2,520 మిలియన్ బాటిల్స్ అమ్ముడయ్యాయి. దీనిని బట్టి కూల్‌డ్రింక్స్ అమ్మకాలు రోజురోజుకూ ఎక్కువవుతున్నాయేగానీ తగ్గడంలేదని స్పష్టమవుతోంది.

కొంతమంది ఉత్పత్తిదారులు సీసా ఆకారానికి, మూతలకి, సీసా నాణ్యతకి ఎక్కువ ప్రాముఖ్యతనిస్తున్నారు. సీసాల్లోనే కాకుండా, అట్టడబ్బాలలో, కవర్లలో కూడా ఇప్పుడు కొత్తగా కూల్‌డ్రింకులు తయారవుతున్నాయి. ఓ పక్క రుచికి, మరోవక్క సీసాలపైన, డబ్బాలపైన, కవర్లపైన రంగురంగుల రాతలతో ఆకర్షణీయంగా కనిపించడానికి చాలా కృషిచేస్తున్నారు.

గోల్డ్‌స్పాట్, థమ్స్అప్ ఇవేకాక లింకా, మజా, స్ప్రింట్, థ్రిల్, డబల్‌కోలా, కాంపాకోలా, స్పెన్సర్స్, రష్ వంటి రకాలు ప్రస్తుతం మన ప్రజల దాహాన్ని తీరుస్తున్నాయి. వీటితోపాటు నీళ్లు కలుపుకొని తాగే రకరకాల స్క్వాష్‌లు,



రస్నా ట్రింకాలాంటి పొడులు, ద్రవాలు కోకొల్లలుగా వున్నాయి.

అయితే నిజంగా దప్పిక తీర్చేగుణంగాని, ఆహార విలువలుగాని కూల్‌డ్రింక్సులో వుండవు. రుచి, గ్యాస్ తప్ప మరే సుగుణం వీటిలో వుండదు. "సోమా" ఫ్రూటీవంటి వాటిలో తప్ప కూల్‌డ్రింక్స్‌లో వుండేది కేవలం ఎస్సెన్సు మాత్రమే.

ఇన్నిరకాల కూల్‌డ్రింకులు అందుబాటులో వున్నా వాటి ధరలు మాత్రం మార్కెట్‌లో సామాన్యుడి జేబుతో దోబూచులాడుతున్నాయి. అలాంటి సందర్భాల్లో సీసా పానీయాలకి ప్రత్యామ్నాయంగా అక్కడికక్కడ తయారుచేసి ఐస్‌వేసి, గ్లాసుల్తో ఇచ్చే రసాలతో తృప్తిపడుతున్నారు. నిజానికి ఓరకంగా ఖరీదైనవాటితో పోలిస్తే ఆరోగ్యానికి ఇదే మంచివి. రోడ్లపక్కన వుండే చెరకురసం బండ్లు, ప్రత్యేకంగా వెలిసే లస్సీషాపులు, ఫ్రూట్‌జ్యూస్ షాపుల్లో అప్పటికప్పుడు తయారుచేసి ఇచ్చే పైనాపిల్, ఆరేంజ్, గ్రేప్, లైమ్ జ్యూసులు కల్తీలేని తాజా పానీయాన్ని అందజేస్తాయి. ఐసు, చక్కెర వేసిన చిక్కటి మజ్జిగ సువాసనలు వెదజల్లుతూ మండుటెండలో అలసిపోయినవారికి చల్లని హాయిని కలిగిస్తుంది.

వివిధ రకాలైన పళ్లతో పానీయాలుచేసి వేసవి వెళ్లేంతవరకూ పదిలపరచుకొని తరచూ సేవించేందుకు వీలుగా కేనింగ్ కేంద్రాలు సీసాల్లో భద్రపరచిన జ్యూస్‌లను అందిస్తున్నాయి. మామిడి, యాపిల్, జామ, ద్రాక్ష నిమ్మ, కమలాఫలాల రసాలు నగటు మనిషి అందుబాటులో వుంటున్నాయి. కాని ఎండలు మండేనాటికి శీతల పానీయాల ధరలు కూడా మండిపడుతూ సామాన్యులకు ఎండమావులుగా మారుతున్నాయి. ధర తక్కువయినా స్థానికంగా తయారయి ప్రసిద్ధిలేని పానీయాలు వెనకబడిపోతుంటాయి. వాటి పరిశుభ్రత మీదా, రుచిమీదా తగినంత నమ్మకం లేకపోవటం కూడా అందుకు ఒక కారణం. అందువల్లనే శాస్త్రీయంగా తయారై పరిశుభ్రంగా అందే 'సోమా' వంటి పానీయాలు ఇటీవలికాలంలో ప్రసిద్ధిలోకి వచ్చాయి.





కోకాకోలాను నిషేధించిన తరువాత గత పదేళ్లలో ఇండియన్ సాఫ్ట్ డ్రింక్స్ అమ్మకాలు నాలుగురెట్లు పెరిగాయి. మన మార్కెట్లో కూల్ డ్రింక్స్ ధరలు ఇతరదేశాల మార్కెట్‌తో పోలిస్తే ఎక్కువనే చెప్పాలి. నగటున నంవత్సరానికి మనదేశంలో మనిషికి మూడు బాటిల్స్ చొప్పున అమ్ముడవుతే అదే పాకిస్తాన్‌లో 13, థాయ్‌లాండ్‌లో 38, ఈజిప్టులో 63 బాటిల్స్ అమ్ముడవుతున్నాయి.

ధరలు ఎలా వున్నా యాభైలక్షల పెట్టుబడితో ప్రారంభించిన పార్లే కంపెనీ ఈనాడు అమ్మకాల్లో ప్రథమస్థానంలో వుంది. గత కొన్నేళ్లుగా అధిక లాభాలను నంపాదిస్తూ ఇండియన్ సాఫ్ట్ డ్రింక్స్ మార్కెట్‌లో ఏకఛత్రాధిపత్యం వహిస్తున్న కంపెనీ పార్లే. వీరి ఉత్పత్తులు మార్కెట్లో నగానికి పైగా ఆక్రమించుకుంటే, కాంపాకోలా, థ్రిల్‌ను ఉత్పత్తి చేసే నంస్థలు మిగతాభాగాన్ని ఆక్రమించుకున్నాయి.

ప్రస్తుతం మనదేశపు కూల్‌డ్రింక్స్ నంస్థలన్నీ ఇక మాకు తిరుగులేదని నంబరపడుతున్న నమయంలో, పెప్సీకోలాను మన మార్కెట్‌లోకి ప్రవేశపెట్టాలనే కొందరి ఆలోచన అశనిపాతంలా తయారయ్యింది. పెప్సికోలాను మన మార్కెట్‌లోకి ప్రవేశపెట్టడాన్ని చాలా నంస్థల వారు, వ్యక్తులు, పార్టీలు వ్యతిరేకిస్తున్నాయి. గతంలో కోకాకోలా మాదిరిగానే పెప్సీకోలా చలామణిలోకి వస్తే ఇప్పుడున్న ఉత్పత్తులకు దెబ్బ అనీ, మనదేశ ఉత్పత్తులకు ప్రోత్సాహమివ్వాలే తప్ప నిరుత్సాహపరచరాదనీ, లాభాలన్నీ విదేశాలకి వెళితే మార్కెట్ బలహీనపడే పరిస్థితులు ఎదురవుతాయనీ వీరు తీవ్రంగా వాదిస్తున్నారు. ఇప్పటికే కొన్ని కోట్ల రూపాయల్ని వెచ్చించి భారీయెత్తున నిర్మించిన ప్లాంట్లన్నీ ఈ "గ్లామర్" పానీయ ప్రవేశంవలన తిరిగి కోలుకోలేని నష్టాల్ని ఎదుర్కొంటాయని భావిస్తున్నారందరూ.

పెప్సి కంపెనీ నహకారంతో పంజాబ్‌లో సాఫ్ట్‌డ్రింక్ తయారుచేయడానికి పంజాబ్ ఆగ్రో ఇండస్ట్రీస్ తాతాలకు చెందిన వాల్టాస్ కంపెనీ సిద్ధంగా వున్నాయి. పండ్ల దిగుబడికి పంజాబ్ భూవాతావరణ పరిస్థితులు అనుకూలంగా వుండటంవల్ల అక్కడే ఈ ప్లాంట్లను నెలకొల్పాలని అనుకొంటున్నారు. మనదేశంలోని మొత్తం పారిశ్రామిక పెట్టుబడిలో ఇది



కేవలం ఒకశాతం మాత్రమే అని వారు అంటున్నా వ్యతిరేకత మాత్రం హెచ్చుగానే కనిపిస్తోంది. ఈమాత్రం మనం తయారుచేసు కోలేమా అంటున్నారు.

ప్రస్తుతం ప్రపంచంలో 151 దేశాల్లో పెప్సీ కోలా శాఖలు 15,000 దాకా వున్నాయి. అలాంటి భారీ కంపెనీ మన మార్కెట్లోకి రాబోతుందంటే ఇప్పటికే వున్న శీతల పానీయాల సంస్థలు ఆందోళన చెందటం సహజమే.

అయితే ఈ కొత్త సంస్థ అవతరణవలన పంజాబ్ వ్యవసాయరంగంలో సాంకేతిక అభివృద్ధి, జరిగి విదేశీమారకద్రవ్యం సమస్య, నిరుద్యోగ సమస్య అంతమవుతాయని అనుకూలవర్గాలవారి వాదం. పంజాబ్ చుట్టుపక్కలున్న రాష్ట్రాలు కూడా ఇందువలన అభివృద్ధి చెందే అవకాశం వున్నప్పుడు పెప్సీ ప్రవేశం గురించి వెనకాడకూడదని వారి వాదన. పైగా రాబోయే పదేళ్లలో 200 కోట్ల విదేశమారక ద్రవ్యాన్ని

సంపాదించవచ్చని ఈ కంపెనీలు భరోసా ఇస్తున్నాయి. పార్లే కంపెనీ అందిస్తున్న డ్రింక్సు కంటే తక్కువ ధరకి వినియోగదారులకి అందుబాటులోకి తెస్తామని కూడా అంటున్నారు పెప్సీ కంపెనీవారు.

పెప్సీకోలాయే గనుక మన మార్కెట్లోకి వస్తే, చిన్నతరహా కూల్‌డ్రింక్ పరిశ్రమలు, స్వయంఉపాధి పథకంకింద ఏర్పడిన సంస్థలు మూతపడే అవకాశం వుంది.

ఓ వక్క ఇండియన్ సాఫ్ట్ డ్రింక్స్ మార్కెట్లో స్థిరంగా నిలిచిన భారతీయ కంపెనీలు, మరో వక్క పెప్సీకోలా. వీటిమధ్య ఏ డ్రింకైనా చాలు మా దప్పిక తీర్చడానికి, కానైతే ధరలు మాత్రం మాకు అందుబాటులో వుండాలని ఆశవడుతున్న పానీయాల ప్రియులు! ఇంతాచేసి ఇదంతా అవసరమేనా అనుకోవచ్చు సామాన్యులు.

–వీణ






నవమాసాలు మోసి ప్రాణప్రదంగా పెంచిన తల్లిని, కోరింది ఏనాడూ కాదనని తండ్రిని వదలి అర్ధరాత్రివేళ అపరబుద్ధుని లా ఇంటి నుండి నిష్క్రమించడాకొడుకు. వెళ్తూవెళ్తూ కన్నతండ్రిని "నాన్నా" అనిగాక "ప్రియమైన చలపతిరావుగారికి" అని సంభోదిస్తూ లేఖ రాసి వెళ్లటంలోని అంతర్యం ఏమిటీ? నవమాసాలు మోసిపెంచిన తల్లికి అతను "కన్నబిడ్డ" కాకుండా మరేమవుతాడు? కాదంటాడతను? ఇదెలా సాధ్యం? ఏమిటా మిస్టరీ?

"రేపటిమనుషు"లంటే ఎవరు? ఏమిటి వారి ప్రత్యేకత?

**రాపేటి రామకృష్ణారావుగారి సరికొత్త తరహా ఆలోచనాత్మక నవల "రేపటిమనుషులు" చదవండి,**

**చతుర** జూన్ 1988 సంచికలో.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/402